శ్రీ సద్గురవేనమః.

# శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదం అను సుజ్ఞాన శాస్త్రము.

శ్రీ మదచలగురుమూర్తియగు

పోకల - శేషాచలము నాయనివారి

శిష్యుండగు

పోలకం - నరసింహం శెట్టి గారిచే

రచియింపంబడి,

తద్గురుపుత్త్రులగు

ఆశుకవి శిఖామణి

పోకల - వేంకట నరసింహారావు నాయనిచే

సవరింపఁబడినది



పైవారివద్ద ఈగ్రంథ స్వతంత్ర హక్కునుపొందిన

వెస్టువార్డు అండు కంపెనివారి,

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రచురింపఁబడినది

నెం. 12, ఇన్‌స్పెక్టరు సుబ్రాయలు నాయుడువీధి,

చాకలపేట, మదరాసు 21.

8-వ కూర్పు 2000

# విషయసూచిక. 

పుట సంఖ్య


| | | |
|---|---|---|
| 1. | ద్వారకాపురవర్ణన | 3 |
| 2. | శ్రీకృష్ణరుక్మిణీ సంవాద ప్రారంభము | 6 |
| 3. | సాధన చతుష్టయములు | 9 |
| 4. | చతుర్విధ పురుషార్థ లక్షణము | 10 |
| 5. | గురుమూర్తి ప్రభావము | 14 |
| 6. | దైవ లక్షణము | 17 |
| 7. | భాగవత లక్షణము | 21 |
| 8. | జీవహింస లక్షణము | 23 |
| 9. | ఆశ్రమ లక్షణము | 26 |
| 10. | కుల లక్షణము | 28 |
| 11. | పిండోత్పత్తి లక్షణము | 34 |
| 12. | ప్రాప్తకర్మ లక్షణము | 34 |
| 13. | భక్తి లక్షణము | 37 |
| 14. | కర్మ లక్షణము | 38 |
| 15. | యమదండన వివరణము | 41 |
| 16. | యోగ లక్షణము | 47 |
| 17. | అష్టాంగ లక్షణము | 48 |
| 18. | పంచముద్రల లక్షణము | 49 |
| 19. | ప్రపంచోత్పత్తి లక్షణము | 51 |
| 20. | సాంఖ్య లక్షణము | 52 |
| 21. | తారక లక్షణము | 56 |
| 22. | జీవాత్మ పరమాత్మ లక్షణము | 64 |
| 23. | తనుచతుష్టయ నిర్ణయము | 65 |
| 24. | షట్చక్ర నిర్ణయము | 66 |
| 25. | హంస లక్షణము | 71 |
| 26. | భగవంతుని విశ్వరూప లక్షణము | 78 |
| 27. | కాలప్రమాణ లక్షణము | 82 |
| 28. | మిథ్యాజగల్లక్షణము | 88 |
| 29. | మరణ చిహ్నములు | 95 |
| 30. | అచలభావము | 97 |


విషయసూచిక - సంపూర్ణము.



అచలగురుడు పోకల - శేషాచలస్వాములవారు



పోలకం - నరసింహంసెట్టి

శ్రీ సద్గురవేనమః

# శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదం బను

# సుజ్ఞాన శాస్త్రము.



## ప్రథమాశ్వాసము.

శ్రీ గురునాథునిన్ బరమ - సిద్ధుని నద్వయు నప్రమేయునిన్ । రాగవికార దూరుని నిరంజను నిర్గుణు నిర్వికారుని । న్నాగమవేద్యు సర్వమయు - నక్షరు నవ్యయుఁ గేవలాత్మునిన్ । బాగుగఁగొల్చి యే నిపుడుఁ - బ్రార్థనఁజేతు నభీష్టసిద్ధికై ॥౧॥ తోటకము॥ మూర్తులకాదిమ - మూర్తియటంచున్ । మూర్తులు వేల్పులు - మున్నుఁగదా మే । మూర్తిగణింతురో - ముఖ్యముగా నా । మూర్తివినాయక - మూర్తిఁదలంతున్ ॥౨॥ ఉ॥ సారసగర్భ చక్రధర - శంకరనాముల నాదివేల్పులై । శారద లక్ష్మి పార్వతుల - శక్తులుగాఁగొని లోకజాలము । గ్గోరియొనర్పఁగావఁగను - గూల్ప వశీకరులైన ధన్యులన్ । గూరిమిఁగొల్చి వాణి రమ - గోత్రజ దేవుల సన్నుతించెదన్ ॥౩॥ ఉ॥ ఒక్కపసిండి పెక్కునగ - లొప్పగ నొక్కయ దేవదానవుల్ । దిక్కులు పంచభూతములు - దిక్పతులు న్మునిమూర్తులుంబుధుల్ । చుక్కలు మర్త్యులింద్రరవి - సోమనగాదిసమస్తవస్తువుల్ । మక్కువ నొక్కఁడైనపర । మాత్మను గూర్చి భజింతు నెమ్మదిన్ ॥౪॥ క॥ నరసుర లోకములెల్లన । మరియున్నను లేకయున్న - మాయనెఱుఁగకే । నిరతంబు బట్టబయలగు । పరిపూర్ణ బ్రహ్మమునకుఁ - బ్రణుతియొనర్తున్ ॥౫॥ తే-గీ॥ అవని భాగవతోత్తము - లనఁగఁబరఁగు । నట్టి ప్రహ్లాద భీష్మగ - యాంబరీష । శౌనకవ్యాసబలిశుక । జనకనార । దార్జునాది మహాత్ముల - నభినుతింతు॥ ౬॥ సీ॥ పరఁగ వేమనయోగిఁ - బ్రకటించిపలుమాఱు - శ్రీధరస్వామి ప్ర - సిద్ధిఁబొగడి । తివిరి శ్రీశివరామ - దీక్షితు సేవించి - శ్రీకృష్ణదాసుని - జింతసేసి । చెంచురాజార్యుల - జిత్తంబులో నెంచి - కోటప్పదేవర - గొల్చి భక్తి । వరుసగా నాంధ్రగీర్వాణ కవులనెల్ల - భావించి వేత్వేఱ - బ్రస్తుతించి॥ తే-గీ॥ యచల భావజ్ఞులై

నట్టి యాఖిలబుధుల । పాదపద్మంబులకు మ్రొక్కి భక్తిమీఱ । నతులమౌ నీదుకృపనొక్క ॥ కృతినినిపుడు । సేయఁబూనితి గురురాయ చిత్తగింపు॥ ౭॥ తే-గీ॥ ఆంధ్రగీర్వాణతర్కశా । వ్యాకరణములు । ఛందవేదాది శాస్త్రముల్ చదువలేదు।గురువరోత్తమ భవదీయ కరుణఁ జేసి । తెలఁగి యీకావ్యమేను రచింతునిపుడు॥ ౮॥ చ॥ ధరనపశబ్దయుక్తమయి దైవనుతంబుగఁ జేయుకావ్యమౌ । సరసిజబంధుఁడుల్ బొడమునట్టి దివసంబు విధంబు భాసిలున్ । అరయ సుశబ్దయుక్తమయి యాత్మవిచారము లేని కావ్యమౌ।సరసపుఁజుక్కలుండియును జంద్రుఁడు దోఁచని రాత్రి చందమౌ ॥ ౯॥ ఆ-వె॥ సత్యవంతునకు జక్కఁదనంబులే । సత్యమునకుఁ గొఱంతరాదు । గాననట్లుమోక్ష గ్రంథంబునకు లక్షణములుతొలఁగియున్న నాదిచెడునె॥ ౧౦॥ క॥ అని యిందుఁ దప్పుగల దిట । ననిదిద్దియునొప్పఁజేతు రాద్యులనుచు నె । మ్మనమున నెంచి వచించెద । నెనయఁగ మజ్జన్మక్రమము నించుక దెలియన్॥ ౧౧॥ సీ॥ క్షితిఁ గందుకూరను సీమతోఁ జేరిన పమిడిపాడను గ్రామ పక్షమునందుఁ । గల గోనుగుంట సద్బలిజ కులాబ్ధిందుఁ - డలఘు కర్పూరగోత్రజలజభానుఁ । డయిన పోలకము వెంగనకు నర్సాంబసద్ధర్భకు ద్రిమమౌక్తికంబనంగ లక్ష్మీనృసింహుండు లలినొప్పినాతని - దేవి లక్ష్మీయనంగ దేజరిల్లె॥ తే-గీ॥ ధర్మగుణముల నయ్యరుం ధతియనంగఁ । బొల్చుసాధ్వికి నమ్మహాపుణ్యనకును । బుట్టితిమి యేవురమునొక్క పుత్రియుతము । నారసింహుండ నేనందు నగ్రజుండ॥ ౧౨॥ క॥ వరుసఁగఁగొండయ వెంగయ ॥ మఱిరామయ యనఁగ నక్కమాంబ యనంగాఁ । బరఁగుదురు కడమవారలు।ధరనుత్తమ గుణులు సత్య - ధనులు సధర్ముల్॥ ౧౩॥ సీ॥ ధారుణిశ్రీపోతులూరి వీరబ్రహ్మ-మునకు సద్భక్తుఁడై ముదముమీఱఁ । జెలఁగె దూదేకుల సిద్దప్ప యతనికి - లీల జంగమమర లింగమయ్యె ॥ శిష్యుఁడా తనికిని శేషరాజననొప్పి - రహినతనికిఁ జెంచు రాజుసేవ। కుండయ్యనతనికిఁ గోటప్పదేవర-శేషాచలాహ్వయుల్ శిష్యులైరి॥ తే-గీ॥ కోరిశివరామదీక్షితుఁ గొల్చెరామ । కృష్ణుఁడుమహేశ్వరుఁడతని కృపనుబడసె।నతనిఁ గోటప్ప దేవర యాశ్రయించె । నతని సేవించె శేషాచలార్యవరుఁడు॥ ౧౪॥ మ॥ పరిపూర్ణాచల భావశీలుఁడయి తద్భావంబుగ్రంథంబులన్ । విరచింపన్ దనుశిష్య కోటిగొలువన్ విఖ్యాతినింబొందిసుస్థిరుఁడై చెన్నపురంబునం దెసఁగునా శేషాచలాభఖ్యమ । ద్గురు

మూర్తి౯ మదినెంతు భక్తిమెయి నశేత్తుర్యద్బుద్ధి నప్రశాంతము౯॥ ౧౭॥
సీ॥ ఒనర నేనొక్కనాఁ డొకకావ్య మొనరింపఁదొడంగి యేకథఁజేయుఁదోపకాత్మఁ గనుమూయుమద్దేశి కునియట్లు శ్రీహరి - నాకుఁ బ్రసన్నుఁడై నన్నుఁజేరి। రూఢిగా శ్రీకృష్ణ రుక్మిణీసంవాద-మగునట్లు నాపేర నంకితంబుఁ। జేయుఁగృతార్థతఁ జెందుసర్వాభ్యమముల్ - వాయుభవంబులు వాయునీకు॥ తే-గీ॥ ననుచుఁజెప్పితిరోహితుండయ్యె నంత। నట్టిమేల్కాంచియేను నా నందమొదవ। నాతపంబును ఫలియించె నాదుకోర్కె। తెల్లసమకూరెననిపొంగి యుల్లమునను॥ ౧౮॥ చ॥ తనువుదొలంగిచూచినను దైవము దేశికుఁ డొక్కఁడంచునా। మనమున నెంచి సర్వమయు మాటికిఁగొల్చిముదంబు నెక్కొన౯। ఘనముగఁ గృష్ణరుక్మిణులఁ గారణభూతులఁ జేసి యెంతయు౯। దెనుఁగున నేఁ బ్రబంధము కృ తింపఁగబూనితిదైవతాఖ్యగ౯॥ ౧౯॥ షష్ఠ్యంతములు,
క॥ సర్వోత్తమునకు గురునకు। సర్వాత్మకు నిర్మలునకు సర్వమునకు౯। సర్వేశ్వరునకు జ్యోతికి।సర్వాధారునకు హరికిసర్వమయునకు౯॥ ౧౦॥
క॥ సురమునిగణ పూజితునకుఁ। బరమాత్మకు విగతగుణికి భవదూరునకు౯। దురితరహితునకు నిహపర। భరితునకు౯ జిన్మయునకు భగవంతునకు౯॥ ౧౧॥ క॥ రూపరహితునకు సర్వ। వ్యాపకునకు వాదభేద వర్జితునకు స। ద్రూపునకును నఖిలజగ।ద్దీపకునకుఁగామరహిత దివ్యాత్మునకు౯॥ ౨౦॥ క॥ నిరుపమునకు శాశ్వతునకుఁ। బరబయలగు నిర్వికల్ప పరమపదునకు౯ నిరతునకుఁ గేవలాత్మకుఁ। బరునకునచలునకు సర్వ పరిపూర్ణునకు౯॥ ౨౧॥ కథా ప్రారంభము, తే-గీ॥ ఒప్పనంబు గనేనిపుడు చెప్పఁబూనినట్టి గ్రంథంబునకు మొదలెట్టిదనినఁ। బుడమిలోపల ద్వారకాపుర మనఁగఁ। బరఁగునొకరమ్యమైనట్టి పట్టణంబు॥ ౨౨॥ క॥ పదిరెండామడలునిడుపుఁ। బదిరెండామడలు వెడల్పుఁ। బట్టణమదియొ।యుదధికి నడుమను నెంతో। ముదమొప్పఁగ విశ్వకర్మ మునుగావించె౯॥ ౨౩॥ తే-గీ॥ స్వర్గవైకుంఠకైలాస సత్యలోక। ములను బురుడించు వైభవ ములనుమించి। రౌప్యకాంచన సదముల రత్నమయము। లగుచు వెలుఁగొందు గేహంబు లగణితముగ॥ ౨౪॥ క॥ కనకమణిమయము లగుచును। గొనకొని గగనంబునంటు గోపురములచే। నను వొందులోహనిర్మిత।ఘనతర ప్రాకారస ప్త కంబవ్వీట౯॥ ౨౫॥ క॥ మకరాదిసకలజలచర। నికరంబుల కునికియగుచు నెంతోలోతై। ప్రకటింపఁజెలఁగుపరిఖయు। నకలంకంబగుచుఁబురికి నాలుగుదెసల౯॥ ౨౬॥

చ॥ కమలదళాప్తరథ్యములకెక్కుడుగా వేగములైన గుఱ్ఱముల్ । అమరఁగ దిగ్గజంబులకు నారయమించిన హస్తియూథముల్ । యమభటకోటి నైన మడిఁ యంతముఁజేయఁగఁజాలు భృత్యులున్ । సమముగుభూధరంబులకుఁ జక్కనితేరులు నప్పురంబునన్॥ ౨౭॥ తే-గీ॥ దేవకాంతలరూపము దాగడనొప్పు । నందములచేతఁ బెంపొందు నిందుముఖులు । చక్కఁదనమునఁజంద్రుని ధిక్కరింపఁ । జాలుపురుషులు గలరందు లాలితముగ॥ ౨౮॥ క॥ సుందర సుకుమారత్వము।లందున నవగానవిద్యలందున మహదా। నందవయోవిభవంబులఁ గందర్పునిముంపఁజాలు గణికా తతులున్। ౨౯॥ చ॥ ఎనయఁగ బ్రహ్మవేత్తలగు సిద్ధమనస్కులు భూసురోత్తముల్ । ఘనమగువిక్రమస్ఫురణ గల్గియధర్మము లేని క్షత్రియుల్ । ధనముననా కుబేరునకుఁ దారును హెచ్చినటించు వైశ్యులున్। బనుపడ సేవ్యవృత్తిగురుభక్తియుఁగల్గినశూద్రులప్పురిన్॥ ౩౦॥ క॥ కోమరగు మకరతోరణ । సముదయములు వెలయుచుండు సకలదిశలతో ఘుమఘుమ వాసనలొదవెడి । రమణీయంబైనయట్టి రాతెరువులతోన్॥ ౩౧॥ తే-గీ॥ వీధివీధులనంగళ్లు విమలముగను । గామితార్థంబు లెల్లను గలిగియుండు । గణన సేయ గరానట్టి మణులచేత। దానిసరిపోల్ప రాదు రత్నాకరంబు॥ ౩౨॥ చ॥ కొనకొని మేడలందు బలుగోపురపఙ్క్తులనాటినట్టియా । ఘనతరమైన సోమరవి కాంత శిలాతతులందు సొంపుగాఁ । గనబడు నీడలంగనియుఁ గల్వర మొందుచుఁ బెక్కుభంగులన్। జనములనేక సూర్యులని చంద్రులు పెక్కని జూతురప్పురిన్॥ ౩౩॥ తే-గీ॥ హంస కోకిల కీరంబు లమ్మయూర । మాదిపక్షులకెల్లను నదియునిలయ । మగుచుఁజందన మాకంద మాదివృక్ష । రాజిచే నొప్పుచుండు నా రామములును॥ ౩౪॥ క॥ జలజములు నల్లకలువలు।సులలితమగు చంద్రకాంత సోపానగతుల్ । గలిగిబహునిర్మలోదక। ములచే శోభిల్లుచుండు నింకిపోనిసరస్సుల్॥ ౩౫॥ ఉ॥ ఆపురిరమ్య హర్మ్యములు నాపురికోటలుగోపురంబులు । న్నాపురిరాజమార్గములు నాపురిసొంపు విశాలగేహముల్ । ఆపుర రామశీమలును నాపురదివ్యతటాకవర్గముల్ । ఆపురవైభవంబులును నారయబ్రహ్మకునైనశక్యమే॥ ౩౬॥ క॥ కోరికనుంగొనవెంతటి । శూరులకును వశముగాదు శోధింపఁగనే । చోరులకు నలవిగాదిఁక । నే రిపులకుఁజొరనశక్య మిలనాప్రోలున్॥ ౩౭॥ క॥ ఆపట్టణంబునకుసరి । యేపట్టణమైనజగతి నెన్నఁగరాదా । నాపురిగాపురముండెడు । నాపుణ్యులభాగ్యమింత యనఁగావశమే॥ ౩౮॥ క॥ ఆనగర

మేలుధీరుఁడు । మానిత విజ్ఞానమయుఁడు మాయాపహరుఁడున్ । నానా
లోకగురుండును । నానిగమాంతుండుకృష్ణుఁ డనఁగా వెలయున్॥ ౩౯॥
క॥ పదునాలుగు భువనంబులు । పదపడి తనయందునిలిపి బ్రహ్మాదు
లకున్ । మదిఁదెలియరాక నిర్గుణపదమున భాసిల్లునతఁడు పరిపూర్ణుండై॥
౪౦॥ తే-గీ॥ అష్టభార్యలతోడను నధిక సౌఖ్య । మనుభవించుచు నిర
తంబు మునులతోడ । గోష్ఠిసల్పుచు నేమిటఁ గొఱఁతలేక । చక్రధ
రుఁడుండె నత్యంత సంభ్రమమున॥ ౪౧॥ క॥ ఆరీతి నందసూనుఁడు ।
వారక సాందీపు వలనఁ బడసినవిద్యన్ । గోరినభక్తులకిచ్చుచుఁ। గూరి
మిమీఱంగమార గడుఁడుండుతఱిన్॥ ౪౨॥ చ॥ సతతము రుక్మిణీస
తియు సాధుచరిత్రయుముక్తిఁగోరి దాఁ । బతికడభక్త కోటుకొడఁ
బాయక భక్తివహించుమార్గమున్ । హితమతిఁజూచి చూచియుదియేగ
తినాకులభంచుఁగాత యం । చతివయు భర్తపేఁడుటకుఁ సంశయమొం
దుచు సిగ్గుఁబొందుచున్॥ ౪౩॥ తోటకము॥ ఎన్నిదినంబులకీగతినున్నా
నున్నదెసార్థక మూరకఁనుంచున్ । బన్నుగనప్పుడ భర్తనువేఁడన్।
దిన్నగనాచెలి తెంపువహించెన్॥ ౪౪॥ వ॥ అంత ఉ॥ ఆచ్చపలాక్షి
యాపగఁ యచ్యుతుఁజేరఁగ లేకయాత్మలో । మచ్చిక నెంచెనిట్లుహరి
మానిని కేల యటంచు నెంచునో । యిచ్చునో లేక కారణము నీయక
యెంతయుఁగోపగించునో । హెచ్చగునాదుపూర్వఫల మెట్టులనున్నదో
యంచుఁజింతిలున్॥ ౪౫॥ సీ॥ వనితమోక్షమునందు వాంఛయొక్కటె
గాని - కొండొకధర్మంబుఁ గోరదయ్యె । స్నానంబుఁజేయదు చలు
వలుగట్టదు - పువ్వుముల్పెట్టదు భూషలిడదు । గంధంబుఁబూయదు
కస్తూరితిలకంబు దిద్దదుకాటుకఁ దీర్చదబల । కీరంబుఁబిల్వదు కేకి
హంసలఁబ్రోవ - దలకోకిల పల్కు లాదరింప॥ తే-గీ॥ దన్నపానాది
తమలంబు లంటదతివ । భోగమును నిద్రఁగోరదు - పుణ్యచరిత। చెలు
లఁగన్నెత్తిచూడదు చెలులవలన । సేవఁగైకోదుపల్కదు చెలుల
తోడ॥ ౪౬॥ చ॥ పడఁతుక యింతకాలమును బాయకనాథుని చెంతనుం
డియున్ । దడయుట కేమి కారణమొ దామును జేసినయట్టి పుణ్యమి ।
య్యెడనొనఁగూడఁగావలయు నింతికిభానుఁడుగ్రుంకునంతలో। నొడలను
బ్రాణముల్నిలుపనోపదు తాఁగనునొక్కయేడుగన్ ॥ ౪౭॥ స్వాగతము॥
వారిజాక్షితన వల్లభుఁజేరన్ । మారుతంద్రితను మన్ననసేయన్ ।
గోరియున్నతన కోర్కెయుఁదీఱన్ । శౌరినెమ్మదిని సారెకునెంచున్॥
౪౮॥ వ॥ అట్టియెడ, సీ॥ నేనున్నవిభుచెంత నెలఁతపోరాదని - యేగ

నోయనుభంగి నినుఁడుగ్రుంకె । ముద్రలై దనుగాంచుచు ముదితయీతె
అఁగన్న - కరణిసాంధ్యారాగ - కాంతిదోఁచె । సకలభూతంబులుసత్యఁ
బుగను నున్న - చందంబుతారకా బృందమొప్పె।సుజ్ఞానమను వెల్గుఁ
జూడక విడనన్న - గతినిలఁదమమెల్ల గప్పుగొనియెఁ॥ తే గీ॥ దరుని
యజ్ఞానతమమెల్ల దగ్ధమనుచుఁ । దెలివియను మేటిసుజ్ఞాన తేజమమరు।
ననుచుఁజాటినగతిఁజంద్రుఁడంబరమునఁ॥ వెలఁగియుదయించెఁదిమిరేభ
సింహమగుచు ॥౯॥ ఉత్సాహ॥ సరసమైన హేమరత్న సౌధమందున
ప్పుడా।సరసిజాక్షుఁడంతసార సాన్నముల్భుజించియున్।వరసుభూషణాంబ
రాదివస్తుతేపనాదులున్ । గరముఁదాల్చి హంసతూలికంబుఁజేరియుండ
గన్॥౧౦॥ చ॥ అతివయు రాత్రిమంచిసమయంబనియెంచి భుజించినించి
స।మ్మతిఁబతిఁ జేరగాఁదలచి మంజుసుగంధములెల్ల బూసి తా । నతు
లిత వస్త్రముల్తొడవు లాదిగఁబెట్టి త్రిలోకమోహినీ । గతిఁబొడసూపి
నాయువతి కాంతునిఁజేరుట వింతదోఁపగన్॥ ౧౧॥ తామరసవృత్తము॥
కలిగొనిమోదము కాంతకునంతన్ । దొలఁగెనుశంకయుఁ దోఁచెను
ధైర్యం । బలరె వివేకము భక్తిన్ ముక్తిన్ । దెలియగ ముక్తిని దీవ్ర
మునొందెన్ ॥౧౨॥ సీ॥ పతిదైవమనియాత్మ భావించుసేవించుఁ
బూజించువందనం బుల నొనర్చు । పరునిదక్కను నన్య పురుషుల
గలనైన - గన్నెత్తిచూడదా కమలనయన । ధవునకుఁబరిచర్యఁదాన్గా
నర్చునుగాని - సేవకులనునేరెఁ జేయనీదు । చనువిచ్చినను భర్త సతి
గురుత్వము భక్తిఁ - దప్పదు విభునాజ్ఞ । దాటదెపుడు ॥ తే-గీ॥ కామ
రత్నంబు పట్టంపు రాణిసుగుణి । దివ్యచారిత్ర రుక్మిణీ దేవిమిగుల।
భక్తివెలయంగఁ జనుదెంచి పద్మనాభు । పాదపద్మములకుమ్రొక్కి
పల్కెనిట్లు॥౧౩॥ ఉ॥ ఓపరమాత్మ విశ్వముఖ యో పరమేశ్వర యోప
రాత్పరా యోపరవస్తురూపహరి యోదురితాంతక యోకృపానిధీ।
యోపరహంస సర్వసమ యోమునివందిత యోమహాప్రభో నాపలు
కాదరించిదయ నన్నిఁకఁ బ్రోవుము ప్రాణనాయకా ॥౧౪॥ ఆ-వె॥
సారిదిజీవునకును సుఖదుఃఖములు రెండు । జన్మజన్మములను సంభ
వించు । జన్మవలన నేమి సౌఖ్యంబుగనరాదు । గానజీవుఁడెట్లు గాంచు
ముక్తి॥ ౧౫॥ క॥ జన్మంబేలావచ్చెనో । జన్మముఁదప్పించుకొనెడు సాధ
నమిఁక నీ । జన్మమునఁగలదొ లేదో । జన్మమురోసితిని ముక్తి సాధనకొ
అకున్। ౧౬॥ తే-గీ॥ ఎన్నిదినములుబ్రతికిన నేమిఫలము । కాటికేగద
యీమాయ-కాయమరయ।చచ్చిచచ్చియుఁ బుట్టంగఁజాలశ్రమములు।

తిరిగిపుట్టని మార్గంబుఁ ఽ దెలుపుమీశ॥ ౫౭॥ క॥ వరభక్తలోకరక్షక। పరిపరివిధములను నిన్నె ఽ ప్రార్థించెదనా। మొరవిని సతియునిద్రోయక। కరుణించియు నాదుజన్మఁ ఽ గడతేర్పదగుఁ॥ ౫౮॥ క॥ అనియిట్లువేఁడు రుక్మిణిఁ। గనియాపురుషోత్తముండు ఽ కడుమోదమునఁ। దనలోనె తారుమెచ్చుచుఁ। దనసతిమది నరయఁగోరి ఽ తానిట్లనియెఁ॥ ౫౯॥ తోటకము॥ భామిని నీదగు ఽ పల్కులు, నాహా! యేమివిచిత్రము! ఽ ఇందులకెందుఁ। గామితవాంఛలుఽగాకనుమోక్షం। బేమిపదార్థమో — యెన్నఁగదానిఁ॥ ౬౦॥ ఆ-వె॥ తరుణి నీదుచక్కఁ ఽ దనమునకీయలం। కారమునకుఁదగును ఽ కలికినాతోఁ గలసిపొమ్ముమోక్ష ఽ కాంక్షనీకేటికి। సురతకేళికంటె సుఖముగలదె॥ ౬౧॥ క॥ విను బ్రహ్మానందసుఖం। బునకంటెను హెచ్చుసుఖము ఽ భోగానందం। బని వచియించుటవినమే। వనజాసనుఁడాది దివిజ ఽ వర్గములెల్లన్॥ ౬౨॥ ఆ-వె॥ అనిన నిత్యమైనఽ యట్టి బ్రహ్మానంద। సుఖముకెనయెపోల్చి ఽ చూడమదన। కేళియల్పసుఖము ఽ కేవలం బని యన! నింతిఁజూచి శౌరి ఽ యిట్లులనియె॥ ౬౩॥ క॥ నీమాటలు నీతేఁటలుఁ। నీ మానసవృత్తితెగువ ఽ నీనేర్పులునుఁ। నీమదికింపగుఁగ కను। నామనమున కింపుగావు ఽ నళినదళాక్షీ॥ ౬౪॥ సీ॥ కాంచన నవరత్న ఽ కలిత నిర్మితమైన — మేడలున్నవి నీకు ఽ మెలఁగుటకును। వెలలేనిభూషణఽవితతులున్నవిదాల్ప—కనకాంబరములాది ఽ గలవుకట్ట। లీలకు హంసతూ ఽ లిక పాన్పులున్నవి — పూయుటకు సుగంధ ఽ ములునుగలవు। అష్టభార్యలలోన ఽ నధికురాలవునీవు పట్టంపురాణివై ఽ పరఁగుచుంటి॥ తే-గీ॥ వఖిలభోగంబులునుగల ఽ వనుభవింపఁ। జెలులుపెక్కండ్రుగలరు నీ ఽ సేవఁజేయఁ। గూర్మి సంతతిగలదేమి ఽ కొదువనీకుఁ। నింతకంటెను మోక్షంబ ఽ దెక్కువగునె॥ ౬౫॥ క॥ సారంబుద్రివర్గము ని। స్సారముమోక్షంబుగాఁగ సర్వజనులకున్। సారంబులేని మోక్షముఁ। గోరుటయిదివెఱ్ఱితనము ఽకోమలినీకున్॥ ౬౬॥ క॥ జగములయందుఁ త్రివర్గము। పొగడొందు సమస్తమునకుఁఽబూర్వక్రియగా। నెగడును మోక్షమునిష్క్రియ। యగుచుండఁగఁ గ్రియగనీకుఽనగుపడుటెట్లో॥ ౬౭॥ సీ॥ నావుడు నాపాసు ఽ దేవుని నీక్షించి — తెలివిమైరుక్మిణీ — దేవిపల్కె। నోపుండరీకాక్ష ఽ యొప్పుగానివియెల్ల — వచ్చునపుడుమనముఽ తెచ్చినామె। పోవునప్పుడునొక్క ఽ పుచ్చినవకైకొనఁ—గొంచుపోవుటయులేఽ దెంచిచూడ। సర్వంబుమధ్యనేఽసంభవంబయ్యెను — సర్వంబుమధ్యనే ఽ సమసిపోవు॥ తే-గీ॥ కలిమిలేములు

శాశ్వత ములునుగావు । నీటిపై బుగ్గ తనువును నిలువఁబోదు । అఖిలమును మాయనిత్యమై నట్టిపదముఁ । దెలియఁగోరిన దానను జలజనాభ॥ ౧౯॥ ఉ॥ తల్లియుఁ దండ్రియున్ గురుఁడు దైవమునీవని యెల్లప్రొద్దునా। యుల్లమునందునమ్మికొని యుంటిమహాత్మదయారసంబుచేఁ । గల్లయునిక్కమున్ దెలిపి గ్రక్కున మోక్షము నీవెయన్యమే । నొల్లను నీదు దివ్యపద యుగ్మముదక్కను భక్తవత్సలా॥ ౨౦॥ క॥ మీకుం దెలియని ధర్మము । లోకంబునఁగలదె సర్వ లోకశరణ్యా। మీకరుణఁగోరియుంటిని । జేకొనినను నీళ్లముంపు చేర్పుము పాలన్॥ ౨౧॥ క॥ నీతుల మీరలెఱుంగని । రీతిని మీయెదురఁగొన్ని రిక్తవచనముల్। ఖ్యాతిగఁ బల్కితినిప్పుడు । నాతప్పు క్షమించి దయను నన్నేలుహరీ॥ ౨౨॥ తే-గీ॥ అనిన సతిఁజూచికృష్ణుఁడాహ్లాదమొంది । సఖియలెల్లను సామాన్య సతులెగాని । యింతినీబుద్ధిఁజూడంగ నెంతొపెద్ద । యబలయెవ్వరు నీవలె నడుగరిట్లు॥ ౨౪॥ ఉ॥ ఎప్పుడునాదుసన్నిధిని నిందునిభానన నీవునిల్చి యీ । యిప్పటియట్లు మోక్షమును నెన్నఁడుఁగోరవుకోరియుండినన్। జెప్పుమునీవుమున్నుధరఁజేసినపుణ్యము వెంటనంటిని । న్నిప్పుడుపొందె నయ్యదియునీకునుగల్గె నమోఘవాక్యమున్॥ ఉ॥ లోకమునందు సంపదయు లోభములేకయ పుత్రిపుత్రులన్ । గైకొనఁగోరుచుందురు గాకలమోక్షముగోరరెవ్వరున్। నీకిటువంటి వాంఛితమునిక్కముగల్గుట చోద్యమయ్యెడిన్। బ్రాకటమైన నీవిమలభాగ్యమెభాగ్యము హంసగామినీ॥ ౨౪॥ క॥ రత్నములుదినుమరాళము। రత్నములనెగాని తినువె రాళ్ళనుగాంతా। రత్నమ నీవటుముక్తికి। యత్నించినదానివితర యత్నములేకే॥ ౨౫॥ తే-గీ॥ పడఁతి నీప్రశ్న త్రైలోక్య పావనంబు । అబ్జభవునకుఁదలపోసి యడుగరాని । గోప్యమడిగితి వదియెనా కోర్కెఫలము । నదియెనా పెద్దనిక్షేప మగుధనంబు॥ ౨౬॥ క॥ సంతతము నీవునాయెడ । నెంతయునెడతెగనిభక్తినెఱపుదుగానన్। ఇంతకు నీపైదయ నది । యెంతటిమర్మంబునైన నెఱిఁగింతుఁడగన్ । ౨౭॥ ఉ॥ మానిని విత్తమాదిగసమస్తముకంటెను హెచ్చుప్రాణముల్ ప్రాణముకంటె నెక్కువగుబ్రహ్మపదంబగు జ్ఞానవిత్తమున్ । ప్రాణమునైన నిచ్చుటకుఁబ్రాణములొప్పనుగానియేరికిన్ । జ్ఞానధనంబు నిచ్చుటకుసాధుజనంబులు సైప రెంతయున్॥ ౨౮॥ క॥ గురుభక్తిలేనివారికి నెఱిఁగింపఁగఁ బోల దిట్టి నిర్మలబోధన్ । గురుభక్తి గుదిరియుండిన । నరునకు నుపదేశమీయ నగునార్యులకున్॥ ౨౯॥ చ॥ భువినెనరైనఁ

గారణముఁ బొందఁగఁబెద్దల నాశ్రయించినన్ । బ్రవిమలచూడ్కి వారి నిజ భావముశోధనఁ జేసియీడగున్ నవరస మొలుక భూతలమున నందు నవేయ ఫలించుసస్యముల్ । చవిటిపొలంబు దున్నియును జల్లినవిత్తులు పండ నేర్చునే॥ ౧౦॥ ఉ॥ గౌరవ మొప్పఁ బెద్దలనఁ గా శతవృద్ధులుగారు విద్యలన్ । మీఱినవారుగారు భువి మేటి నగంబులయంత లేసివా । రారయఁగారు జ్యేష్ఠకుల మందుజనించినవారుగారు సూ । ధారుణిఁద మ్ముఁదా మెగను ధన్యులె పెద్దలు నిశ్చయంబుగన్॥ ౧౧॥ ఆ-వె॥ అట్టి వారి వెదకి పట్టియనుదినము । దేవ దేవుఁడంచు దెలిసికుదని । సేవఁ జేసియతని చిత్తంబు మెప్పించి।ముక్తిగాంచవలయు మొదలునరుఁడు॥ ౧౨॥ క॥ వనితామణి మోక్షమునకు । ననువొందఁగవలయుసాధనంబు లునాల్గున్ । మునుదెలియనగునుగావున వినిపించెద వినుముదాని విధ మునుధరణీ॥ ౧౩॥ సీ॥ వరుస నిత్యానిత్య వస్తువివేకంబు - కలిగియుండుట యొందు ఘనముగాను । మాత్ర వమనవిష్ఠ ములకాసలేనట్లు- లిహ స్వర్గభోగేచ్ఛ లేనిదొకటి । సంతతంబు శమాది షట్కమ సంపత్తి నలువొందుచుండెడు నదియునొకటి । మోక్షంబుకొఱకు నపేక్షించుటయు ముము - క్షుత్వమన నొకటి సరవినిట్టి॥ తే-గీ॥ సాధన చతుష్టయంబిల సంభవించు । నరుఁడె యధికారి మోక్షంబు నకును నట్లు।డట్టిశిష్యునిఁ గనిపెట్టి యాదరమున।పరదయామతి బోధించ।వల యుగురుఁడు॥ ౧౪॥ క॥ మేధావియైన నీకును । సాధనసంపత్తిగలదు సద్గుణములకున్ । సాధుచరిత్రవునీవీ । బోధకుఁడగు దింత్రివిమలబుద్ధివి గానన్॥ ౧౫॥ క॥ నాగురుఁడగు సాందీపుని । వేగమే మదినిల్పియిపుడు వెలఁదిరొనీకున్ । నా గురుమర్మముఁజెప్పెద । బాగుగవినుమింక భక్తి భావము మెఱయన్॥ ౧౬॥ తే-గీ॥ అవనిఁబరికించిచూడ మాసవుల యందుఁ । దీవ్రమోక్షేచ్ఛయనియును దిరముగాను।మందమోక్షేచ్ఛ యనియు న మరునురెండు । తెఱఁగులగుచుఁ దద్విధములఁ దెలియు మీవు" ౧౭॥ సీ॥ ఇల్లుగాలుచునుండ నింటిలోనిమనుజుఁ డెంతతీవ్రముబైటికేగ గోరు । ఘోరకానన మందు దారిఁదప్పిన నరుఁడెంత తీవ్రము మార్గమెఱుఁగఁగోరుఁ।బులి వెంబడించిన బులివాతఁబడకుఁడ- నెంతతీవ్రము మర్త్యుఁడేగఁగోరుఁ । బాముపైకొనిరాగఁ బాముచేఁ జిక్కక - యెంతతీవ్రము నరుం డేగఁగోరుఁ॥ తే-గీ॥ జోరులు దఱుమఁ జిక్కక చోరులకును।నెంతతీవ్రంబు మానవుం-డేగఁగోరు । నంత వేగం బునను బ్రయత్నంబుఁజేయు । నదియెపోతీవ్రమోక్షేచ్ఛ యనఁగఁ

బరఁగున్॥౧౮॥ క॥ ఒకకాలంబున నిమ్మహి । నొకనికినీ బాధలెల్ల నొద
వకయున్న । న్నొకయొకనికినొకయొకతఱి । నొకయొక యాపత్తుగలిగి
యుండగవచ్చున్॥౧౯॥ ఆ-వె॥ వనితమోక్షమునకు వలయు సాధనములు ।
సంఘటింపఁబడక జనుడు మోక్ష । మతులితముగఁగోరు నదియెంత
మోక్షేచ్ఛ । యంచుఁదెలియవలయు హంసగమన॥౨౦॥ సీ॥ తాపత్ర
యాగ్ని యీ తనువుదహించుచే-యిల్లంటుకొని కాలు బెంచిచూడఁ ।
దన్నుఁదా నెఱుఁగక తనువుదాననుకొంచె-దండకాటవిదారిఁ దప్పు
టయును । బొరిమనమింద్రియంబులవెంటఁ బాఱుటే - వ్యాఘ్రంబు
దఱుముక వచ్చుటయును । నరయ దుర్విషయంబులందు వర్తించుటే-
సర్పంబుగఱియుట సారసాక్షి॥ తే-గీ॥ యెలమిఁగామాది షడ్వర్గములె
యనంగ । నలరు దొంగలు పొంచుక నావివేక । మనెడు ధనమును నప
హరింప సంగఁజూచు । నదియె చోరులు దఱుముట యతివ వినుము॥
౨౧॥ ఆ-వె॥ ఇట్టిబాధలెల్ల నేకకాలంబున । సంభవించునట్టి జనుఁడు
గాని । యట్టిశ్రమలఁబాపు నట్టిసద్గురుఁజేరి । గట్టిగాను ముక్తిఁ గాంచఁ
బోఁడు॥౨౨॥ క॥ హరియిట్లు తెల్పఁగావిని । హరిణేక్షణ పల్కెనిట్లు
లంభోజాక్షా॥ పురుషార్థమెన్ని భంగులో । యెఱిఁగింపు మటన్నఁగృష్ణు
డిట్లను సతికిన్॥౨౩॥ సీ॥ గణుతింప ధర్మార్థ కామమోక్షములనఁ -
బురుషార్థములు నాల్గు భువిఁజెలంగు । యాత్రదానవ్రతయజ్ఞంబులాది
స - త్కర్మములు సేయుట ధర్మమయ్యెఁ । గాయంబు మిక్కిలి కష్టించి
యుక్తిచే-నర్థంబుఁగూర్చుట యర్థమయ్యెఁ బొలఁతుల కూటంబుఁ
బుత్రుల సౌఖ్యంబుఁ । గావలెనను వాంఛ కామమయ్యె॥ ఆ-వె॥ నీత్రి
వర్గమరసి నిత్యంబుగాదని । యచలగురునిభక్తి నాశ్రయించి । బ్రహ్మ
మెఱిఁగి జన్మ బంధంబులను బాసి । ముక్తిఁగనుట బుధులు మోక్ష
మంద్రు॥౨౪॥ క॥ పురుషార్థంబుల నందగుఁ । బొరిఁబొరి ధర్మార్థ కామ
ములనెఱుమూఁడున్ । బరమ పురుషార్థమనఁగను స్థిరముగ మోక్షంబె
యంచుఁ జెప్పుదు రార్యుల్॥౨౫॥ తే-గీ॥ చెలఁగి ధర్మార్థ కామముల్
జీవకోట్లు । కన్నిఁటికి నాచరింపగ నగునుగాని । మహిని మోక్షంబు
మాత్రంబు మానవులకు । నాచరించఁగఁదగినది యరసి చూడ॥ ౨౬॥
క॥ జన్మములకెల్ల మానవ । జన్మంబే యెఱుకగల్గు జన్మమగుటనీ । జన్మ
మునను ముక్తిగాంచక । జన్మముకడ తేరదన్య జన్మములందున్॥౨౭॥ క॥
జన్మంబుకోసియిఁకనే । జన్మంబును రాకమున్నె జనుఁడు పరమునన్ ।
దన్మయమందిన మఱలను । జన్మంబులు లేక జన్మ సాఫల్యమగున్॥౨౮॥

క॥ నరజన్మమెత్తినందుకు । సరగున మోక్షంబుగను టెపో సార్థకము అయ్యెన్ ।
మఱియితరజన్మములలోఁ । బరమరయఁగ దెల్వి లేక ప్రచురించుటచేన్॥
చ॥ గరిమ సమస్తజీవతతి కంటెను మానవులెక్కుడందురన్ । గరితలు
గాను బుట్టుటల కంటెను బూరుషజన్మ మెక్కుడౌఁ । బురుషులయందు
శాస్త్రపరి బోధనపండితులెక్కుడందురన్ । మఱినతిగోప్యమైన పర
మార్గమెఱింగిన ధన్యులుత్తముల్॥౧౦౦॥ ఆ-వె॥ పరమగురునికరుణం
బడసిన సతులైనఁ । బురుషులైన షండ పురుషులైన । మాచకమ్మలైన
మంచులు చండాలు । రైన ముక్తిఁగందు రంధులైన॥౧౦౧॥ చ॥ తను
వుపటుత్వముఙ్ వదలి తాతయునై వెతగాకమున్నగా । ఘనకఫవాతపై
త్యములు గప్పి మతిభ్రమరాకమున్నగాఁ । ఒనివడి కాలకింకరులు
పైఁబడితన్నొని పోకమున్నగాఁ । గనఁదగు నాపరాత్పరునిఁ గాయముఁ
బాయకయున్న యంతలోన్॥౧౦౨॥ ఆ-వె॥ సతుల సుతుల హితుల
సంపదఁజుట్టాల । నమ్మితన్నుఁదాను నరయలేక । భ్రాంతినొందువాని
బ్రదుకెల్లను బిసిని । కాయులోనిపురుగు గతిదలంప॥౧౦౩॥ ఉ॥ గట్టిగ
మోక్షకాంక్షయును గల్గనె గల్గదు భూమి నేరికిన్ । అట్టి విచారమెవ్వ
నికి నైననొకానొక వేళఁగల్గినన్ । గట్టడి నేఁడు రేపనుచుఁ గాలముఁ
బుచ్చునుగాని ముక్తిచే । పట్టఁడు బ్రహ్మకల్పములు పాయక తా నిల
నుండునట్లుగన్॥౧౦౪॥ క॥ మంచివచనములు విషమగు । మించిన కో
పంబువచ్చు మిక్కిలిపగసా । ధించెదరు బుధులపల్కులు । మంచివి
యని తెలియలేరు మందాత్ములొగిన్॥౧౦౫॥ సీ॥ కప్పకు నిలఁగల
కమలతేనియలేల - పందికిఁ బన్నీరు గంధమేల । పండునకును మంచి
సౌందర్యవతియేల - నంధునకు మెఱుఁగు టద్దమేల । కుక్కకు వపరంజి
కుళ్లాయియేలకోఁ - తికిని ముత్యాల పతకము నేల । కొమరొప్పఁ బిడు
దుకు గోక్షీరమదియేల - పేడపురుగునకు బెల్లమేల॥ తే-గీ॥ చెవిటి
వానికి మృదుగాన చవుల వేల । రూఢిఖరమునకును మృతరుచులవేల ।
తిరిరిగాడికిని దివ్య తీర్థమేల । ముంకుజనులకు నిజమోక్ష మార్గ
మేల॥౧౦౬॥ ఆ-వె॥ జంబుకమునకేల స్వర్గలోకంబును । గలయరత్న
ములు పికకంబుకేల । మాచకమ్మకేల మదనశాస్త్రంబును । మందమ
తులకేల మంచిబోధ॥ ఉ॥ చోరజనంబులందఱినిఁ జోరుల చందము
గందు రెంతయున్ । జారులు సెల్లవారలను జారులకై వడిఁజూతురెన్నఁ
గాఁ । గ్రూరులు సర్వమానవులఁ గ్రూరులరీతిని సెంతురట్టులే । నారకుఁ
గాంతురజ్ఞులును సద్గురులన్ దమవంటివాడుగన్॥౧౦౭॥ సీ॥ మాటనే

చ్చినవాని బూటకుండనియంద్రు – మాటలాడకయున్న మందుఁడంద్రు। సతులతో భాషింప జారపురుషుఁడంద్రు – జారుండు కాకున్న షండు డంద్రు । వన్నెపల్కులుగట్ట బలుహాయాలగాఁడంద్రు – గుడ్డమూసిన వాని మడ్డియందు । దరయఁజక్కనివాని నంనగాఁడందురు – రూపి గాకున్నఁగు రూపియంద్రు॥ తే-గీ॥ కల్లనిజమంద్రు నిజమును గల్ల యందు । రిట్లు నరులకు సహజంబు లిట్లుగాన । సర్వజనులకు నిలలోన సమ్మతముగ । నడువ లేరెంత సాధులు నైన జగతి॥ ౧౦౯॥ చ॥ జనముల కెల్ల లోకమున సమ్మతిగా నడువంగఁ గోరిదా । నెనయఁగ నెల్లవారి మది కింపుఘటింపఁగఁ బోవ నెంచువాఁ । డనువుగ వెండి నెవ్వరిని హర్ష మునొం దఁగ జేయలేక తాఁ । జెనఁటి యనంగ నన్నిటికిఁ జేటువహించిన బుద్ధి హీనుడై॥ ౧౧౦॥ ఉ॥ మంచి గుణంబు లేమికిని మంచినిఁ జెడ్డగఁ జెడ్డమం చిగా । నెంచుచునుంద్రు లోకమున నెంచిన నేమగుఁ జెడ్డఁ జెడ్డయే । మంచియు మంచియే యగును మానిని యిత్తడి కాంచనంబుగా । నెంచిన నౌనె హేమమును నిత్తడి గాఁగన నౌనె యట్టులన్॥ ౧౧౧॥ ఆ-వె॥ పేడ బెల్లమనిన బెల్లంబు గాఁబోదు । పేడయన్న గుడము పేడగాదు। పేడ పేడె యగును బెల్లంబు బెల్లమే।జ్ఞానిజ్ఞానె మూఢజనుఁడు జనుఁడె॥౧౧౨॥ క॥ జ్ఞానులనుజూచి యిలన।జ్ఞానుల దెగడుదురు బుద్ధి జాడ్యత దిగువన్ । శ్వానములకోట్లు మొఱిగిన । నేనుఁగు పైనున్నవాని కేమి భయమికన్ । ౧౧౩॥ సీ॥ ఘనుని నీచుండన్నఁ గాఁబోడు నీచుండు । ఘనుఁడన్న నీచుండు ఘనుడు గాడు । అంచను బకమన్నఁ గొంచ కానేరదు–గొంచ నంచ యనఁగ నంచగాదు । అవనిభూషణదూషణాదితిరస్కారముల రయఁగా దేహామునకుఁగాని । యాత్మకు లేవు రూపాతీతమైనాము–గుణ వర్జితంబయి కుదురుకతన॥ తే-గీ॥ నెవ్వరేమన్న నాత్మకు నేమి కొదువ । పరులు భూషింప లేనట్టి వాసి గాదు । పరులు దూషింప హెచ్చైన వన్నె చెడదు । ధరణి నొందరు మోదఖేదములు బుధులు॥ ౧౧౪॥ క॥ ఎవరే పల్కులు పల్కిన । నవి సాధులు వినియు వినని యట్టులఁ దామీ।భువిని నటింతురు వారలు । భవనాశస్థితులు లేని భావనులగుటన్॥ఆ-వె॥ తెరవ మానవులకుఁ ద్రికరణశుద్ధి లే । నట్టి కతన మాయ నమ్మి వివిధ । గతు లపెక్ష నమ్మకంబులు చెప్పిన । నమ్మలేరు నిజము నళిననేత్ర॥౧౧౫॥ ఉ॥ చచ్చినవారె ధన్యులని చాలనుతింతురు లోకమందునన్।జచ్చిన వారలున్ మగుడ జన్మకురాక యె యున్నధన్యులే । చచ్చియు నెప్పటట్టు లనె జన్మము లెత్తుదు రట్లుగా పునన్ । జచ్చియుఁ జావకుండియును। సౌఖ్య

ము లేదిఁక ముక్తిగాన కే॥౧౧౭॥ ఆ-వె॥ గురునిఁ జేరగల్గి ఽ గుప్తగాఁబర
మును దెలియఁగల్గిగొప్ప ఽ తెలివిగల్గి । మొనసిమృగములట్టుఁ ఽమూఢులై
యున్నక । చెడుదు రల్పమతులు ఽ సిద్ధముగను॥౧౧౮॥ క॥ విహగములు
యింటి కెగయుట । సహజంబగునేలదూరఁ ఽ జాలవటువలెన్ । బహువి
ధమాయలఁబొందుట। సహజముమూఢులకుముక్తిసాధ్యంబగునే॥౧౧౯॥
సీ॥ అర్థంబు భూములు । నార్జించఁగాదీఱు – ఘనమందిరంబులు ఽ గట్టఁ
దీఱు । సతులతో భోగింపఽ సౌఖ్యమొందఁగఁదీఱు । సుతుల వేడుకలెల్లఽ
జూడఁదీఱుఁ । బుట్టుముచ్చటలను – బ్రొద్దుపుచ్చఁగఁదీఱుఁ । దిరముగాఁ
బొరుగిండ్లు ఽ దిఱుగఁదీఱుఁ। గార్యంబుఁ బెంచుచుఽగలహమాడఁగఁదీఱుఁ।
జెలువుగాఁబరుల దూషింపదీఱు॥ తే-గీ॥ కోరినీచాత్ములను నెల్లఁ ఽ గొల్వఁ
దీఱు । మందమతులగు నీదుష్ట ఽ మానవులకుఁ। బవలురాత్రియుఁదీఱదు ఽ
పరమగురుని। చెంత జేరఁగఁబరమార్థ ఽ చింతఁ జేయ॥ ౧౨౦॥ చ॥ భరిత
తటాకనీరములు ఽ పానముఁ జేయక వాయసాదులున్ । మఱిగిన కుంభ
తోయములు ఽ మోదమురంజిల గ్రోలుకై వడిన్ । నరులును జన్మకర్మ
ములు ఽ నాశమొనర్చెడి ముక్తిపీడియున్ । బరిబరి నీచమార్గములఁబట్టి
నటింతురు ఽ స్వతంత్రులై॥ ౧౨౧॥ తే-గీ॥ మనుజులందఱు నొకలోక ఽ
మందెయున్న । నొకరిలోకంబులోనెన్న నొకరుగల్గ । రెవరిలోకంబువా
రిదే ఽ యెంచిచూడ । నొక్కలోకంబులోనుండు ఽ నోపరెవరు॥౧౨౨॥
క॥ చోరులకుఁ జోరచింతయు । జారులకును జారచింత ఽ జగతీశులకున్।
బోరాటంబులచింతయు । సార వివేకులకుఁ గల్గు ఽ సద్గతిచింతల్॥౧౨౩॥
చ॥ కమలమునందుఁ దేనియకుఁ ఽ గా బహుదూరముపోయి గ్రోలు నా।
భ్రమరమునట్లుబోధగను ఽ ప్రాజ్ఞుఁడుతా గురుఁడెందునుండినన్ । కమ
లముమీఁదఁగప్పయును ఽ గల్గిమరందముగాననట్లు లా । కుమతులెఱుం
గలేరు పర ఽ గోప్యము సద్గురు చెంతనుండియున్॥ ౧౨౪॥ ఆ-వె॥ గురు
నిమహిమ దెలియు ఽ గురుభక్తునకుఁగాక । యితర జనులకెల్ల ఽ నేమి
యెఱుక । తేనె తెరలజాడఁ ఽ దేనెటీగకుఁగాక । యితరమక్షికాళి ఽ
కెఱుకపడునె॥ ౧౨౫॥ క॥ మెఱుఁగైనయద్ద మంధుని । కరమునఁదాల్చి
యును మోము ఽ గనలేనట్లా । గురుఁడు తమయొద్దనుండియు। గురుమ
ర్మము దెలియలేరు । గ్రుడ్డిజనంబుల్॥ ౧౨౬॥ ఆ-వె॥ కడఁగిదర్పణంబె ఽ
గానని యంధుండు।తనదు వదనమెట్లు ఽ గనఁగనేర్చు।గురునిఁగానలేని ఽ
గ్రుడ్డివాఁడిలలోనఁ। బరముగాంచుటెట్లు ఽ పంకజాక్షి॥ ౧౨౭॥ క॥ అద్ద
ముపొడఁగను వానికి । నద్దంబునవానిరూప ఽ మగుపడు విధమా । పెద్ద

లఁ బోడఁ గవిసప్పుడె । తద్దయుఁ బరమార్థపతఁడు దప్పక గాంచున్ ॥ ౧౨౮ ॥
క॥ అనవద్యగురుని ప్రభావం । బన నెట్టిదో దెల్పుమనినఁ బద్మాక్షికి నిదయా ।
వనధియగు నందనందను । డను జెప్పఁ దొడంగె నిట్లు లున్న విధంబున్ ॥
౧౨౯ ॥ క॥ గురుఁడనగాఁ బరుడనఁదగుఁ । బరుఁడనగాఁ గేవలాత్మ
పరిపూర్ణుఁడగున్ । బరిపూర్ణుఁడె గురుఁడగు న । గ్గురు తెలిఁగినవాఁడె
జగతి గురుఁడగుఁ దరుణీ ॥ ౧౩౦ ॥ క॥ పరుడగు నా భగవంతుని । వరు
సఁ దెలుపు నతఁడె సుగురు నరుఁడెవఁడైనన్ గుఱిఁ దెల్ప నేరకుండిన ।
గురుఁడెట్లగు వాఁడు పశువు కుంభినిలోనన్ ॥ ౧౩౧ ॥ ఆ-వె॥ తల్లిదండ్రి
గురుఁడు దైవంబనుట చేతఁ । దల్లి బిడ్డకెల్లఁ దండ్రిఁ జూపు । నట్లుగు
రుఁడె శిష్యునకు దైవమును జూప । వలయుఁ జూమ్మియట్టి వాఁడెగు
రుఁడు ॥ ౧౩౨ ॥ క॥ గురుఁడే యజహరి రుద్రులు । గురుఁడే యింద్రుండు
దివిజ కుముదాప్తరవుల్ । గురుఁడే సర్వమయుండగు । గురునకు నితరం
బు లేదు కోరి వెదకినన్ ॥ ౧౩౩ ॥ క॥ పరమాత్మ నెఱుఁగఁ జేసిన । గురుఁ
డే భగవంతుఁ డిలను గుర్తెఱిఁగిన యా । గురుఁడే యిహపరములకును ।
గురుఁడగు నా గురుఁడె గురుఁడు గురువులకెల్లన్ ॥ ౧౩౪ ॥ క॥ గురుమ
హిమ దెలియ నెవ్వరి । తరమగు దేవతలకైన దలఁపఁగ వశమా । హరి
హర ధాతలు నాదిగ । గురుపదమే గతియటంచుఁ గొల్తురనిశమున్ ॥
౧౩౫ ॥ తే-గీ॥ మఱి గురువర్ణంబు మొదలింటి మాయదాని । నడఁచున
ట్టిదయ గురు వర్ణంబు గాన ॥ నరయ గురు శబ్దమీ భువనంబులకును ।
మించినది గురుమహిమ చూ నెంచ వశమె ॥ ౧౩౬ ॥ క॥ నరుఁడెట్లు గురుఁ
డగునని । గురుమర్మము దెలియలేక కూయు కుమతులా । నరులకుఁ దె
ల్పునె పశువులు । నరయంగాఁ దెల్పకున్న నరుఁడే గురుఁడా ॥ ౧౩౭ ॥
తే-గీ॥ నరుఁడు గురుఁ డెటులగునని యనిన వినుము । నరకులంబుఁ
బుట్టిన నరుఁడు లెస్స । గురుకులంబున మెలఁగిన గురుఁడె యగును । అన్య
జాతికీటం బళియైనయట్లు ॥ ౧౩౮ ॥ క॥ ధరణీసమస్తముకంటెను । గురుఁ
డధికుఁడు స్మరణకంటెఁ గుఱియధికంబా ॥ గుఱికంటె మిగులు ముక్తియుఁ ।
బరికింపగ ముక్తికంటె భక్తి ఘనంబా ॥ ౧౩౯ ॥ క॥ ముక్తికి మూలము
భక్తియ । భక్తికి మూలంబు ముక్తి బ్రహ్మాదులకున్ । ముక్తికి గురుఁడే
మూలము । భక్తియె లేకున్న ముక్తి పడయఁగ వశమే ॥ ౧౪౦ ॥ చ॥ సుర
ముని యక్షకింపురుష సోమ దివాకర మూర్తులింద్రుడున్ । గరుడభు
జంగ దిక్పతుల కల్మషదానవ సిద్ధసాధ్యకి । న్నరవర రాజమంత్రు
లును నాదిసమస్తజనాళికి యిలన్ । బరమ పవిత్రమైనదియు భక్తి

యగాదె తరింపఁజేయఁగన్ ॥౧౨౧॥ క॥ గురుమహిమ యిట్టిదనుచును ।
గురు తెలియఁగఁగ లేక మాయ కూపములోనన్ । జొరనయ్యో నరులు సద్గురు ।
మఱుగెఱుఁగక యున్న ముక్తి మార్గముఁ గలదే ॥౧౨౨॥ ఆ-వె॥ నిక్కమైన
గురుఁడు । చిక్కుట కష్టంబు । టక్కుగురుల కెంచ లెక్కలేదు । అరయ
కాంచనంబు । నరుదులోకంబునఁ । గల్లపసిడి లేదె కొల్లగాను ॥౧౨౩॥
తే-గీ॥ వసుధదైవంబుఁ జూపిన వాఁడె గురుఁడు । గనిన యాతండె
శిష్యుండు గడఁకతోడఁ । బరముఁ జూపింపకయె గాదు పరమగురుఁడు ।
చూడకయె గాఁడు శిష్యుండు సుస్థిరముగ ॥౧౨౪॥ చ॥ సరసుల చెంతఁ
జేరినను సాధుగుణంబులు వచ్చు నేరికిన్ । దురితజనాళి సఖ్యమున దుష్ట
గుణంబులుగల్గు నెట్లన । న్నిరవుగ వర్షబిందువులు నిల్చిన రేగడనీరు
త్రియ్యనౌ । సరసిజనేత్ర చౌటఁబడి చవ్వలు నుప్పలుగావె యిమ్మహిన్ ॥
౧౨౫॥ ఆ-వె॥ సలిలతైలచేల ములకు సుగంధసూనముల చెల్మి తావి
నవివహించు । సరణిసూరిజనుల సాంగత్యమున వచ్చు । సద్గుణములు
మూఢ జనులకైన ॥౧౨౬॥ క॥ ఖ్యాతిగ సద్గురు జేరియు । జ్యోతినిఁగవ
లేక బాహ్య చోద్యంబులచేఁ । గోఁతులవలెఁ జరియించెడి । పాతకు
లకు నెట్లుగల్గు భవ్యగుణంబుల్ ॥౧౨౭॥ క॥ అని తెల్పగురుమహా
త్మ్యము । వినియద్భుతమంది బ్రహ్మవిద్యయనంగా । వినియుండ నెట్టి
దోయది । వినిపింపు మటన్న సతికి విభుఁడిట్లనియెన్ ॥౧౨౮॥ ఆ-వె॥
అబల బ్రహ్మవిద్య యనఁగ వేఱొక్కటే । బ్రహ్మ నెఱుఁగునదియె బ్రహ్మ
విద్య । యదియ సర్వకర్మ లడుగంటగాఁజేయు । జన్మబంధములను
సమయఁజేయు ॥౧౨౯॥ క॥ విద్యలకెల్లను మొదలిటి । విద్యయు భావింప
బ్రహ్మవిద్యయె యఁకనే । విద్యలు దానికిసమముగు । విద్యల నరయంగ
లేవు విశ్వములోనన్ ॥౧౩౦॥ ఆ-వె॥ బ్రహ్మపదము దెలియఁ బడు
విద్యయదిగాన । బ్రహ్మవిద్యయంచుఁ బలుకఁబడియె । నట్టివిద్య గురుని
యనుమతివడసిన । యతఁడె బ్రహ్మవేత్త యనఁగనొప్పు ॥౧౩౧॥ క॥
అఱువది నాలుగు విద్యలు । వరుసగ సద్గురునివలనఁ బడసితినేనున్ ।
మఱియా విద్యలచేతను బరమార్థముఁ బడయ రాదు పరికింపంగన్ ॥౧౩౨॥
క॥ ధర నావిద్యల నేర్చిన । నరులకు నెటువంటి పనులు । నగుఁగావున నా ।
గిరినొక్క వ్రేల నెత్తితి । విరివిగ నేనింక నట్టివిద్యంగాదే ॥౧౩౩॥ తే-గీ॥
అట్టివిద్యలచేఁ గాదె యరయఁబదియు । నాఱువేలగు గోపిక లంద
ఱికిని ॥ నన్నిరూపులఁ దోఁచితి నాకు నింక । సాధ్యమును గాని పను
లెవ్వి జగతి లేవు ॥౧౩౪॥ క॥ కలయే విద్యలు సర్వము । కలయే

మెంతంత పనులు ఽ గావించిననా । కలఁబాయఁ ద్రోయునట్టిది ॥ గల యంగా బ్రహ్మవిద్య ఽ గాంచఁగవలయుఁ॥ ౧౫౭॥ తే-గీ॥ బ్రహ్మ సూ త్రంబుగాన నా ఽ బ్రహ్మవిద్య । సాధ్యమునుగాక విడిచిరిఽసర్వజనులు। సకల కార్యంబులును జేయఽ శక్తియున్నఁ। బడయరాదది మర్మంబు ఽ బ్రహ్మ విద్య॥ ౧౫౮॥ క॥ సురపతికి వాణిపతికిని । సిరిపతికిం గౌరి పతికి ఽ సిద్ధపతులకుఁ । ధరణీపతులకు మించిన । దరయంగా బ్రహ్మ విద్య ఽ యఘనుఁమృగాక్షీ॥ ౧౫౯॥ తే-గీ॥ వివిధకార్యంబులును జేయు ఽ వేళనదలు । బ్రహ్మవిద్యయె యిదియని ఽ పల్కుటరయఁ । బరఽగనీపను లివియెంత ఽ బ్రహ్మవిద్య । నాచరింపగ రాదను ఽ నర్థమయ్యె॥ ౧౬౦॥ క॥ కోటికి విద్యలు నేర్చినఁ । గూటికె సరిపోయె బ్రతుకుఽకుంభినిలోనా। నాటకధారుని గన్గొను । పాటియదే । బ్రహ్మవిద్యఽవడయంగఁదగుఁ॥ ౧౬౧॥ క॥ పట్టినను బ్రహ్మవిద్యయె । పట్టఁగవలెఁగానియితర ఽ పామర విద్యల్ । పట్టుపడి మరల మరలను । బుట్టియుఁ జావంగ నేల ఽ బూటక మాయఁ॥ ౧౬౨॥ తే-గీ॥ కాననా బ్రహ్మవిద్యను ఽ గాంచుటకును।సర్వ కాలంబు గురుసేవ ఽ సల్పునట్టి । ధన్యులకుఁ గాక యన్యుల ఽ తరమె తెలియఁ । గష్ట సాధ్యమా నావిద్య ఽ ఘనులకైన॥ ౧౬౩॥ ఉ॥ చక్కఁ గనిల్చి ధీరతను ఽ సద్గురుబోధను నాయుధంబుచేఁ । గుక్కనుజంపిసూక రము ఽ గూల్చి మదేభము గెంటిమువ్వుర।న్నొక్కడఁగించి శత్రువుల ఽ నోపిక నార్వురఁద్రుంచిమాయలఁ । జిక్కక మేటిబ్రహ్మమునుఽ జెంది నవారికిఁ గల్గుమోక్షముఁ॥ ౧౬౪॥ ఆ-వె॥ తాపత్రయములఁ ఽ తల్లడి ల్లుచు నీవు । గుణత్రయముల వాన ఽ నాత్రయాది । బద్ధులగుచు నరులుఽ బడలుత్రయావస్థ । లోనజిక్కిమాయఽగాననేరు॥ ౧౬౫॥ చ॥ తనువుల నెంత పెంచినను ఽ దప్పదుమృత్యువు వచ్చునెప్పుడో । పనుపడఁగుక్క నక్కలకుఁ ఽ బాల్పడుమేనులమ్మి యిమ్మహిఁ । మనుజులు మాయలం బడుట ఽ మక్షికముల్ మధుకాంక్షఁబోయి యం । దెనయఁగఁజొచ్చియు న్వెడల ఽ నేరక చిక్కిన చందమాఁ దురఁ॥ ౧౬౬॥ సీ॥ సకల యజ్ఞ ములాది ఽ సతతంబుఁ జేయుట – నఖిల విద్యలునేర్చి ఽ యధికుఁడౌట । భూమిఁబండించుట ఽ భూచక్ర మేలుట – కొలువుండుటకు పొట్టకూటికొ అకె । గాని ముక్తికిఁగాదుఽఘనముగా బహురీతిఁ .. గడగండ్లుపడ నేల ఽ కడుపుకొఱకుఁ । గ్రిమిమృగ పశుపక్షి ఽ కీటకాదులనెల్లఁ – జెలఁగి యేయత్నముల్ ఽ సేసిబ్రతుకుఁ । గాన వాంఛింపకయెఽతృప్తిగలుఁగు నంచు । గట్టిగాఁ దెలిసి పరంబు ఽ గానకున్న । నితర జీవులకంటెను ఽ

నెన్ననదుఁడు । నథముఁడెకాని పరికింప ॱ నధికుఁడగునె॥ ౧౬౫॥ ఉ॥
తల్లులు దండ్రులాప్తులును ॱ దారసుతాదులు బంధుసోదరుల్ । కల్లగు నేఁడి
కెవ్వరికి ॱ గారడి మాయ యటంచు రందఱున్ । గల్లని యన్నమాత్ర
మున ॱ గారడిమాయయు లీడఁబోవునే । కల్లనిజంబెఱుంగకయెॱగంధ
గజేంద్ర సమానగామినీ॥ ౧౬౬॥ క॥ అనినఁ ద్రిమూర్తులై దైవము ।
లని వారల నామజపము ॱ లను ప్రతిమారా । ధనలును నెవ్వరు ఫలమే ।
మని యడిగిన సతికిఁ గంస ॱ హరుఁడిట్లనియెన్॥ ౧౬౭॥ తే-గీ॥ దైవమొ

—: దైవలక్షణము. :—

క్కండె యనుమాట ॱ ధాత్రిలోన । సహజముగఁ బల్కుదురు సర్వ ॱ
జనులు నతఁడు । నెందు నున్నాఁడొ యెవ్వరు ॱ నెఱుఁగలేరు । అతనిఁ
గానక జగమెల్లॱనంధులైరి॥ ౧౬౮॥ చ॥ విరివిగ బ్రహ్మదైవమని ॱ విష్ణు
నియల్లని యీశ్వరుండునా । హరిహయుఁడంచు విఘ్నపతి ॱ యంచుఁ
జెహోవయటంచు భూతముల్ । తరణి సుధాకరాద్యనల ॱ తారలశక్తుల
నాదిగొల్తురి । తెఱఁగున నంతకంటె మునుॱ దేవుండులేకయే వీరుపు
ట్టిరే॥ ౧౬౯॥ క॥ శ్రీవనితయంచుఁ గొందఱు। భావింతురు వాణియంచుఁ ॱ
బలువురు గౌరీ । దేవియని కొందఱిట్లుగ । వేవేల విధంబులాత్మॱవిధము
దెలియకన్॥ ౧౭౦॥ ఉ॥ పట్టుగమూడుమూర్తులను ॱ భాను నిశాకర దేవ
దైత్యులన్ । దిట్టతసాగరంబులునుॱ దిక్పతు లెల్లయుఁదారలున్ గిరుల్ ।
నెట్టనఁబంచభూతములు ॱ నింద్రుఁడెహోవయు నెల్లలోకముల్ । పుట్టక
మున్ గలండుసుమిॱపుట్టును గిట్టును లేనిదైవమున్॥౧౭౧॥ సీ॥ అజుఁడు దై
వంబని ॱ యనుటమాత్రమెగాని - వానికి జన్మరూ ॱ పములుగలవు ।
విష్ణుదైవంబని ॱ వివరించుటేగాని - వానికి జన్మరూ ॱ పములుగలవు ।
శివుఁడుదైవంబని ॱ చింతసేయుటె గాని ॱ వానికి జన్మరూ ॱ పములు
గలవు । మఱియు నింద్రాదిదైవ ॱ మని వచించుటెగాని-వానికిజన్మరూॱ
పములుగలవు॥ ౧౭౨॥ తే-గీ॥ దలఁపఁగాను మీనాద్యవॱతారములును ।
దైవములన జన్మము లవ ॱ తారములకుఁ । గలవగుట జన్మరూపముల్
గల్గినట్టి । వార లెవ్వరుగారు దై ॱ వములు జగతి॥౧౭౩॥ఏ॥ చ॥ పరఁగ
నెహోవయాదిఁజను ॱ పండొకటిం దినకన్నఁదిన్నచో । సరగున నాతనిన్న
తడు సంతతి పాపులుగా శపించుటన్ । నరకమునుండి సద్వ్రతునిॱవక్రమ
వర్తికి మోక్షమిచ్చుట ॱ నరయఁగ దైవ మెట్లగునుॱనాతఁడు మేనువహిం
చియుండఁగన్॥౧౭౪॥ చ॥ వరుసగనల్ల వేదములు ॱ వ్రాసిమహాత్మ్మదు
కిమ్మటంచుఁదా।నిరవుగ దేవదూతలకు ॱ నిచ్చినభంబుననుండిపంపుటన్।

ధరణిని లేక యుండుటను దైవము తా నెటులయ్యె నాతఁడున్ । దిరముగ నింద్రియంబులును దేహము గల్గిన వాఁడె చూడఁగన్॥ ౧౭౩॥ ఆ-వె॥ ఏమి లేనివాని కేమియు లేదు సం । కల్పమున్నయపుడె గల్గుమనము । మనము గల్గినపుడె మఱి యింద్రియములుండు । నింద్రియంబులున్న నెగడుఁదనువు॥ ౧౭౪॥ క॥ తనువెపుడు గలిగియున్నదో । జనియించినవాఁడె యతఁడు చావును బొందున్ । జననాది మరణముల చే । తను బరఁగిన వాఁడు నెట్లు దైవంబు నగున్॥ ౧౭౫॥ ఉ॥ గట్టిగ సర్వజీవులును గర్మవశంబున జన్మమొందఁగాఁ । బుట్టినవాని దేవుఁడని బుద్ధిదలంచుట ధర్మమార్గమే । పుట్టినదెల్ల మాయయగుఁ బుట్టనిగిట్టని వాఁడు దేవుఁడౌ । నట్టివిధంబు గానకను నందఱు గ్రుంకిరి మాయవారధిన్॥ ౧౭౬॥ తే-గీ॥ దైవ మెవ్వండొ వానినే దలఁచవలయుఁ గాని వారల భావింపఁ గారెవరును । వెలయఁ దమ తండ్రియుండంగ వేఱెయొకనిఁ । దండ్రిమాఱుగ భావింపఁ దండ్రి యగునె॥ ౧౭౭॥ క॥ శ్రీవిభుని నజుని శంభుని । దేవేంద్రుని దేవతలను దేవులటంచున్ । భావింప నేల తమలో । దేవుఁడు వెలుగొందుచుండ దినని శి యనకన్॥ ౧౭౮॥ క॥ ఎందునఁ జూచిన దేవుఁడు । సందేహము లేక యుండ సర్వమయుండై । యెందో కలఁడని వెదకెడి । మందాత్ములకెట్లు ముక్తి మార్గము గల్గున్॥ ౧౭౯॥ క॥ గురుమూర్తి కరుణ లేకయె । పరతత్వముఁ గాంచరాదు బ్రహ్మకునైనన్ । నరులెంత వారలైన నుదరమగునే తమకుఁదామె దర్శింపంగన్॥ ౧౮౦॥ క॥ రామా యని శివశివ యని । వేమాఱులు నోట గొణఁగి విపరీతముగా । నేమి ఘటించిరి యాత్మా । రామునిఁ గనుఁగొనక ముక్తి రాదు తలంపన్॥ ౧౮౧॥ ఆ-వె॥ అన్న విన్నమనిన నాఁకలి దీరదుఁ । దినినఁ గాని కుత్తు దీఱిపోదు । కాశికాశి యనినఁ గాశికిఁ బోరాదు । దీపమన్న వెలుఁగు రూపుగాదు।

౧౮౨॥ సీ॥ కూడు నీళ్ళంటని వాఁడు దేవుడంద్రు-ప్రీతినై వేద్యముల్ పెట్టుటెట్లు । దివ్యాన్నములు పెట్టఁ దినునె యాదేవుండు దినకున్నఁ బెట్టినా దిప్పలేమి । తనకుఁ బెట్టెడువాఁడు దైవమే యందురు-తాము పెట్టుటయెట్లు దైవమునకుఁ । దామ్రమృణ్మయ లోహ దారుపాషాణాది-ప్రతిమల సేవింప ఫలము గలదె । బయలుగానక నీరీతిఁ బ్రజలు సేయు । చిత్రములనెల్ల మర్కట చేష్టలనుచు । నింతయును మాని నిజగురు చెంతఁ జేరి । పరముఁ గాంచిన మోక్షంబుఁ బడయవచ్చు॥ ౧౮౩॥ ఆ-వె॥ దైవమునకు బదులు దారులోహశిలాది । తతులఁ బెట్టికొల్వ దైవమగునె । పసిఁడికిత్తడినుము బదులుగాఁ బెట్టినఁ । బసిఁడియగునె

వట్టి ƒ భ్రాంతిగాక॥ ౧౮౭॥ సీ॥ అయమాత్మ బ్రహ్మమా ƒ నను వేద
వచనంబు-గలిగియున్నట్టియా ƒ కారణమునఁ। బ్రతిమార్చనముకంటెఁ ƒ
బరఁగ నాత్మారాధ - నము విశేషంబగు ƒ నట్లుగాన। నాత్మ రూపం
బున ƒ నఖిల దేహములందు - భగవంతుఁడేయుండి। ప్రబలుక తనఁ।
దలఁపంగ నాత్మ సం ƒ తర్పణంబేపర - మాత్మ సంతర్పణం ƒ బగును
గాన॥ తే-గీ॥ నరులచేఁ గల్పితంబునౌ ƒ నాత్మ లేని। ప్రతిమ లర్చించి
సంతుష్టి ƒ పఱచుటెట్లు। లిష్టఫలములు తమకవి ƒ యిచ్చుటెట్లు। నరుల
చేష్టలు దలపోయ ƒ నవ్వుబాట్లు॥ ౧౮౮॥ వ॥ సీ॥ జ్ఞానమార్గమెఱుంగ ƒ
జాలని జడులచేఁ-బ్రతిమార్చనంబులు ƒ ప్రబలమాయె। జ్ఞానంబుగురు
నిచేఁ ƒ గాంచినధన్యులు - ప్రతిమలారాధింపఁ ƒ బరఁగ రెపుడు।
మూఢులై ప్రతిమలఁ ƒ బూజించుటేగాని - చెప్పనే మోక్ష సం ƒ సిద్ధి
తెరువు। విశ్వంబులోనాత్మ ƒ వేత్తనుసేవించి-పూజించి సాష్టాంగ ƒ ములు
నొనర్ప॥ తే-గీ॥ సాంఖ్యమును దారకామన ƒ స్కములఁదెల్పి। జ్ఞాన
మార్గం బెఱింగించి ƒ కడకు నచల। భావమెంతయు సూచించి ƒ ప్రజల
మోక్ష। గతినిఁ జెందఁగఁ జేయును ƒ గాక గురుఁడు॥ ౧౮౯॥ చి॥ ఉ॥ తేఁకువ
సర్వమేనులకు ƒ దేవుఁడె తారక మాచు నెప్పుడు। స్నేక మయాత్మరూప
మున ƒ నెందునజూచిన నందెయుండఁగా। లోకులు వేఱు భ్రాంతినవ ƒ లోక
నసేతురు వానిఁగానకే। మేఁకనుజంకఁ బెట్టుకొని ƒ మేదిని నారయు గొల్ల
చందమై॥ ౧౯౦॥ సీ॥ తాము న్నచోటను ƒ దైవంబు లేదని-పామర జను
లుర్వి ƒ భ్రాంతులగుచు। శ్రీరంగమునఁ గాశి ƒ చిత్రకూటము సేతు - మేటి
తిరుపతులు రామ ƒ మేశ్వరంబు। కంచి తిరువళ్లూరు ƒ గయ ప్రయాగలు
జగ - న్నాథంబు భద్రాద్రి ƒ యాదిగాఁగఁ ƒ గల స్థలంబులకెల్ల ƒ వల
గొని పలుమాఱు - ద్రిమ్మరులై ప్రజలు ƒ దిరుగుచుండ్రు। కమలమిత్రు
నిందుఁ ƒ గానని యంధుండు। కాశికేగినైనఁ ƒ గానఁగలఁడె। దైవమిచ
టగాంచు ƒ ధన్యాత్ముఁ డెందైన। నిందుఁజూచినట్టే ƒ యందుఁజూచు॥
౧౯౧॥ క॥ ఇందున లేఁడని దేవుం। డందందునఁ దిరుగుచుండు ƒ రజ్ఞానులిల
న్నిండందు నెందు సర్వమునందునఁ గలఁడంచు జ్ఞాని ƒ యారయుచుండున్॥
౧౯౨॥ సీ॥ మిక్కిలి గఁ జదివి ƒ మిడుకుచుందురుగాని - తమలోని దైవంబుఁ ƒ
దలఁపలేరు। తీర్థయాత్రలకెల్లఁ ƒ దిరుగుచుందురుగాని - తమలోని దై
వంబుఁ ƒ దలఁపలేరు। జపతప వ్రతహోమ ƒ సరణిఁ జేతురుగాని-తమలోని
దైవంబు ƒ దలఁపలేరు। యజ్ఞదానాదుల ƒ నాచరింతురుగాని-తమలోని
దైవంబుఁ ƒ దలఁపలేరు॥ తే-గీ॥ బూటకములెల్లసల్పనో ƒ పుదురుగాని।

కడఁగితమలోని దైవంబుఁ * గాంచలేరు । చొక్కముగ సర్వవస్తువుల్ * జూడనేర్చి । తన్నుఁజూడంగనేరని * కన్నుఁబోలె॥ ౧౮౮॥ క॥ నేను నేన నుచు నెవ్వఁడు । మానక పలుకుచుచుండు * మానవుఁడరయన్ । నేనెవ్వఁ డన నితనుఁడాఁ గానఁడు దేహంబె తాను * గాఁగనుఁగొనుచున్॥ ౧౮౯॥ క॥ హరిహరధాతలకైనను । గురుఁడే దెల్పంగవలయు * గురుమర్మంబున్। నరులెన్ని పాట్లుపడినను । గురుమర్మము దెలియవశమె * కుంభినిలోనన్। ౧౯౦॥ క॥ కొందఱు వైకుంఠముపైఁ । గొందఱు కైలాసమందుఁ * గొంద ఱుస్వర్గం బందునఁ గొందఱు నజుపుర । మందున భ్రమఁగొందురవియు * మాయఁగనుమీ॥ ౧౯౧॥ చ॥ అరయఁగ సత్యలోకమున * కైశ్రమలేటికి నందుధాతకున్ । దరమిడివచ్చునూనములు * దప్పెనె పుత్రినిఁ బొందివం దుకై । వరసుతులందఱున్ననను * వంచన * జేయరె మన్మథారిచే। శిరమును గొట్టఁగాఁబడఁడె * సిద్ధముగాఁ బరమేష్ఠి యెంతయున్॥ ౧౯౨॥ క॥ ఘన మేవైకుంఠంబనఁ। బనివడి యచ్చోటద్వార * పాలకులనఁగాఁ। నొనరిన జయ విజయాదులుచని మరలనుమరలిరారె * జన్మంబులకున్॥ ౧౯౩॥ ఆ-వె॥ చింతసేయ నేఁడు * శివలోకమునకును । బ్రాప్తమునకుమించు * ఫలముగలదె। వెండికొండమీఁద * వెలయఁగనుండిన । నీశ్వరుండు భిక్షమెత్తవలసె॥ ౧౯౪॥ ఉ॥ మానవులింద్రభోగముః * మానసముంతురు స్వర్గనాథుఁడున్। గానని సౌఖ్యమన్యలకుఁ * గల్గునె గౌతమశాపవహ్నిచే । మేనునఁజీము రక్తములు * మెండుగ యోనులు గల్గియుండఁడే। తానొకపద్మనాళమున * దాఁగఁడె శక్రుఁడు పెద్దకాలమున్॥ ౧౯౫॥ క॥ తమకుంగలిగిన నిధులు । సమయంగాఁ జేసికొనఁగఁ * జాలనివారల్ । తమకెట్లు సుఖములిత్తురు । తమ ప్రాప్తము కొలఁదిగాక * తామెందున్నన్॥ ౧౯౬॥ ఆ-వె॥ జన్మసహితు లైన * జనులకునెల్లనీ । పదవులందు భ్రాంతి * పరఁగుజన్మ । శూన్యులిట్టి తుచ్ఛ * సుఖములుగోరరు । స్థిరపదంబువారు * చెందుకతన॥ ౧౯౭॥ క॥ మూర్తులనంగను గుణములె మూర్తులుగానెన్నుటకును * మూలము నవియే। మూర్తులపని తమదౌటఁ ద్రి । మూర్తులెయనిగుణములకును * మూటికివచ్చెన్॥ ౧౯౮॥ ఆ-వె॥ అగయరూపుఁ జేయు * నదియకారము దానిఁ । బెంచునది యుకార * మెంచిచూడ నదియు లయముఁజేయు * నది మకారంబగు । వీనిమూటిచేత * విశ్వమొప్పు॥ ౧౯౯॥ క॥ పరమేష్ఠిహరిహరాదులు । పరికింపఁగ వారివారి * పట్టణములకున్ । దొరలగుచుఁ బుణ్యజనులకు । స్థిరభోగములిత్తురంచుఁ * జెప్పుటవలనన్॥ ౨౦౦॥ ఆ-వె॥ మూడుపురములకును * మువ్వురుప్రభువులై । యులరుచుంటయునిజ * మన

ఘులైన ప్రజలకొఱకుఁ జేయు । పదవులునవిమాయ । వలనఁగల్పితంబులే వాజాక్షి॥ ౨౦౧॥ క॥ వారలువారిపురంబులు । నారయఁ ద్రిగుణముల వలన । నైరేగాక । వేఱద్ది పదవులకు నధి । కారులుగాకెవ్వఁడుగారులే కర్తలువారల్॥ ౨౦౨॥ ఆ-వె॥ అరయమూర్తులాది । యఖిలంబుఁద్రిగుణాది । కములచేతనైన । క్రమమువలనఁ । కర్తలెవ్వరిందుఁ । గారనిగట్టిగాఁ । జెప్పవలసెనిట్లు । చిగురుఁబోణి॥ ౨౦౩॥ క॥ నిరతిమమూర్తి త్రయమును । గరమరుదుఁగ బ్రళయమునెడల గాఢసుషుప్తిన్ । బొరలినకించుచునుండఁగ । నెఱివీరలెకర్తలంచు నెట్లనవచ్చున్ ॥ ౨౦౪॥ క॥ చూపును నామముకీర్తియు । వ్యాపారముపత్నిపుత్ర । వాంఛలచేతన్ । జూపబట్టి పోవుమూర్తులు । ప్రాపింపఁగ మాయగాని । బ్రహ్మం బగునే॥ ౨౦౫॥

—: భాగవత లక్షణము :—

చ॥ అనవుడు నుర్విభాగవతు । లందరు వారల భావ మెద్దియో । వనములనున్నయోగులకె । వాసిగమోక్షమటంచుదాన స । ద్ఘనవ్రతయాగతీర్థముల । కంటెను సద్గతిలేదటంచు నె । ట్లనెదరు వారిపద్ధతులనానతియిమ్మనశౌరి యిట్లనున్ ॥ ౨౦౬॥ క॥ సతి నీవడిగిన ప్రశ్నయు । నతివిమలము నివడిగిన । యదియేగాక । క్షితిలోన మాయవాదుల । గతులెల్లను నీకుఁదెలియఁగావినిపింతున్ ॥ ౨౦౭॥ ఆ-వె॥ భాగవతులమంచుఁ । బరమార్థమెఱుఁగక । ప్రబలితిరుగువారు భాగవతులె । భాగవతమనియెడు పదమునకర్థంబు । పరఁగఁదెలియువారె భాగవతులు॥ ౨౦౮॥ క॥ భాయనఁగభక్తియనియును । గాయనఁగాజ్ఞానమనియు గణుతింపఁదగున్ । వాయనవైరాగ్యంబని । తాయనమాయనఁగఁబరంగు తత్వముముక్తిన్ ॥ ౨౦౯॥ ఆ-వె। భాగవతమనినను । భగవంతునకునాఖ్య యలరుచుండునట్టి యర్థమెఱిఁగి । భక్తిమీఱునట్టి । భగవంతు నెఱిఁగిన । భక్తులెవ్వరైన భాగవతులె॥ ౨౧౦॥ క॥ భాగవతార్థము దెలియక । బాగుగ నిలమేము భాగ । వతుఁ మటంచున్ । రాగిలుచుండెడివారలు । భాగవతోత్తములుగారు పామరులరయన్ ॥ ౨౧౧॥ ఆ-వె॥ వసుధజ్ఞానభక్తివైరాగ్యపగతత్వ । మార్గములనుముక్తిమార్గుఁడగుచు । విగ్రహార్చనాది । వేల్పులభ్రమవీడి । పరముగన్నవారె । భాగవతులు॥ ౨౧౨॥ తే-గీ॥ ఎలమిఁదిరుమణిశ్రీచూర్ణ । ములను దిద్ది । తులసి పూసలు మెడనిండఁ దూఁగియాడ । పట్టువస్త్రంబులనుగట్టి । భ్రమసితిరుగు । పామరులు నెన్నఁటికిఁగారు । భాగవతులు॥ ౨౧౩॥ క॥ సుర పలల సేవసతులును । పురుషులు భువి నగ్నలగుచు । భోగింతు రదే । పరమని వావులుదలఁపక । ఖర శుని సూకర మృగములు

గలయు వెయుట్టుల్ ॥౨౧౧॥ ఆ-వె॥ మాసపుష్పరసము ఽ మలమూత్రవీర్యాది। కములె ముక్తియుంచుఁ ఽ గఱపువాఁడు । శ్వపచు సూకరాది ఽ సముఁ డగుఁగాక స । స్నానవుండెయతఁడు ఽ మదిఁదలంప॥ ౨౧౨॥ ఆ-వె॥ అవని నష్టపూర్తు ఽ లని తీర్థవల్లని। నీచ వస్తువులను ఽ నెసఁగఁగూర్చి కలిపి నీటఁ ద్రావ ఽ ఘటశుద్ధియానె యు । శుద్ధవస్తువు ల ఽ శుద్ధతనువు॥ ౨౧౩॥ఎ॥ ఆ-వె॥ అయ్యాలు పెరుమాళ్ల ఽ నారగింపులుసేసి । గాని మెక్కఁబోరె ఽ కడుపునిండ । నారగింపు లెన్ని ఽ యైనను నాఁకలి । చెడదు కుడువకున్న ఽ విడదు కుత్తు॥ ౨౧౪॥ బి॥ క॥ కూరిమి వర్ణాశ్రమములు । గోరికనీమంబు లాదిఁగొని భ్రమయక హృ । త్సారసమునఁ దనుఁగాంచిన । వారెవ్వరు నైన భాగవతులనఁ జెల్లున్॥ ౨౧౫॥ నెలఁతా వైష్ణవధర్మం। బలరఁగఁ గనువాఁడు చూవె ఽ భాగవతుండౌ । నిలనిట్టి నీచవర్తన। లలివేణీ సేయు నాతఁ డార్యుఁడగునే॥ ౨౧౬॥ క॥ దురితాచారంబనఁదగు । మఱియమ్మధుమాంస సంగమాదిక్రియలన్ । దొరంగి నధర్మపు వర్తనఁ। బరుపడిఁగ్గైకొన్నవారె భాగవతులిలన్॥ ౨౧౭॥ క॥ శశివదన నీకుఁదక్కను । విశదముగాఁ దెలియు తత్త్వ ఽ విదులకు దక్కన్ । పశుతుల్యులైన జనులకు। వశమే దెలియంగ భాగవత ధర్మంబున్॥౨౧౮॥ఆ-వె॥ ఊరనున్నముక్తి ఽ నొందఁగా రాదని । విపినమునకు నేగు ఽ వెఱ్ఱినరుఁడు। నడవియందెనెపుడు ఽ విడువక చరియించు । మృగవిహంగములకు ఽ మేలుగలదె॥ ౨౧౯॥చ॥ జడభరతుండు రాజ్యమును ఽ సర్వమువీడియు మోక్షకాంక్షచే। నడవికి నేగి జింక తగు ఽ లాటముచేతను లేడిజన్మమున్ । బడసియుఁగొన్ని నాళ్ళకును బాసి శరీరము విప్రజన్ముఁడై ।కడపట ముక్తినొందె నిఁక ఽ గానలనున్నను ముక్తి గల్గునే॥ ౨౨౦॥ తే-గీ॥ ఇల్లు నాలిని వర్జించి ఽ యిలను విడినఁ । గందమూలంబులను దిని ఽ గాననున్నఁ । దపన శీతంబులకు నోర్చి ఽ తపసియైనఁ । గాయమునుజిక్కఁ జేసిన ఽ మాయ దెగునె॥౨౨౧॥క॥ తనుఁదాఁ గనుఁగొనుపురుషుం । డనయంబు నింటనున్నఁ ఽ నందును ముక్తిన్ । దనుఁదాఁగానని మనుజుఁడు । వనమునఁ గల్పంబులున్నఁ ఽ బడయునె ముక్తి॥ ౨౨౨॥ ఆ-వె॥ మనసు కారణంబు ఽ మఱియెందునున్నను। నిండ్లు నడవి ముక్తి ఽ నియ్య గలవె । మనసులేనివాఁడు ఽ మందిరముననున్నఁ । గాననమున నున్నఁ ఽ గార్యమేమి॥౨౨౩॥క॥ ఆఁకటి కన్నము గుడువక। యాకులు కాయలును నముల ఽ నదిమోక్షంబే। యాకుల నెల్లను మేసెడు । మేఁకలకును ముక్తి గలదె ఽ మేదినిలోనన్॥ ౨౨౪॥ క॥ నెఱిఁగూడునీళ్లు ముట్టక । పరువడిఁ బైచీరలేక పసరమురీతిన్। దిరిగిన మోక్షము గల్గునె ।

పరికింపఁగ వారి వ్రాతళఫలమదిగాకన్॥ ౨౨౫॥ సీ॥ ఆదియందె నరులళ
కన్నంబు బుట్టించె-బసులకుఁ గల్పించెళ పచ్చిపూరి। ఫణికి నాహారంబుళ
పవనంబుగాఁ జేసె-నెఱ్ఱలకును మన్నుళ నేర్పరించెళవేఱుపురువ్వులకెల్లళ
వేఱులు గావించె-మేఁకల కలరించెళనాకులెల్ల। మధుపాళి కెల్లనుళమక
రంద మొనరించె-పేడ పురువ్వులకెల్లఁళ బేడఁ జేసె। నిట్టు లాహారమే
జీవిళకెట్టు లెట్టు। పెట్టవలె నట్టుదైవంబెళపెట్టియుండఁ।దమకు సృష్టించు
నన్నంబుఁళ దాము దినక యితర యాహారములు గొనళ నేమిఫలము॥
౨౨౬॥ తే-గీ॥ ఆత్మలింగంబు సేవింపళ నలవిగాక। దొంగపశువుకు
మెడబొండఁళ దొడఁగినట్లు। కంఠమున లింగకాయలుళగట్టినంత।మాత్ర
మున ముక్తిఁ గంపురేళమందు జనులు॥ ౨౨౭॥ క॥ పరమార్థముఁ గనఁ
జాలక।కొఅమాలిన నరులు గర్మళగురుముద్రలచే।నిరుభుజములు గాల్పిం
తురు। పరగంగా ముక్తిగలదెళపశువులుగాకన్॥ ౨౨౮॥ తే-గీ॥ భూతిదే
హంబునకు నెల్లఁబూసి।హరిణ చర్మవల్కలల రుద్రాక్షళపరులు కాయ।
వలువలును గమండల దండళములను నోలిఁ।బూనినంతనె మోక్షంబుళ
బొందువడునె॥ ౨౨౯॥ క॥ దానముల జన్మశూన్యము।గానేరదు నృగున
కంటెఁ గలరే బహుగా। ధేనువులు భూము లిచ్చిన। భూనాయకుఁ
డూసరెల్లిళపుట్టుచ్చఁగాఁడే॥ ౨౩౦॥ ఉ॥ వట్టి వికారమర్త్యులుపళవాస
మదెట్టి దెఱుంగఁజాలకే।యట్టె యభీష్ట వాసరముళలన్నముమానివటింతు
రాఁకలిం।బట్టఁగ లేక ప్రాణిమఁళభక్షణఁజేసియుగాదె తృప్తుడౌ। నిట్టి
వ్రతంబులున్ సలుపళనేమిఫలంబగు మానవాళికిన్॥ ౨౩౧॥ ఆ-వె॥ మదిర
కుంభమునకుళ మదిరంబుచే శుద్ధి। పొఁదనట్లు బుద్ధి - పూర్వకముగ।
జీవహింసఁ జేసిళ గావించుయాగంబు। పాప వృద్ధిగానిళఫలము గలదె॥
౨౩౨॥ క॥ తెలివి విహీనులు కొందఱు।నిలలోఁగల శక్తులకునుళనింపెసఁ
గంగన్।దలపోయఁగొన్ని జీవులబలియిత్తురుదోషమనకళఫలమదియగునే॥

జీవహింసలక్షణము.

౨౩౩॥ క॥ ధరజీవ హింసకంటెను।నిరయము వేఱొండు లేదుళనిఖిలము
నందున్। బరమాత్మ కల్గుఁ గావున। నరునకుఁ దగదెట్టిప్రాణిళ నంత
ముఁజేయన్॥ ౨౩౪॥ ఆ-వె॥ యజ్ఞ మనఁగ నాత్మళ యజ్ఞంబుగావింపళ
వలయుఁగానినుగుణళవంతులెల్ల।జీవహింసతోడఁళజెలఁగెడు యజ్ఞంబుఁ।
జేయఁ బోలదెంతళచెనటులైన॥ ౨౩౫॥ చ॥ కొనకొని యెన్ని ప్రాణులను
గోతురొ మానవు లన్ని మాఱులున్।దనరఁగ వాని రూపములఁళదాము
వహింతురు మానవాకృతుల్। గనునవి వారిచేతఁ దెగుళకై వడివానిని

గోయఁగాబడున్ । గనుఁగొనదాము సేయునల । కర్మఫలంబులురి త్తవోవునే।
౨౩౬॥ క॥ అనదుష్ట సింహ వృశ్చిక । ఫణులాదివధించు టెల్లఁ । బాపము
గాదె। మనుజు లిది సేయవచ్చునె। యనఁ బడఁతుకఁ జూచి పల్కె । హరి
ప్రీతుండై ॥ ౨౩౭॥ క॥ పరమాత్ముఁ డన్నిటను నా। దర మొప్పఁగ సముఁడు
నగుచుఁ । దన్నెఱింగిన స। త్పురుషుఁడు తానై వెల్గుచు। మరి సకలమునందు
సాక్షి । మాత్రుం డగుటన్ ॥ ౨౩౮॥ చ॥ తనరంగ దుష్టజంతువులు । ధాత్రి
ననేకుల కెగ్గుసేయుఁగా। పున వినుదుష్టశిక్షణము । బొల్పుగనీ యిల శిష్టర
క్షణం। బులు నొనరింప ధర్మ మగుఁ । బొంద దధర్మము దుష్టప్రాణులన్ ।
జనులకు మేలు గోరియును । జ పినఁ జంపఁగ వచ్చు నిమ్మహిన్ ॥౨౩౯॥
ఆ-వె॥ అట్లు చంపకున్న । నవికొన్ని ప్రాణుల। బాధసేయుఁగొన్ని । పర
గఁజంపుఁ । గాన సకలజీవ । గణసౌఖ్యముగ దుష్ట। జీవతతులనొంపఁ । జెంద
దఘము॥ ౨౪౦॥ క॥ తొలియవిచేసిన దుష్కృత। ములవలనను దుష్టజన్మ ।
ముల నొందుటయు । న్నిలజనులు గనినవానిని। బొలియించుట వానివాని ।
పూర్వకృతము లే॥ ౨౪౧॥ క॥ తననుం బొరిగిన నెదిరిం । చిన వానినిఁ
ద్రుంప నఘము । నందువలన షట్లనుదమున్ దగమృత్యువు । నొనరించెడి
వానిఁజంప । నొప్పగు జగతిన్॥ ౨౪౨॥ ఆ-వె॥ ఒరుల తెరువుపోక ।
యొగనీటఁగొన్నియు । నుర్వి గొన్ని బ్రతుకు । నోరు లేని । సాధుజంతువు
లను । జంపుట ధర్మమే । మాంసభక్షణంబు । మఱిఁగి ఖలులు॥ ౨౪౩॥
క॥ తీర్థస్నానము లాడఁగ । సార్థకమును గలదెయందు । జలచరములకే।
సార్థకము వచ్చునంతటి । సార్థకమే గల్గునట్టి । స్నానంబులచేన్ ॥౨౪౪॥
ఆ-వె॥ తనువుతోడ స్వర్గ । మునకుఁబోయినవారె। ధన్యులం బ్రుతెనువు । దగి
లినవుడె। చావుగల్గు పిదప । జన్మంబు గలుగును। గాన ముక్తి పదము। గాదది
యును॥ క॥ సుతులిలను లేనివారికి । గతులే లేవందు రెవుడు । కర్మవికా
రుల్ । సతిసుతులు లేవి మారుత । సుతుఁడును నాభీష్మ నృపతి । సుగతిం
గనరే॥ ౨౪౫॥ ఆ-వె॥ గృహమునందు నుండి । యిలకులంబుననుండి ।
యిహమునందు నుండి । యింపుమీఱ। సతుల సుతులతోడి । ౘగముమిథ్య
యటంచుఁ । గాదె సూరిజనులు గనుటనుగతి॥ ౨౪౬॥ క॥ సతిపొందు
గోరకుండిన। యతఁడేమహనీయుఁడందు । రాషండునకున్। సతివాంచ లేదు
గావున । నతడునుగానవచ్చు నిలమ । హాత్ముండరయన్॥ క॥ మతముల
కన్నిఁటికిని మా। మతమే హెచ్చనుచువాద । మాడుదు రెవరున్। మతముల
కందని పరమును । మఱిఁగానఁగ లేనివారి మత మేమిటికిన్ ।౨౪౯॥ తే-గీ॥
భూతి రుద్రాక్షలును లింగ । ములును దాల్చు । నవియుఁవనమాలవే

యుట నామములును। బెట్టుటయుఁ బట్టుపుట్టముల్ ।గట్టుటయును । నాది
చక్రాంకితంబులు నగుటభ్రాంతి॥ ౨౯౦॥ క॥ స్థిరకాల జీవులగుచును ।ధర
నుండురు కొందఱనుచుఁ దలఁచెద రజ్ఞుల్ । తరుణీమణి జాతస్యో।మరణం
ధ్రువమన్న శ్రుతిని మనముఁ వినమే॥౨౯౧॥ క॥ స్థిరకాల జీవులనఁగను।
సుఖతరముగఁ దనువుతోడ నుండుటయునుగా । దరయఁగ దేహముచెడి
నను।బరమైతామంట నాశ భవములు లేకన్॥ ౨౯౨॥ తే-గీ॥ జనములె
ల్లను జూచి యాశ్చర్యమొందఁ। బ్రాణమునుబట్టి తానెగు ప్రాణము
నను । నంబువులమీఁదఁగూర్చున్న నధికుఁ డగునె।నిలిచియుండవె బుడ
గోళ్లు నీటిమీఁద॥ ౨౯౩॥ క॥ కాళ్ళంట జడలుగడ్డము । గోళ్లాదిగ బెంచి
పుట్టు గోచియునమరన్ । వ్రేళ్ల జపమాలఁ ద్రిప్పుచు। నూళ్లూళ్లనుదిరుగ
ముక్తి నొందంగలరే॥ ౨౯౪॥ తే-గీ॥ దేహమును మాయయని తన్నుఁ
దెలియ లేక । పవనభక్షణఁ జేయుచుఁ బాముదీతి । నీచకాయంబుబహు
నాళ్లు నిలుపనేల । ఫణియు బ్రతుక దెవేయేండ్లు ఫలముగలదె॥ ౨౯౫॥ క॥
వాయువుల వశముఁ జేసుకఁ । బాయక యిలమీఁదఁ జదలు పదమున
నిలువన్ । మాయను బాయఁగవచ్చునె । యాయంబర సీమంబులుఁగు
లాడనె యెపుడున్॥ ౨౯౬॥ ఆ-వె॥ మానభాషలరయ మది వికారము
లంచు । దెలిసి పరముజాడఁ దెలియ లేక ।మాటలాడకెపుడు మానంబు
చేనాలి। ముచ్చువలెను దిరుగ ముక్తుఁడగునె॥ ౨౯౭॥ క॥ ఊరూరు దిరిగి
పరులకు। గారడి మహిమలను జూపఁ గలదె మోక్షం। బేరీతిఁగల్గుమాయల ।
గారడివానికిని ముక్తి గలదే తలఁపన్॥ ౨౯౮॥ ఆ-వె॥ ఆశ్రమంబు లేమి
యనరాక సర్వంబు । నిండియున్న పరము నెఱుఁగ లేక యిలను నాశ్ర
మంబు లిచ్చునే ముక్తిని । మూలమెఱుఁగ లేని మూఢులకును। ౨౯౯॥
క॥ నేలం బవళించుటయును । రేలును భుజియించుటన్న రీతులు లేకన్ ।
పాలు ఫలాదులు గొనుటయుఁ । గీలెఱుఁగని మాయజనుల క్రియలుత
లంపన్॥ ౩౦౦॥ ఆ-వె॥ హోమగుండములను నొనరించి హెచ్చుగా।
నాజ్యధారలిడుచు నగ్నిలోన । ఘోరముగను వేద ఘోషలుగావింతు।
రందుఁగానఁబడు నె నాత్మ తెఱువు॥ ౩౦౧॥ క॥ సతిసుత గృహవిత్తంబులఁ।
జతురత విడనాడి సేను సన్న్యాశినన । న్నతఁడెపుఁడుఁగాఁడు దేహము।సత
తముగొని తిరుగునపుడె సకలమునుండున్॥ ౩౦౨॥ క॥ సంసారమనఁగ
దేహమె సంసారమనంగ గాదు సతిసుతగృహముల్ ।సంసారమనుచువద
లిన।సంసారేతనువు విడువ సన్న్యాసియగున్ ।౩౦౩। క। వనితా దేహా తనూ
జుల।ధనకనకాభరణవస్తు తతులను నెల్లన్ ।బనిపూని విడువవచ్చును।దను

వ్రును విడనాడ వశమే ధర నెవ్వరికిన్॥౨౬౪॥క॥తనుఁదా గాంచుచునుం
డిన।జనుఁడే సన్యాసిగాని సకలమునున్నన్।దనుఁదాగానక త్రిరిగెడు జనుఁ
డును సన్యాసిగాఁడు సకలము విడిచన్॥౨౬౫॥ క॥ క్షితి కొందఱు శాస్త్రం
బుల।నతులితముగఁ జదివి జ్ఞానమది యెఱుఁగరు పో।సతతము గురుకృప
గలిగిన। సతి చదివినఁ జదువకున్న సమముక్తియగున్॥ ౨౬౬॥ చ॥ తల
లను బోడిఁజేయుటయు దాల్చుట నామ విభూతులున్ జడల్।గలయుదిగం
బరుండగుట గట్టుట కంబళి కాయవల్కముల్।బలువగు జుత్తి పాసలను
బట్టి కమండలదండ ఛత్రముల్ । పొలుపుగ వ్యాఘ్రచర్మములఁ బూనుట
డంబముగాక ముక్తికే॥ చ॥ చలనవు మాయవిశ్వమును సత్యమటంచు
నమ్మువారికే।కలుషపు తంత్రి వేషమును గావలెగాని దలంచిచూడఁగా।
నిలఁ బరమాత్మ తత్త్వమును నింపుగఁ గాంచియు సర్వవృత్తులున్।గల
యని చూచువారలకు గల్లరి వేషము లెల్ల నేటికిన్॥ ఆ-వె॥అనినఁ బంక
జాక్షి యాయదుకులవిభు।నరసి యాశ్రమంబు లనఁగ నెన్ని।యాశ్రమ
ముల లోన నధికంబు నెయ్యది । యెఱుఁగఁ జెప్పుమనిన నిట్లనియె॥

—: యాశ్రమ లక్షణము. :—

౨౬౯॥ క॥ వనితా వానప్రస్థం। బును నవధూతంబు సరస ముగ
సన్యాసం। బును బ్రహ్మచర్య మిన్నిఁటి। కిని గార్హస్థ్యంబు తల్లి కీర్తింపఁ
దగున్॥౨౭౦॥ క॥ సకలాశ్రమముల వారికి। నిఁక గార్హస్థ్యంబు రక్ష
ణీయం బగుటన్ । బ్రకటింపఁగ గార్హస్థ్యము। నకు సరిగావండ్రు బుధు
లు నఖిలాశ్రమముల్॥౨౭౧॥ ఆ-వె॥ నిజము దెలియు నెట్లు నిజగురు
సంపర్క। మింత లేక గల్గె నిన్ని విధము। లైన మార్గములును నదియున్న
నరులకు। నౌను నొక్కమార్గమందుటకిని॥౨౭౨॥ క॥ క్రతుతీర్థంబులకం
టెను। క్షితిదానవ్రతములాది సేయుటకంటెన్ । మతములకన్నిఁటికంటె
ను।నతులితభాగ్యంబు దెలియు టాత్మపదంబున్॥౨౭౩॥ ఆ-వె॥ నిజము
దెల్పునట్టి నిజగురుంగానంగ । లేక మాయఁజిక్కి లోకులెల్లఁ।గర్మ
గురులఁజేరి కర్మకుఁబాత్రులై । చచ్చి పుట్టుచుందు సహజముగను.
౨౭౪॥ ఉ॥ మానిని గ్రుడ్డికంధుఁడును మార్గముఁ జూపఁగ లేని కైవడిన్ ।
జ్ఞానములేని మందునకు జ్ఞానవిహీనుఁడు ముక్తి దెల్పునే । కాననివాని
కన్నులను గల్గిన వాఁడెఱిఁగించు పోలికన్।జ్ఞానము లేని మూఢునకు
జ్ఞాని యె చూపును ముక్తిమార్గమున్॥౨౭౫॥ తే-గీ॥ జ్ఞాని యజ్ఞానియొక
రూపు గానఁబడిన । వారివారల భావముల్ వేఱువేఱు ! ఉప్పు కప్పుర
రూపంబు లొక్కటిగను । నుండినను రుచు ల్వేఱ్వేఱ నుండునట్లు॥

౨౭౬॥ ఉ॥ దీపముగల్గు గేహమున దీప్తింగనంబడు సర్వరూపముల్ ।
దీపము లేక యెద్దియును దేజ మెసంగని యట్టులేటికిన్ । బ్రాపుగ దేహి
దేహమును బాయక మున్నుగ ముక్తిగానకన్ । దీపము వంటి తెల్వియును
దీఱినపిమ్మట ముక్తిగందురే॥ ౨౭౭॥ ఆ-వె॥ దేవుఁడన్న మాట దెలియు
నంతటికిని । మాటవలన నేమి మాటవచ్చె । వాని నెఱిఁగినట్టి వానిని
సేవించి । దేవుఁడన్న గుఱుతు దెలియవలయు॥ ౨౭౮॥ క॥ పేరెఱిఁగినవాఁడొ
క్కఁడు । కూరిమిఁదన చెంత గాఁగగు ఱుతుఁగు నెయ్యా । పేరుగలవాఁడె వీడని
వారకతని నెఱిఁగినట్టి వాఁడు దెలుపకన్॥ ౨౭౯॥ ఆ-వె॥ అబ్ధిఁ దరియఁ
గోరి యలనావికునిఁ బొడఁ । గన్న యట్టులోడ నున్న జనులు । మాయయను
నెడు వార్ధి మానక దాఁటించు । జ్ఞానగురుని నరులు గానవలయు॥ ౨౮౦॥ క॥
దినశుద్ధి దెలియఁ గోరిన । ఘనపంచాంగంబు ముఖత గావలెనిఁక దే । నను
గానట్టుల జ్ఞానము । గనఁదగు సద్గురునివలనఁ గాదితరమునన్॥ ౨౮౧॥ శా॥
ఏ వేళన్ గురుమూర్తి పాదముల నేయే వారలున్ గొల్తురో । నేవారిన్
మహనీయ మూర్తులనుచు న్నెల్లప్పుడున్ గొల్తునా దేవాదీశునకైన
వారి మహిమన్ దీపింపరాదగ్గురున్ । భావింపన్ దగుఁ గొల్వలేని
నరులన్ బాటింపరాదెన్నఁడున్॥ ౨౮౨॥ సీ॥ కులశ్రేష్ఠులము మేము కుల
హీనుఁడగువాని-గురుఁడని మదినెట్ల గొల్తుమంచు దేహాభిమానులై
దిరుగువారలు ముక్తి-గనలేరు యుగములకైనగాని । వసుమతి రాళ్ళలో
వజ్రంబు ప్రభవించి - కులహీనమయ్యెనే గొప్పగాక । * పాలమున్నీటి
లోపల విషము జనించి - కులమేమి ఘనమయ్యె గుణము లేక । గాన
నింతకు గుణమూలే కారణములు గాని కులమెందు హేతువు గాదటం
చు । నెంచి దేహాభిమానంబు ద్రుంచి పరమ గురుని సేవించువారలు
పరముగంద్రు॥ ౨౮౩॥ ఉ॥ దేవరహస్య మెంతయును దెల్పెడి మోక్షము
దెల్పునార్యులన్ । భావము జాతియున్ గుణము పద్ధతులాదిగ నెంచనే
టికిన్ । గోవు సుధాంబుపూరములు గోరినపాలనె గొంచఁగాఁదగున్ ।
గోవుబలంబు సన్నమును కొమ్ములు రొమ్ములు నెన్న నేటికిన్॥ ౨౮౪॥
ఆ-వె॥ భువిన నేకజన్మ పుణ్యవశంబునఁ । గాని నరులు గురునిఁ గానలేరు॥
పుణ్యహీనులకును బుద్ధిఁదలంచిన । దొరక దెన్నఁటికిని గురుపదంబు॥
౨౮౫॥ ఉ॥ కూరిమి మర్త్యులందునను గోటికి నొక్కఁడు గోరు
మోక్షమున్ । గోరినవారియందునను గోటికొకానొకరుండు సద్గురున్ ।
జేరి విముక్తిఁ గాంచు గురుఁ జేరినవారలఁ గోటి కొక్కరుం । డారయ

---

* పాలమున్నీరు — క్షీరాబ్ధి.

జన్మశూన్యుఁ డగు నందజికిఁ గడ తేఱ శక్యమే॥ ౨౬॥ క॥ నావుడుఁ గులమను నదియును। నేవిధమున సంభవించె నెచ్చునుదగ్గున్।భావ లయామందు జపములు। భావించుట యేమి కతనఁబద్మదళాక్షా॥౨౭॥ క॥ ప్రజ్ఞాప్రజ్ఞవివర్జిత। సుజ్ఞానవిశాలనేత్ర శుభగచరిత్రా। యజ్ఞప్రశస్త శోభిత। యజ్ఞానధ్వంసపరమ హంసోత్తంసా॥ ౨౮॥ మాలిని కుటిలమద వినాశా కోటిసూర్య ప్రకాశా।పటుదరవరతత్వా। పంచ భూతప్రభుత్వా। చటులమరితదూరా సర్వవేదాంతవాసా। ఘటన నటనధారీ కామశూన్యప్రచారీ॥

గద్య॥ ఇది పోకల - లక్ష్మీనృసింహార్యపుత్ర, సాధుజనమిత్రనారసింహ నామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదంబనుసుజ్ఞాన శాస్త్రంబునందుఁ బ్రథమాశ్వాసము.



# శ్రీ కృష్ణ రుక్మిణీ సంవాదంబను సుజ్ఞాన శాస్త్రము.

## ద్వితీయాశ్వాసము.



క॥ అక్షరరూప వికార వి।లక్షణశుద్ధాంతరంగలలిత శుభాంగా కుక్షిపద భరిత త్రిభువన।రక్షా రాజాధిరాజ రాజ పరాత్మా॥ ౧॥ వ॥ అవధరింపు మవ్వాసుదేవుం డత్తలోదరి కిట్లనియె॥ ౨॥ క॥ తరుణీమణికుల మనునది। పరిపరివృత్తులను గల్గెబహురూపములన్।బరికింపఁ గులము వేఱొక। తెఱఁగున గల్గినదిగాదు దెలియుము యింకన్॥ 3॥ ఆ-వె॥

### కులలక్షణము.

వృత్తివలనఁ గాక వేఱొక్కవిధమున। గులము గల్గెనంచుఁ గోరిచూడఁ। గులము పరమహంస కులమయ్యెనందఱు। కులములేనిబ్రహ్మ కులజులైరి॥ ౪॥ క॥ కులశ్రేష్ఠులమని నీల్గెదు।పలుగ కులు దెలియలేరు పరమార్థంబున్।కులమేరీతనిరోసిన।కులశ్రేష్ఠుండతడెతత్వగోఁవిదుఁడరయన్॥ ౫॥ ఆ-వె॥ సప్తధాతువులును సమమయ్యె సమయోని।నరయ నుద్భవంబు నాత్మజీవ। సమము దలంచిచూడ సర్వదేహంబులు।నొక్క

టయ్యెఁ గులము నొకటిగాదె॥ ౬॥ క॥ కమలముఖి-చీముశోణిత । మెము
కలు నరములును దోలు మెదడును మాంసం । బమిత మలమూత్రఁరో
తల నమరిన దీకాయ మెన్న నగు బొట్లు సుమీ॥ ౭॥ ఆ-వె॥ ముట్టులోనఁ
బుట్టె ముఱికి కాయంబును । ముఱికి కాయమందె ముట్టుపుట్టె ।
ముట్టుకొంప యిట్టి ముఱికి దేహంబున । కేమికులము గలుగు నెంచి
చూడ॥ ౮॥ క॥ ముట్టున బుట్టిన కులమిది। ముట్టన రోయంగ నేల మున్గురు
మూర్తుల్ ।ముట్టునఁ బుట్టిరిగాదే। ముట్టును లేకున్న నదులు పుట్టంగలరే॥
౯॥ ఆ-వె॥ ముట్టునందె సురలు మునులు దిక్పాలకుల్ । ముట్టునందె
జగము మునిఁగి తేలు।ముట్టునందె నిలిచి । మూలంబుఁ దెలిసిన । ముట్టుఁ
బాసి సర్వము క్షుండగును॥ ౧౦॥ క॥ ముట్టుకులంబని తెలియక। ముట్టునికడ
నుండిసతులు మూన్నాళ్లైనన్।ముట్టు విడనీళ్ల నాడినఁ । జట్టుకులోఁ గల్గుము
ట్టు సమయునె యదియుర్॥ క॥ తానెప్పుడు పరిశుద్ధుఁడు। మేనెప్పుడుముట్టు
బొమికె మేనెన్నఁటికిన్ । గానేరదుపరిశుద్ధియు। మానకయుదకములఁ
గోటి మాఱులు వడినన్॥ ౧౨॥ ఆ-వె॥ సతులుపతులుగూడి రతిసేయ
శుక్లశో । ణితములొనరి పిండ ము తనరెనుగ । వదుసమూత్ర గవిని
వచ్చిరందఱునిందు । ఘనకులంబు నేది కానిదేది॥ ౧౩॥ ఎక్కువమా
కులమని బహు । నిక్కంగానేలబిందు నెత్తురుకులమే । నిక్కముగనైరి
యుంపఱు । నెక్కువ తక్కువలునెన్న నేఁటున్నదిఁకన్॥ ౧౪॥ తే-గీ॥ వీర్య
రక్తంబులను గాక వెలఁది యోని । మార్గమునఁగాక యింకొక్క
మార్గమునను।భవమునొంద నెక్కువయని పల్కవచ్చు । నందఱురీతిఁ
బుట్టిరి యధికమేమి॥ ౧౫॥ చ॥ అరుదుగ దంత్రికీటకములందున శ్వాస
మునందు ధేనునన్ । నరసురలందునన్ శ్వపచునందున విప్రునియందు
నింతులన్ । బురుషుల భిన్నభావమును బొందక సర్వసమత్వమాత్మగా।
నరయుచునుందు రాద్యులును నల్పులు భేదములెంతు రన్నిఁటన్॥ ౧౬॥
ఆ-వె॥ అబల సర్వరూపుఁ డైన యనంతుని।దుష్టు లెఱుఁగలేని దోష
మునను । భిన్నభావములను భేదంబులెంతురు । నిఖిలమాత్మ యంచు
నెఱుఁగలేక॥ ౧౭॥ సీ॥ క్షితి వసిష్ఠుఁడు సూర్వశికిఁ గల్గె నతనికి-నాయు
రుంధతియందు నవతరించె । శక్తియు వానికిఁ జండాల సతియందు-
సంభవించెను బరాశరుఁడనంగ।వానికి శంబర వనితయందుదయించె-
వ్యాసుఁడు పరికింప భాసురముగా । నరయఁ జాకితకును నారదుండు
జనించె బోయెకు వాల్మీకి పుట్టెఁగాదె । యసుర కులమునఁ బ్రహ్లాదు
డలరె వీరు । కులముచేతను గాంచిరే గొప్పతనము । గుణముచేతనే

సద్బ్రాహ్మణకులజులనఁగ। నఖిలజగములఁ బూజితులై రిగాక॥ ౧౮॥ చ॥ ఇల
ధృతరాష్ట్ర పాండు ధరణీశులు ముండలకుద్భవించరే। పొలుపుగ దాసిగ
ర్భమునఁ బుట్టఁడె యావిదురుండు నెంతయుఁ। గలుగరె యన్యపల్లభులకు
గాదర మొప్పఁగఁ బంచపాండవుల్। కులము ఘనంబె వీరలును గొప్పవహిం
చరె లోకమందునన్॥ ౧౯॥ సీ॥ కలశంబులోన వశిష్ఠ్యుండు ప్రభవించె-
గాధికి నుదయించె గౌశికుండు। జింకకడుపున బుష్యశృంగుఁడు గలి
గెను - గవికి నుద్భవమయ్యె గౌతముండు। శ్వపచ వంశమునందు
జన్మించె సాఖ్యుండు తగ మతంగునకు మతంగవాని। మండూకము
నకును మాండవ్యముని గల్గె-ముండకు కౌండిన్యముని జనించె। శుక
మునకును బుట్టె శుకయోగి భావింప। జంబుకంబునకును జంబుకుండు।
ఖరమునకును బొడమె గార్గేయుఁడెంతయు। శ్వానమునకుఁ గల్గె శౌన
కుండు॥ ౨౦॥ క॥ జ్ఞానమె బ్రహ్మత్వం బ। జ్ఞానమె శూద్రత్వమనుచు
జ్ఞానంబాత్మను। బూని తమజన్మలెట్టివి। గానున్నను బ్రహ్మవిధులుగారె
మునీంద్రుల్॥ ౨౧॥ ఆ-వె॥ జగతి యేతెనేని చండాలుఁడైనను। బ్రభు
వుఁగాఁగ నెన్న బడినకీర్తిఁ బ్రహ్మపదముగన్నఁ బంచమకులుఁడైన।
బ్రాహ్మణుఁడనఁగ బడునుజూవె॥ ౨౨॥ క॥ వరక్షత్రియుండునై యిల।
పరిపాలన లేనివానిఁ బ్రభువన రక్షే। ధరణీసుర వరుఁడైనను। బర
మార్థము లేక గలదె బ్రహ్మత్వంబున్॥ ౨౩॥ ఆ-వె॥ గుణముగల్గెనేని
కులముతోఁ బనియేమి। కులము నెంచుటెల్ల గుణము లేమి గుణము
లేనిదాని కులమేమిఘనమగుఁ। గులము వాసిఁదెచ్చు గుణముగాదె॥
౨౪॥ క॥ తెలివిజడత్వంబుల యెడఁ। దలఁపగావచ్చుఁదార తమ్యము
లెందున్। గులమునకు నెంచవచ్చునె। యులరంగా హెచ్చుతగ్గులను
భేదములన్॥ సీ॥ శూద్రవనిత భూమి సురుఁడు తద్భూసుర కాంతను
శూద్రుండు గలిసెనేని। శూద్రనాతికిని భూసురపతికిని బుట్టు - బిడ్డ
లకును జాతి భేదమున్నె। కుక్కవిజాతియా గొత్తెను బొందినఁ
గుక్కపుట్టదు వేఱు కులమగుటను। నుర్వి మానవులెల్ల నొకజాతి
గావున- నెన్న నేసతినైన నింపుమీఱు॥ తే-గీ॥ నేపురుషుఁడైన మించి
రమించెనేని। నరులుగాఁ బుట్టుదురు గాక నక్కకుక్క। జన్మలగు
దురె యానర జాతియందు। జాతిభేదంబులెన్నుట రీతియగునె॥ ౨౫॥
ఎ॥ ఆ-వె॥ భువిని గోత్రభూజములకు భేదంబగుఁ। గాని గిరికిగిరికిఁ గలదె
వేఱు। నరకులంబునకును నఖిలంబు వేత్తైనఁ। దమకులంబువారు తమ
కు వేఱె॥ ౨౬॥ క॥ జనములు నందఱు నొకకుల। మని తెలిసినవాఁడె

జగతి నగ్రకులుఁడగుఁ । మనుజుల భేదము లెన్నుచు । గొనకొనినటి
యించువాఁడె కులహీనుఁడగుఁ॥ ౨౭॥ ఆ-వె॥ పునుఁగు గల్గు పిల్లి
పునుఁగుపిల్లి యనఁ బడుఁ । బునుగులేక కాదు పునుఁగుపిల్లి। గుణములు
న్నహీనకులజుఁడు హెచ్చగు। గుణములేక నగ్రకులజుఁడగునె॥ ౨౮॥ చ॥
తపమును యాగతీర్థములు । దాన మహింసయు వేదపాఠముఁ । జప
మును శాంతముఁ వ్రతము సత్యము హోమము స్నానసంధ్యలుఁ। నిపుణ
తమీఱ నల్పు ధర నిర్జరకంబెను దత్త్వవేత్తయా । శ్వపచుఁడు
నుత్తముం డమల జన్ముఁడు నాతఁడె బ్రాహ్మణుండగుఁ॥ ౨౯॥ సీ॥
పడఁతి దానముచేత బ్రాహ్మణత్వము వచ్చె-ననిన నన్యులుగూడ నాచ
రింత్రు । జన్నిదంబులు దాల్ప సంభవించెనటన్న-నన్యులు కొందఱు నవి
ధరింతు । రెఱుపు తెల్పులఁ గూర్చి యెసఁగెనన్నను నన్య-కులములలో
ననే కులును గలరు। జీవ తెలుఁపులఁ గూర్చి చెందిరన్నను జీవ జెలుపు
లందఱియందుఁ దేజరిల్లుఁ। గర్మమును గూర్చి వచ్చె నాఁ గర్మఫలము ।
తెల్లవారికిఁ దమభంగి నెసగుచుండు । దేహమున నందరికి గల్గు దెగిన
తనువు। నాత్మజుఁడు గాల్పఁగా బ్రహ్మహత్య హొందు॥ 30॥ ఆ-వె॥ కుల
మువలన ననినఁ గోమలి వారి వం। శజులు ఋషులు పుట్టు సరణి వినవె ।
పడఁతియట్లు గాదు బ్రాహ్మణభావంబు । జ్ఞానసంగ్రహమున సంభ
వించె॥ 3౧॥ ఆ-వె॥ అనినఁ దత్త్వమెఱుఁగు నతఁ డెవ్వఁడైనను బ్రాహ్మ
ణుండె యనఁగఁ బరఁగుచుండ। మఱియు నగ్రవంశమందుఁ బుట్టినవారె ।
బ్రాహ్మణుల మటంచుఁ బల్కుటెట్లు॥ 3౨॥ సీ॥ అనిన రుక్మిణిపల్కు
లమృతంబుగ నెంచి పద్మదళాక్షుండు పల్కె నిట్లు । కువలయ మందునఁ
గొందఱు బ్రాహ్మణు - లని వచించుట యెట్లు లనిన వినుము । అలనేతి
బీఱకాయనియు బెల్లపుగొండె యని సువర్ణముఖియు ననియు వచ్చు ।
నందుల వ్యవహారనామంబులే కాని - ఘృతగుడకనకంబు లెన్నఁగలవె।
యట్లు వ్యవహారమున నామమరయ నొకటి । గలుగుచేకాని బ్రహ్మాధి
కారమందుఁ । గొందఱందునఁ గనుపడ దందునైనఁ । గొందఱుందురు
పరతత్త్వకోవిదులును॥ 33॥ క॥ వీరలవంశజులును ము। న్నేరీతినిఁ బుట్టి
యున్న నిజబ్రహ్మంబుఁ । జేరియు బ్రాహ్మణులైరా। పేరే వీరలకు వచ్చె
బెంపొందసిలఁ॥ 3౪॥ ఆ-వె॥ నేతిబీఱకాయ నెయ్యి లేకున్నను। నాఖ్య
యొప్పుచున్న యట్లు జగతి । వీరలిప్పుడు బ్రహ్మవిదులు గాకున్నను ।
బూర్వ వాడుకయును బోకవచ్చె॥ 3౫॥ చ॥ పరగవిధాత నద్వదన
బాహుల నూరుపదంబులందునఁ।వరుసగ బ్రహ్మక్షత్రియులు వైశ్యులు

శూద్రులుఁ బుట్టిరంచునే । నరులును జాతిభేదముల నాత్మఘటించెద
రిట్లుపుట్టినన్ । గరిమనునొక్క బ్రహ్మమునఁ గల్గినవారికి భేదమున్న దే॥
౩౮॥ ఆ-వె॥ పనసవృక్షమందు ఫలములు శాఖాగ్ర ॥ మునను నడుమ
మూలమ్ములనుగ్గ్లు। నెగువ దిగువ పండు లెవ్వియైనఁ బనసపండ్లు గాక
వేఱుపండులగునె॥ ౩౯॥ చ॥ హరిఁబోరి పాదయుగ్మమునఁ బుట్టినవా
రలు శూద్రులైనచో। హరిచరణంబునం గలిగినట్టిది గంగకురాదె శౌద్ర
ము।న్నరుదుగ నట్టిగంగ నిలనంటగవచ్చునె నగ్రజనుల్। సరగున గారె
శూద్రులును స్నానము పానము లాచరించినన్॥ ఆ-వె॥ అదియుఁగాక
యింక నజుని పాదాంగుష్ఠమునను దక్షుఁడు దయ మొందెగాదె।
యతఁడు బ్రహ్మజాతియను నెట్లుపొగడొందె। నతఁడుగాఁడె శూద్రుఁడరసి
చూడ॥ ఆ-వె॥ వందనంబు సేయు వందనంబు నడుగుల॥ మీఁదఁబడును
గానిపాదములును । మొగముమీఁదఁ బడియు మ్రొక్కువుపూజార్హ।
మగుట పదము లెక్కువనఁగఁ బరఁగె॥ క॥ పదనోద్భవు లెక్కువయని।
పదజనితులు తక్కువనుచుఁ బల్కఁగ నేలా । వదనంబు ముఖ్యమైనను।
బదహీనులు సర్వహీన పాత్రులుగారే॥ ౪౧॥ చ॥ అనుపమశాస్త్రవా
క్యముల యర్థమెఱుంగఁగలేక తప్పు భా । వనల నొనర్తురీజగతివర్ణ
చతుష్టయమాది పంకజా । సను ముందార్యగోరుపద సంభవులౌట
యబద్ధమెంతయున్ ।వినుమింక వానియర్థములు వేఱుగనున్నవియుంగనా
మణీ॥ ౪౨। సీ॥ షట్కర్మనిరతులై సకలవేదపురాణ శాస్త్రముల్
విప్రులు చదువుకతన । మహిజనాళికి ధర్మమార్గముల్ దెల్పుచు-
వాక్కుచేతనె తాము బ్రతుకువలన । నట్టివాక్కులు మోమునందుంట
నాస్యంబు-వలనఁబోషణమొందువారుగాని।యాననంబున జనన మైన
వారలుగాదు-పరికించి చూడంగఁ బద్మగంధి । క్షత్రియులు నస్త్రశస్త్రాదిని
చయముఁదాల్చి । భుజబలంబున రక్షణం బొందువలన । బాహుబల
మున జీవించు వారుగాని । బాహులందునఁగల్గిన వారుగారు॥ ౪౩॥
తే-గీ॥ వరుసవాణిజ్యవృత్తిచే వైశ్యులెపుడు । తొడలు నూఁతగఁ
గూర్చుండఁ బడుటజేసి యూరువులపూన్కి జీవించు వారుగాని ।
యూరువులయందుఁ బొడమినవారుగారు॥ ౪౪॥ ఆ-వె॥ మెలతఁ శూద్రు
లకును మెండుగాఁ గృషికిని । పాదచారివృత్తి వలయుఁగానఁ । పాద
చారివృత్తి బ్రతుకువారలుగాని।పాదమునను గల్గు వారుగారు॥ చ॥
అరుదుగ ధాత్రి పద్మినియు హస్తిని చిత్తిని శంఖినీయనం।బరఁగెడునాల్గు
జాతులును బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులం। దరయఁగల్గునింతు

లెడనట్లుసమస్తకులంబులందునన్ । బరఁగ గణింపఁ గల్గుదుఁ-బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రులున్ ॥ ౨౬ ॥ క ॥ నిజముగను బ్రహ్మసృష్టిని । బ్రజలెల్లను నెంచిచూడ-బ్రహ్మకులంబే । నిజముడిగి యన్యవృత్తులు । భజించుట వలనజాతి-భంగముగల్గెన్ ॥ ౨౭ ॥ ఆ-వె ॥ సర్వజనులు బ్రహ్మ - జాతివారైనను । రాజ్యమేలుక తన-రాజులనియు । వర్తకంబుఁజేయు-వైశ్యులనియుఁగృషి । సల్ప శూద్రులనియు - సంభవించె ॥ ౨౮ ॥ క ॥ రాజిలు సత్వగుణంబులఁ । బోఁజేసివికారకామ - భోగప్రియుతన్ । లోఁజేసియుగ్రసాహస । రాజసగుణియైన కతన - రాజనఁ బరఁగెన్ ॥ ౨౯ ॥ ఆ-వె ॥ జ్ఞానసత్వపరత-మాని రజస్తమో । గుణములొంది ఘనము-గూర్చువాంఛ । లోభమోహములను - లోఁగొని వాణిజ్య । మాచరింప వైశ్యుఁ-డనఁగనొప్పు ॥ ౩౦ ॥ క ॥ తన మొదటిజాతిధర్మం । బును దొలఁగి యశౌచ హింస-బొంకులచేఁ గ్రొ । వ్యనుపమవృత్తితమోగుణు । డనునటుల శూద్రుడనఁగ-నుర్విం జెలఁగెన్ ॥ ఆ-వె ॥ జ్ఞాన దాన శౌచ - సత్యక్షమాహింస । భూతదయలు నంత్య-జాతునందుఁ । గలిగియున్న నతఁడు - గాఁడు చండాలుండు । నుత్తముఁడగు । బ్రాహ్మ - ణుండుగాని ॥ ౩౧ ॥ ఆ-వె ॥ జ్ఞానసత్యములను-మాని హింసానృత । జారచోరకపట - క్రూరవృత్తి । నొనరసల్పుబ్రాహ్మ-ణుండైన చండాలుఁ । డతఁడె చూడఁగాఁడు - నగ్రకులుఁడు ॥ ౩౨ ॥ క ॥ కులములు దలఁపఁగఁబుట్టుక । వలనను వచ్చినవిగావు-వసుమతి జనముల్ పొలుపొందఁజేయువృత్తుల । వలనను సంభవములయ్యె-వర్ణింపఁగన్ ॥ ౩౩ ॥ సీ ॥ గణుతింపఁగా విశ్వ - కర్మకులజుఁడొక్క - డాఁడ్రికేవురు కూర్మి - తనయులైన । వరుసకమ్మరశిల్పి - వడ్రంగము గిసాల-కంచరంబాదిగాఁ గల్గుపనులు । నొక్కొక్క నందనుం డొక్కొక్క పనిఁజేయ-వారికి వేర్వేఱ-వచ్చుపేరు । లొరులుహాలికవృత్తి-నొనరింపరైతులు-వాణిజ్యమొనరింప-వర్తకులని-చెప్పుదురెవరేవృ-త్తినిఁ జేసిరేని । వారివారల కాపేరు-వచ్చుచుండు । నవనివృత్తులచేఁగల్గు - నాఖ్యలెఱిమిఁ । గులములకుఁ బోల్చుచుందురు - కుటిలమతులు ॥ ౩౪ ॥ ఆ-వె ॥ వినుము కమ్మరీఁడు - మను బ్రహ్మమయుఁడు వ । డ్రంగి త్వష్టకంచ-రంబు శిల్పి । పరఁగ నెన్నఁ గాశి-పనివాఁడు విశ్వజ్ఞుఁ । డరయఁగ నగసాల-యగుసుగాన ॥ క ॥ ఇలఁ బంచబ్రహ్మలకును । కలిగిన వారెవరుగారు-గన బ్రాహ్మణులున్ । గులమున నప్పంచబ్రాహ్మలు నైననుగారు బ్రహ్మ-భావులుగాకన్ ॥ ౩౬ ॥ క ॥ అనవిని స్త్రీపురుషాదుల । జననము భేదంబులెట్లు - సంభవమయ్యెన్ । వినిపింపుమనిన దక్షిణ-గనినవ్వుచుఁ జెప్పఁదొడఁగె-గంసహరుఁడున్ ॥ ౩౭ ॥ సీ ॥ స్త్రీపురుషోత్పత్తి -

—: పిండోత్పత్తి లక్షణము. :—

జెప్పెద వినుమింక(-దరుణిముట్టైన దైవైర దవదినంబు। మొదలు జేసి దివస

ముల గర్భ మొనరిన । నాతికి నుదయించు ర నాత్మజుండు పట్యాష్ట దశ

మాదిరసరివాసరములందు(రబాలతికిఁ జూలై న(రబుత్రిగాంచు । మఱియుఁ

బురుషుని శుక్లరమధికరించినయోని-వలనొప్పనల్లనిరవర్ణముగను। మెలఁత

శోణితంబు ర మిగులైన నెఱ్ఱని । చాయయగును రెండు ర సమమునైన।

సంభవించుచుంద్రుఁడు ర చామనవర్ణమై । బిసరుహాక్షులకునురబిడ్డలిట్లు॥గీ॥

క॥ పురుషుని వీర్యస్ఖలనం । బిరువుగనగు వేళఁ జెదరి ర యిరుబిందువులై ।

తరుణి యుదరంబుఁ జొచ్చిన ర నరుదారఁగ జంటబిడ్డ ర లగుదురుసతికిన్॥

౭౦॥ సీ॥ రతిసల్ప ఋతువేళ ర రవినాడి గొమరుఁడొఁ - గుముదాస్యుఁడు

నడువఁ ర గూతురగును।తరణినాడి యునింగి ర తత్వమందుఁ జరింపఁ బుట్టు

నపుంసక ర పురుషుఁడగుచు ర శశినాడి పాఱిన(రజదలు తత్వంబున(-గాంత

యానది మాచ ర కమ్మయగును । నిఁక సుషుమ్ననుగూడిరయినచంద్రు

లుండినఁ।బంగ్వంధ వెడమూఁగి రబధిరులగుదు।రనిల తత్వమందురనతివకుఁ

జూలైన । నమిత ప్రసవ వేద ర నంబు గల్గు । నగ్నితత్వమందురైనను

గర్భంబుఁ । జెడును నిశ్చయంబు ర చేడియలకు।౭౧॥ క॥ మాయను జెం

దియు నీగతిఁ । బాయక స్త్రీ పురుషులగుచుఁ ర బశుకీటక । దుష్టాయ

ములెత్తుచు జీవుఁడు । మాయను బాయంగ లేడు ర మానినివింటె॥౭౨॥

సీ॥ క్షణభంగురంబని ర చర్చింపలేక యీతనువు శాశ్వతమంచు(రదలఁచి

నరుఁడు । భ్రాంతుఁడై యిలఁదానురబ్రతికినన్నాళ్లును-మోహవారాశినిర

మునిఁగియుండుఁ బగటికాలము కుటుం ర బాది సంరక్షణ-కును ధనధాన్య

ముల్ ర గూర్చుకొనుచు ర రాత్రికాలము సతీ ర రతులచేఁ గొంతయు -

గలల నిద్రలఁగొంత ర గడపుకొనుచు । నంతలోఁజచ్చు బహుగర్భరనర

కములను । గాంచు సుఖదుఃఖ జన్మాదిరకములఁ బడుచు । గాలమూరక

యీరీతిఁ ర గడుపుఁగాని । తాను గడతేరు మార్గంబు(రదలచఁడెపుడు॥క॥

అనవుడు మరణము నిల్పెడు । ఘనులెవ్వరునైనఁ గలరె ర గల్గువిపత్తుల్।

చనఁజేయన నినఁగొంతకు।ననుమోదముతోడఁ గృష్ణు(రడపుడిట్లనియెన్।

చ॥ అరయఁగ నూఱువత్సరము-లాయువటందురు మానవాళికిన్ ।హారు

—: ప్రాప్త కర్మ లక్షణము. :—

వుగ బాల్యమందుననో ర యౌవనమందునో వార్ధకాననొ । పురమునఁ

గాననంబుననో ర భూరుహ మగ్నిజలంబు లందునో।మరణమె నిశ్చయం

బుసుమి ర మానదు ధాత్రినిఁ బ్రాణికోటికిన్॥౭౩॥ క॥ మరణము వచ్చిన

వేళను । ధరఁ దాఁటినజలధిఁ జొచ్చి దాఁగిననైనన్ । మరిమింటికెగసిపో
యినఁ । బరమాయువు నిల్పవశమె బ్రహ్మకునైనన్ ॥ ౧౬ ॥ క॥ ప్రతి దేవత
కును మ్రొక్కిన । బ్రతుకనివాఁడెన్నటికిని బ్రతుకఁడు జగతిన్ । బ్రతి
కెడువానికి మ్రొక్కిన । బ్రతుకును మఱి మ్రొక్కకున్న బ్రతుకును
గాకన్ ॥ ౧౭ ॥ చ॥ మరిమరి యౌషధంబులను మంచివి మంచివి
యారగించినన్ । బరువడిఁ జెందుకర్మ పరిపక్వముగాక యెపోవు జాడ్య
ముల్ । వరుసగ మంత్రయంత్రకులు వైద్యులునాయతకోట్లువచ్చినన్
మరణము పూర్ణమై చనెడు మానవునిం బ్రతికింపలేరిలన్ ॥ ౧౮ ॥ చ॥
తడయక యింటిమూలలను దాఁచినద్రవ్యము వోవు వీధిలోఁ । బడినను
నుండు బొమ్మదియుఁ బ్రాప్తముగల్గినఁ జిక్కు వానికే । కడుబలుఁడైన బంధు
వులు కాపుగనున్నను జచ్చునింటనే । నడవిని దిక్కులేని సరుడైనను రక్ష
ణమొందుచుండెడిన్ ॥ ౧౯ ॥ తే-గీ॥ దైవయోగంబు దెలియంగ దరమె
సర్వ । జీవులను నెల్లఁ దనకుఁ దసృష్టిఁ జేయుఁ । బోషణముఁ జేయు సర్వం
బుఁ బొలియఁ జేయు । నాతఁడే మూలకారణం బఖిలమునకు ॥ ౨౦ ॥ ఆ-వె॥
నేనె కర్తనంచు నెంచును మనుజుండు । తానె కర్తయైన దైవమేల । యైన
పనులకెల్ల నైననుఁ దాఁ గర్త । కాని పనుల కేల కర్తగాఁడో ॥ ౨౧ ॥ క॥
తనయిష్టము సమకూరినఁ ॥ దన ప్రజ్ఞ యటంచు నరుఁడు దలఁచుచునుం
డున్ । దనదలఁపు నెగడకుండినఁ । దన ప్రారబ్ధంబటంచు దైవముఁ
దూఱున్ ॥ ౨౨ ॥ తే-గీ॥ ఎవరి కేవేళ కేమిమి యెట్టులెట్లు । జరుగవలె
నా తెఱంగున జరుగుచుండ । నహముచేతను దమప్రజ్ఞ యనుచుఁ గాని ।
యెవరికైనను గర్తృత్వ మేమిగలదు ॥ క॥ సముదయ కాలమునందున ।
సమయునెడన్ లేకయుండు స్వాతంత్ర్యంబుల్ దమకెట్లుగల్గు మధ్యను ।
భ్రమగాని మాన్నాళ్ళమిట్టి పడుజీవులకున్ ॥ ౨౪ ॥ క॥ చావును దగ్గఱఁ
జావక । యేవిధకష్టములఁ బడక । యిలసుఖియై తాఁ । జావవలెనన్నయు
ప్పాడె । చావంగావలయుఁ గర్త । జనుఁడైయున్నన్ ॥ ౨౫ ॥ తే.గీ॥ కష్ట
ములె వచ్చునో సుఖమె గలుగఁబోనో । యెఱుఁగ శక్యమె యేవేళ
కేదియేది । ప్రాప్తమానదె తమకర్మ ఫలములంచు । నెఱుఁగవలయును
నిలలోన నెవ్వరైన ॥ ౨౬ ॥ ఉ॥ కూరిమిమీఱ మానవులు గోరుచు
నుందురు సౌఖ్యమెప్పుడున్ । గారవ మొప్పఁ గష్టములు గానలెనంచును
గోరరెవ్వరున్ । గోరికవచ్చు గష్టములు కోరినరావు సుఖంబు లేరికిన్ ।
వారల పాపపుణ్యములె వారికొనర్చును గష్టసౌఖ్యముల్ ॥ ఆ-వె॥ అతివ
వానివాని ఋతుకాలమునఁ బుష్ప । ఫలములెట్లు దోఁచు పాదపములఁ ।

గర్మతరులనట్లు గల్గును సుఖదుఃఖ।ములును నప్రయత్న ముగను జ
తని॥ ౭౮॥ తే-గీ॥ అరయఁ దమపూర్వపుణ్యంబు లనుభవించు । కాల
మున నల్పులకునైన గల్గు సుఖము।పరఁగఁ దొలిజన్మమునఁ జేయు।పాప
ఫలము।ననుభవించకున్నను దీఱదధికులైన॥ ౭౯॥ క॥ ఇలను హరిశ్చం
ద్రుండును।నలుఁడాదిగఁ బొందినట్టి నానాకష్టం । బుల నెవ్వరైన జగ
తినిఁ।దొలఁగించిరె కర్మఫలము దుడిచినఁబోనే॥ ఆ-వె॥ కర్మఫలము
చేత గష్టసుఖంబులు । లనుభవింపఁ జేయునదియుఁబాప॥ ౮౧॥ క॥ నేనే
గలఁడె దుఃఖసుఖంబు । లనుభవింపఁ జేయు।నదియుఁబాప॥ ౮౧॥ క॥ నేనే
కర్తయటన్నను।మానవునిఁ జూచి కర్మమాటికినవ్వున్ । నేనీ రేడుజగం
బుల । లోనను గల ప్రాణికోటిలోఁ చేతునన౯॥ ౮౨॥ సీ॥ కర్మాను
బంధానఁ గల్గును సంగంబు - కర్మాంతకాలాన గతమునొందుఁ ।
పెండ్లాము బిడ్డలు ప్రియబంధులు హితులు దల్లిదండ్రులు నన్ను దమ్ము
లంచు । సాధనంబు గృహంబు సాభూము లివియంచుఁ గర్మతంత్రమున
న జ్ఞానవశత।సి జీవ తనువులే నిక్కంబుగానెంచి - చిక్కంబులోఁ
బిట్ట చిక్కుభంగి । జనుఁడు మిథ్యయైన - సంసారమునఁజిక్కి । యదియె
సత్యలోకమదియె స్వర్గ।మదియె విష్ణులోకమదియె కైలాసంబు।గాను
నమ్మి ముక్తిగానలేఁడు॥ ౮౩॥ ఆ-వె॥ సంచితంబు కతన జన్మంబు గలి
గెను । జన్మవలనఁ గలిగె స్వానుభవము । స్వానుభవము వలన జన్మ
ప్రాప్తియె గాన । సంచితంబె విత్తుజన్మమునకు॥ ౮౪॥ కం॥ ఘోరమగు
సంచితంబుల । భారంబును దొలఁగఁదొలఁగు ప్రారబ్ధంబు దొలంగిన।
తోరపునాగామి జన్మ దొలఁగు నరునకు౯॥౮౫॥ ఆ-వె॥ కలుగుచుండు
బుద్ధి కర్మానుసరణిగాఁ । జిత్తమనుసరించి చేయుపనులు । సేఁతననుస
రించి చెందుఫలంబును । గడవలేరు కర్మఁ బుడమి నరులు॥౮౬॥క॥
అన ఫలము పురుషయత్నం।బును లేకయె దైవమిదునొ పురుషునియత్నం
బున నేఫలము లభించునొ । యనియడిగిన శకటదైత్య హరుఁడిట్ల
నియె౯॥ ౮౭॥ క॥ కొందఱు పౌరుషమే ఫల।మందురు దైవమనికొందఱ
అందురు మఱియు౯ । గొందఱు భూతన్యాయం । బందురు దెలియకను
గర్మపద్ధతులబలా॥ ౮౮॥ తే-గీ॥ జోకతోఁ బురుషయత్నంబు లేక
యున్న।దైవమేరీతి ఫలమును దమకునిచ్చుఁ।దాము యత్నంబుఁజేసిన
దైవమొసఁగు । వారివారల కర్మానుసారముగను॥౮౯॥ క॥ వనజాక్షి
పురుషయత్నం।బును గలిగియు దైవయత్న మును లేక ఫలం। బొనరదు
మనుజప్రయత్నం । బులు లేకయు దైవయత్నముగలిగియున్న౯॥ ౯౦॥

తే-గీ॥ ధరణివంటిది పురుషయ । త్నంబు బీజ । మరయఁగా దైవసహా
కార । మవియు రెండు।నేకమైనను ఫలియించు।నిష్టసిద్ధి।యట్లుగాకున్న
ఫలమీయ।దండ్రు బుధులు॥ ౯౧॥ క॥ వినుధాత్రి లేనిబీజం । బును బీజ
ములేని క్షేత్ర।మును నిష్ఫలమ । ట్లనుపమకార్యఫలంబును।గనుటు త్తది
పురుషదైవి । కము లొనరకయున్ ॥౯౨॥ తే-గీ॥ చమురునింకిన దీపంబు।
సమయుపోల్కి । మనుజుఁడును గార్యయత్నంబు।మానినపుడె॥ వరుసగఁ
దొలగిపోను దై । వానుకూల । మనియెదు నదృష్టమెంతయు । వనజ
గంధి॥ ౯౩॥ క॥ మనుజుఁడు యత్నముఁ జేయక । తన ప్రాప్తంబనినఁ
దనకు । దైవంబెచటన్ । గొనివచ్చి పెట్టు యత్నం । బనుపుగఁగావింప
వారి । భాగ్యము పిదపన్॥ ౯౪॥ ఆ-వె॥ అగ్నికొంచమైన । ననిలం
బునఁ బ్రబల । మైన చందముననను । మరి సుకర్మ।వృద్ధినొందుచుండు ।
వెలయ దైవానుకూ । లమున యత్నమున ఫ । లంబు గలుగు॥౯౫॥ క॥
మును సత్కార్యం బించుక । యును జేయక యత్నములను । నొనరించిన
యా।తనికిని దైవముతోడ్పడఁ ॥ దనువుగఁ గర్మముల నీయఁ । డతనికి
ఫలమున్ ॥౯౬॥ క॥ వినుపౌరుషంబుకంటెను।ఘనమగు దైవంబుముఖ్య ।
కారణము ఫలం।బునునైనఁ బౌరుషంబును । మనమలరఁగ దైవదత్త ।
మనఁదగు నదియున్॥క॥ అన భక్తియెన్ని తెఱఁగులు । వినిపింపుమదియు
నెట్టి । విధముననగు నే।యనవునఁ గల్గును జ్ఞానము। మనుజునకన నింతిఁ

—: భక్తి లక్షణము. :—

జూచి । మాధవుఁడనియెన్ ॥౯౮॥ఆ-వె॥ వినుము భక్తి మూడు । విధ
ములునగుబాహ్య । భక్తియన ననన్య । భక్తియనఁగ । నెసఁగుఁబంక
జాక్షి । యేకాంత భక్తినా।వెలయుఁ దద్విధంబుఁ। దెలియవలయు॥ ౯౯॥
ఆ-వె॥ శ్రవణకీర్తనంబు।స్మరణంబుఁబాదసే । వనము నర్చనంబు । వంద
నంబు।నతుల దాస్యసఖ్య।మాత్మనివేదనం।బనఁగ నవవిధములు।బాహ్య
భక్తి॥ ౧౦౦॥ క॥ పరమయము విశ్వమనియును । బరమా విశ్వమయమను
నియుఁ బరమున కన్యం బరయఁగ లేదని హృదయము । స్థిరమాటయనన్య
భక్తి।సిద్ధము తరుణీ॥ ౧౦౧॥ క॥ పెదవులు గదలింపం మది । సదయతఁ
బరమాత్మఁగూర్చి।చక్కఁగ మదినిం । పొదవఁగఁ దేకనిష్ఠగ।నదియగు
నేకాంతభక్తి । హంసవిహారీ॥ ౧౦౨॥ క॥ విను సత్కర్మాచరణం। బున
భక్తియుఁ బొదలుదానఁ । బొందును జ్ఞానం । బును కర్మ లేక భక్తియు।
మును భక్తియు లేకగాదు । మోక్షపదంబున్॥ ౧౦౩॥ ఆ-వె॥ వరసు
కర్మ పిండె।వంటిదిదానిచేఁ । బడయు భక్తికాయ । వంటిదరయ । దాని

వలనఁ గల్గు జ్ఞానంబు భావింపఁ । బందువంటిదగును బద్మనేత్ర॥ ౧౦౪॥
ఆ-వె॥ కర్మయనెడు పిందె గతమైన భక్తియను గాయ లేదు పలుపఁ
గర్మయనెడు । పిందె చెడకయున్నఁ బెంపొందు భక్తికాయ। యదియుఁ
జెడినఁ గల్గ దాత్మఫలము॥ క॥ వనితా కర్మము భక్తియు। నొనరింపక
జ్ఞానమొందఁ నోప రెవండ్రున్ । విను మొదలుఁబట్టి వృక్షం । బును
బ్రాకక యగ్రమునకుఁ బోవఁగలరే॥౧౦౫॥ ఆ-వె॥ నిట్టనిలువుగాను
నిలుచున్నవాఁడు గూ ! ర్చుండి పండుకొనిన సుఖమునొందు । పరఁగ
నన్నిటిని విడిచి పడుకొనఁబోయిన। వసుధఁ గూలి శిరము వ్రయ్యఁగాదె॥౧౦౬॥
క॥ మునుభక్తి లేనిజ్ఞానం। బును జ్ఞానము లేని భక్తి బొందరు ముక్తిన్ జను
లందఱు నట్లుగావునఁ। గనఁదగు నిల జ్ఞానభక్తికర్మములట్లున్॥ ౧౦౭॥ ఆ-వె॥
కర్మచయము వలనఁ గల్గును జ్ఞానంబు । జ్ఞానంబునను బాయుఁ గర్మచ
యము । కర్మమునకుదవ్వు జ్ఞానియు భావింప జ్ఞానికొనరదవ్వు కర్మ
చయము॥౧౦౮॥ క॥ అని తెల్పు చక్రపాణినిఁ। గనుఁగొని గర్మంబులెన్ని
గతులగుఁ గర్మం। బన నెద్దియనిన రుక్మిణి । కినిఁ దెల్పఁగ నిట్టులనియెం

—: కర్మలక్షణము, :—

గృష్ణుండెలమిన్॥ క॥ కొందఱు కర్మము పద్ధతు। లందరు మఱి కొందఱి
లను నదియు ద్వివిధమా। నందురు తద్విధముల నిటఁ। బొందుగ వినిపింతు
వినుము పూర్ణేందుముఖీ॥ ౧౧౧॥ తే-గీ॥ మొదట లౌకిక వైదిక ములనఁ గర్మ
రెండుపద్ధతులందురా రెంటియందు । లోక కార్యంబులను నెల్ల జోక
తోడ । నాచరించుట లౌకికం బండ్రు బుధులు॥౧౧౨॥ వ॥ ఓ యిందు
ముఖి యందు వైదికంబు నిత్యనైమిత్తిక కామ్యనిషిద్ధప్రాయశ్చిత్తంబులను
కర్మంబులైదువిధంబులని చెప్పుదురిప్పుడు వానిచందంబుఁ దేఁటపడ వివ
రింతు నాకర్ణింపుము॥ ౧౧౩॥ తే-గీ॥ దేవతర్పణమును వైశ్వ దేవ
హోమ । స్నాన సంధ్యాభివందన జపతపంబు । లర్థిసత్కారములు
నాదిగ నాచరించు। నదియె పో నిత్యకర్మం బ సంగనొప్పు॥ ౧౧౪॥ తే-గీ॥
తలఁప సంక్రాంతి నుత్తర దక్షిణాయ । నముల నర్ధమహోదయ విమల
పర్వ ! దినములను స్నానజపములను దీర్చుకొనుట । యాదినైమిత్తి
కపుఁ గర్మమనఁగఁ బరఁగు॥ ౧౧౫॥ ఆ-వె॥ రమణి యశ్వమేధ రాజసూ
యాధ్వర । పౌండరీక సోమ మాది గల్గు । యాగములను బ్రీతి నను
నొందఁజేయుట । కామ్యకర్మమనఁగ గణుతికెక్కు॥ ౧౧౬॥ క॥ పరధ
నహార పరనిందా। పరదారాగమన మద్య పానవిచేష్టా । పరహింసానృత
చలత । స్కరమాది నిషిద్ధకర్మ గాఁ దెలియదగున్॥ ౧౧౭॥ క॥ జల

వాయువర్ణభక్షణ।సలుపుట వనవాసముంట – చాంద్రాయణముల్।సలుపుటయుఁ దీర్థయాత్రలు । నిల ప్రాయశ్చిత్తకర్మ–వియతి యనఁదగుల్॥ ౧౧౯॥ వ॥ ఇంకను నిషిద్ధకర్మంబునకుఁ బంచగవ్యాది కర్మంబు లాచరింతురని చెప్పి యోకాంతామణీ యిప్పుడిరుమూడు దెఱంగులకర్మ తెఱంగెఱింగించితి నింక సుకర్మ దుష్కర్మ జ్ఞానకర్మంబులను నీ ముత్తెఱంగుల కర్మ చందంబెఱిగింతు వినుమని యిట్లనియె॥ సీ॥ గుడిగోపురములాది – కూపతటాకముల్ – ధరణినిల్పుట సూన్ప – తాత్మఁడౌట। తగ నన్నదాన సత్త్రము తేర్పరించుట- సదమలాధ్వరములు – సల్పుటయును । నేకనారీవ్రతా – స్మితుఁడుగానుండుట – విలసహింసావిషయ – వియతుఁడౌట । నర్థిబంధువుగురు – నాలిఁబోషించుట – నిత్యసత్క్రియలాది – నెఱపుటయును దైవభక్తియు బుధసేవ–ధర్మవృత్తి।నాచరించుట తీర్థాది।యాత్రలకును । జనుట సత్కథల్ వినుటయుఁ – జదువుటయును । నాదిగఁగలది సత్కర్మ – యనఁగనొప్పు॥ ౧౨౦॥ సీ॥ పితృమాతృలను గాసి–పెట్టుటయును జీవ–హత్యయు జ్ఞాతిద్రో–హాదికమును।బరసతీసంగంబుఁ–బరదూషణంబునుబరధనశౌర్యంబు–బరవిరసముఁ।దిఱనిక్రోధంబు–దేవవిద్వేషంబు–గురువంచనంబును – గుజనమైత్రి।నన్నృతంబుగపటము– నార్యకార్యంబును–మద్యపానము జూడ–మాడుటయును । వేదదూషణ సత్పత్ని–విడుచుటయును । బరుల తేఱంబు కోర్వమి – ప్రల్లదనముఁ । బోరయుటయు నాత్మవినుతియు – దురితచేష్ట । లాదిగఁగలద దుష్కర్మ–యనఁగబరఁగు॥ ౧౨౧॥ సీ॥ సతిసుతహితబంధు – సంసారమునఁ గల్గు – ననుభవంబులు మాయ–యంచుఁ దెలిసి।శమసౌచదమసత్య – సద్గుణసహితుఁడై – సద్గురూత్తముపాద – సరసిజములు । సేవించి నిరతంబు – సేవఁజేయుచు గురుకరుణచేఁ దన్నుఁదా–గాంచి తెలివి।తనువు నింద్రియమును – తాను గానని యాత్మ–తత్త్వమే తానని–తగ నెఱింగి।మఱియు సత్కర్మదుష్కర్మ–మనఁగ–బరఁగు । బిజములరెంటి జ్ఞానాగ్ని – వేల్చి తాను । మానకను సచ్చిదానంద – మయుఁడునగుట । జ్ఞానకర్మం బనఁబడు – సారసాక్షి॥ ౧౨౨॥ చ॥ చెలువుగఁ జేసి।పుణ్యములు – చెందుచు నుందురు పుణ్యలోకముల్ । కలుషము లాచరించియును – గాంతురు సాయమలోక బాధల్।బొలువుగఁ గష్టసౌఖ్యములు – పొందుచునుందురు మర్త్యలీగతిన్ । గలుషము పుణ్యముల్ దొలఁగి – గానరెయార్యులు జన్మశూన్యముల్ ॥ ౧౨౩॥ ఆ-వె॥ అనినఁ గష్టసుఖము – లవని జనించియే । నరులు కర్మఫలము – ననుభవింప । నరయఁబడవు–లేల–నరకంబునింకేల । యనినఁ

గాంతకనిదె నాత్మవిభుఁడు॥౧౭౮॥ సీ॥ వనజాక్షి యాస్వర్గ వైకుంఠ
కైలాస - బ్రహ్మలోకాది సకలపదవులకును । బోవఁజాలినయంతటి పుణ్య
ముల్ సేసిన - వార లాయా లోక వైభవములు । వడయుదు రాపుణ్య
పదవులకును నేగఁ-జాలని సుకృతంబు లల్పునట్టి । జనులు మర్త్యమున నే
జనియించి తమతమ - పుణ్యముల కొలఁది భోగములను । బొందుచుం
డెద రీ రీతిఁ బుణ్యఁబోణి । పుణ్యలోకంబులకు నేగు పుణ్యులైన । వారి
వారలపుణ్యముల్ వరుసఁ గుడిచి । మగుడి జన్మింతు రీయుర్వి మనుజుల
గుచు॥ ౧౭౯॥ సీ॥ బహుపాపములు సేయు పాపాత్ములకునైన - స్వల్ప
పాపమొనర్చు జనులకైనఁ । బోక తీఱదు యమపురి కంత్యకాలాన
నాదండధరు శిక్ష కర్హమైన । నటనరుల్ బాధింతు రా శిక్షకును
జాల-నట్టివారలు యముఁ నాజ్ఞ మరల । ధరణిఁ బుట్టియు రాజ దండన
రుగ్మ దా - రిద్ర్యముల్ విషమ్ము గోప్రద్రవములు । నాదిగాఁ గాంతురది
గాక నరకలోక । పాత్రులయి శిక్షతగు భంగిఁ బడసియుంతఁ । బక్షికీటక
క్రిమిమృగ పశువునాది । జన్మములు నొందుచుందురీ జగతిలోన॥
౧౮౦॥ క॥ నావుడు కాయముఁ బాసియు జీవుండేలాగు పోవు జెందును
బదవుల్ । ఏవిధమునొందు బాధలు । భావించియుఁ దెల్పుమనినఁ బర
మాత్ముఁడనుఁ ॥ ౧౮౧॥ సీ॥ కలయందుఁ దానేగి ఘనముగా నొకచో
వి - విధ సౌఖ్యము లనుభ వించినట్టు । లీమేను విడనాడి యాలోకము
మఱచి-యతిరుకు చూర దే హములు దాల్చి । పుణ్యాత్ములగువారు
పుణ్యలోకములకు నరుదెంచి భోగంబు లందఁగలరు । స్వప్నానఁ రా
నొక్క సదనంబునకుఁ బోయి బహుకష్టములనెల్లఁ బడినరీతి । దేహ
ములఁ బాసి యతనా దేహములను । బడసి యాలోక జాలంబు మఱచి
ఖలులు । పోయి యమలోక శిక్షలు పొందగలరు । నిశ్చయంబింతయును
భామి సీ లలామ॥ ౧౮౨॥ క॥ అనవుడు భూలోకసుఖం । బునకును నాప
దవులకును బోల్పఁగ భేదం । బును గలదె దెల్పుమనుసతిఁ । గని శ్రియ
మునని ట్టులని యెఁ గమలాక్షుండున్॥ ౧౮౩॥ సీ॥ ఘనముగా భూలోక
జనులకందఁజేకంటెఁ - బరికింప హెచ్చు భూ పతిసుఖంబు । భూపతిసూ
రేంద్రు భువిని ననుభవింప - నతులితానందమై - నట్టిసుఖము । మును
దేవతాసుఖ మునకొక్క కను రెప్పపాటు కాలములకు సాటిగాదు ।
భూలోక సుఖమేడఁ బుణ్యలోకంబుల సుఖమేడఁ దలపోయ సుంద
రాంగి । యమితపుణ్యంబు లనుజేయు నట్టివారు । గాక యాలోకసుఖ
ములు గాంచగలరె । యట్టిపదవులకును జాల నట్టినరులె । పుడమిపై

రాజులాదిగాఁ ✽ బుట్టుదురుగ॥ ౧౩౦॥ ఆ-వె. సుపతి యజ్ఞులవిగాని ✽ సుఖ
మదిగనుకనే। పదవులందునెల్ల ✽ భ్రాంతిపడుట । యిలను వాక్యదైవ ✽
దలపోయ నరకంబు। గోరువారు✽గలరె సారసాక్షి॥ క॥ ఎంతటి పుణ్యముఁ
జేసిన। నంతటి ఫలమొందుఁగాక ✽ నరులకు నిలసౌ ✽ ఖ్యాంత సుకర్మము
సేయక । యెంతగఁ గోరినను రావు ✽ హెచ్చు సుఖంబుల్॥ ౧౩౧॥ క॥
భూజనులకెల్ల వారికి । రాజత్వము చేయుబుద్ధి✽కఁజిల్లుచుండుక్। రాజత్వ
మెట్లు సేతురు । భూజనులరయంగ స్వప్న✽పుణ్యులఁగానక్॥ ౧౩౨॥ క॥
రాజునకుఁ గల్గుచేతులు భూజనులకు లేదె యటని ✽ పుణ్యాంబదియుక్ ।
భూజనులకెట్లుగల్గును । రాజత్వము సేయుటకును ✽ రాజీవాక్షీ॥ ౧౩౩
ఆ-వె॥ అఖిలజనులుతన్ను ✽ ననుసరించియుఁ గొల్వ। నంతఫలము రాజు ✽
నాచరించె । నంతఫలముఁ జేయ ✽ నట్టివారలు రాజ్య । భోగములను
గోరఁ ✽ బొందనగునె॥ ౧౩౪॥ క॥ నావుడు యమలోకంబున । నేవిధక
ర్మలకు మఱియు✽ నేయేశిక్షల్ । గావింతు రనుచుఁ బల్కిన। నా వికచ
దళాక్షిఁజూచి✽హరియిట్లనియెక్॥ ౧౩౫॥ క॥ వనజాక్షి పుణ్యచరితము।
వినిపింపఁగవచ్చునీవు ✽ వినఁగావచ్చుక్। ముదు పాపజనుల వర్తన। లను

యమదండనవివరణము.

వినఁదగదైన వినుము ✽ లని నెఱింగింతుక్॥ ౧౩౬॥ సీ॥ కలుషాత్ములకు
నంత్య✽కాలంబునందునఁ - గాలదూతలు గదా ✽ ఖడ్గపాశ । ధారులై
భీకరా✽కారులై తమచుట్టు-ముట్టడించియుఁ బాశ-ములనుజుట్టి । పట్టిక
ల్వారమొందఁ✽బ్రాణములఁ బెకలించి-యాతనాదేహంబు ✽ లంటుఁజేర్చి।
నీళ్లనుబ్బలిగండ్ల✽నిప్పుగుండంబుల - రాళ్లగుట్టలముండ్ల ✽ రాసులమిత ।
తేళ్లుపాములు బెనగొను ✽ తెరువులందు । నడబుపట్టంగ నడిపించి ✽
యఘజనాళి । మొఱలువెట్టంగ యమలోక ✽ మునకు దూత । లట్లుగొం
పోయి యముమ్రోలఁ✽బెట్టినిలువ॥ ౧౩౭॥ క॥ శమనుం డెవరెవరికనే ।
క్రమమున దండింప నాజ్ఞ✽గావించునొ యా। క్రమమున బాధలు పెట్టుదు।
రమరంగా యమునిభృత్యు ✽ లదియెట్లనిన్॥ ౧౩౮॥ ఆ-వె॥ చెలఁగి వేఁటక
తన ✽ జీవుల హింసించు । పాపిజనుల నొడలు✽బడలఁగొట్టి। యుక్కుఅం
పములను ✽ నురువడిఁ గోతురు । వెక్కివెక్కియేడ్చి ✽ మ్రొక్కులిడఁగ॥
౧౩౯॥ క॥ తలిదండ్రుల బాధించిన । తులువనువడిఁ గ్రాగుసూనె ✽
తొట్లను వరుసక్। బలుమాఱు వేసిముంతురు । మలమలమాడంగ మేను✽
మఱి వడఁకంగక్। ౧౪౦॥ ఆ-వె॥ జాతులెన్ని నట్టి✽చండాలునకు సరఁ ।
యెంగిళులను మోసవ ✽ నెసఁగఁబెట్టి। యతిభయంకరంబు ✽ నైన చీఁకటి

కడఁగ॥ ౧౪౬॥ క॥ తెంపున విషమిడి యమపురి। కంపిన దుర్జనుల నగ్ని
పంబంబులకున్। బెంపెల్లఁ దూలఁగట్టుదు। రింపుచలింపంగ శూలులకేహీన
కరుణాత్మలై॥ ౧౪౭॥ ఆ-వె॥ దైవభక్తిలేని తంత్రజ్ఞులనుబట్టి। మశకము
త్కుణాది మక్షికములు। గలుగు ఘోరమైన గాఢాంధకూపాన।
ద్రోతురందుఁగూలి దుఃఖమొంద॥ ౧౪౮॥ క॥ పరులను దూషించినయా।
నరులను జిహ్వలఁదునుముచు నాయమదూతల్। మరి యినుపముక్కు
కాకులఁ। బోరిబోరి గుంపులనుగూర్చి పొడిపింతురొగిన్॥ ౧౪౯॥ ఆ-వె॥
అనృతములను నాడు నట్టి చండాలుని। మజ్జమాంసరక్త మకరమీన।
వాసమైనయట్టి వైతరణీనది। యందుఁ బడఁగవైతు రడలుపుట్టు॥ క॥
ఇలను బతివ్రతయగు సత్కులకాంతను విడచినట్టి కుటిలమనుజునిన్।
నిలువెల్లఁ దోలుదీసియుఁ। బలలము కుక్కలకుఁ గోసి పడవేతురకన్॥
తే-గీ॥ ధనికుఁడై తిన కర్థికి। దానమీని। కుజనునకుఁ గ్రొత్తసున్నంబుఁ
గుడువఁబెట్టి। పరఁగఁ బల్లేరుకాయల పాన్పుమీఁదఁ। బండఁబెట్టు
దురో యుని బాధఁజెంద॥ ౧౫౨॥ క॥ మానిని సత్కథ లెన్నఁడు। వీనులఁ
జొరనీని యధము విడువక వడిగా। సూనెంబొంగఁగఁగాచియు। వీనుల
లోఁబోతురమిత వేదననొందన్॥ ౧౫౩॥ ఆ-వె॥ ఒకని కలిమిఁజూచి
యోరువఁజాలని। పశుసమానుఁబట్టి - బాడిసలను। జెక్కుచుంద్రు
తనువు చిదురులై మరలను। నొక్కటిగనుగూడు చుండునదియు॥
౧౫౪॥ క॥ దండింపఁదగని సాధుల। దండించిన పాతకులను జనపాశ
మునన్। దండిగఁజుట్టియు మరిమరి। దండనగావించు యముఁడు దారు
ణాకృతిన్॥ ౧౫౫॥ ఆ-వె॥ బ్రహ్మవిదులఁజూచి పరిహాసమొనరించు। పాత
కులనుబట్టి పాపమునక। సరగఁగాయమెల్ల జల్లెడకంతలు। వడఁగ నలు
గుగముల బొడుతురందు॥ ౧౫౬॥ క॥ భూతలిబులానుచిఁజేయుని। పాత
కుబేతాళభూత బ్రహ్మదనుజదుర్। వ్రాతముల కొప్పగింతురు। ఖ్యాతిగ
నవి పవలురాత్రి ఘాతలుపెట్టన్॥ ౧౫౭॥ ఆ-వె॥ మేషకుక్కుటముల
మృగపక్షిపశుసరాక। రాదుల నిలఁగోసి యనుభవించు। నట్టివారిఁబట్టి
యారీతిఁగోయుదు। రక్కజముగ దూతలంబుజాక్షి॥ ౧౫౮॥ క॥ వలలూఁ
తలగాలంబుల। జలచరముల యుక్తిఁబట్టి జనులను సురియల్। గలిగిన
మరపెట్టెలయం। దులవైచియు మరలు ద్రిప్పుదురు పొడిగాఁగన్॥ ౧౫౯॥
తే-గీ॥ ఒకఁడు సత్కార్యమును జేయ నుద్యమింప। నదియుఁగానీక
చెడఁగొట్టు నట్టివాని। రాశిపోసిన సున్నపు రాలఁజేర్చి। విరియఁ
బోతురు కేకలు పెట్టుచుండ॥ ౧౬౦॥ క॥ అతిథి వెలినుండఁబెట్టక యతిప్రీ

తిని నిట్టూరుచును ॰ నట్టి నరుసకుర్ । సతతంబును మలమూత్రములతో
నికి నాహారస్పృష్ట ॰ లకు నితురటక్॥ ౧౭౧ ఆ-వె॥ తనయునొకనికిత్తు॰
నని మరియొకనికి । మాట నిచ్చునట్టి ॰ మనుజవితతి । నేకపాదముననుఁ॰
నిల్పి నారసముల । జిహ్వాలందునాటి ॰ చీల్తురబల॥ ౧౭౨॥ క॥ ఎన్నెన్ని
శ్రమలఁబెట్టినఁ । బన్నుగ జీవులును బాధఁ ॰ బడుటయెగాకన్ । జెన్నుగ
యాతన దేహము । లెన్నఁడుఁజెడిపోకయుండు ॰ నెప్పటియట్లల్ ॥౧౭౩॥
ఆ-వె॥ అరయఁ బెక్కుగలవు ॰ యమలోకబాధలు । చిత్రమిన్నియుంచుఁ ॰
జెప్పఁదరమె । యందు నేనుగొన్ని ॰ ననువొందఁ జెప్పితిఁ । జాలు నింత
వట్టు ॰ జలజవదన. ౧౭౪॥ ఉ॥ పరికింపఁదవచ్చు నిఁక ॰ నీ యిలబాధలు
నొక్కబాధలే । భారకరంబులా యమునిబాధలఁ జిక్కక యుండఁగా
వలెన్ । దారకమంత్ర తత్పరులు ॰ చక్కను నాయమలోకమందునన్ । జేర
నివారు బాధలను ॰ జెందనివారలు లేర యెవ్వరున్॥ ౧౭౫॥ ఆ-వె॥ దైవ
చింతచేతఁ ॰ దనరు మహాత్ముల । చెంతఁజేర వెఱచు ॰ నంతకుండు । నింక
వారిదూత ॰ లెంతమాత్రమువారి । కొనరమించినదియు నొకటిగలదె॥
౧౭౬॥ క॥ పరతత్వ నిరతులగుచును । బరఁగెడువా ధన్యులకును ॰
బ్రహ్మేంద్రాదుల్ । హరిహరులు సురలు కాలుఁడు । స్థిరముగ సేవించి
ప్రణుతిఁ ॰ జేయుదు రెప్డున్॥ ౧౭౭॥ క॥ నావుడుఁబాపాత్ములుగొని । పోవు
టలాదిగనువింటి ॰ పుణ్యులనెటుగొం । పోదురెవరికిఁ గనపడ । దావిధ
మునఁజక్రివక్త్ర ॰ హరిణేక్షణతోన్ ॥ ౧౭౮॥ చ॥ నలువను విష్ణుశంకరులఁ॰
నమ్మినభక్తుల కంత్యమందునన్ । దొలఁగకవచ్చి వారినిజ॰దూతలువారిని
దివ్యపుష్పకం । బులనిడి ఛత్రచామరులు ॰ పువ్వులువైచుచు దేవతా
ప్సరల్ । పొలుపుగ నాడవాద్యములు ॰ బోరుకొనంగొని పోదురెంత
యున్॥౧౭౯॥ ఆ-వె॥ పుణ్యలోకమునకుఁ బోయినతోడనే । యుష్టభోగ
ప్రాప్తుఁడగుచునటుని । రంతరంబు దేవ॰రంభాదిసంభోగ । యుతుఁడు
నగును బుణ్య ॰ యుతుఁడుమగువ॥ ౧౮౦॥ చ॥ ఒనరఁగ మేల్కతోఁ
బదుగు॰దున్ననొకండును గూర్కి స్వప్నమునన్ । గననదివాని కేయెఱుక ॰
గాక యెఱుంగరుదక్కువారు న । ట్లనె శివవిష్ణుదూతలును॰నంతకుదూతలు
వచ్చి తమ్ముఁగొ । ని చను పెల్లవారలకె ॰ గుఱ్తుగఁగాక యెఱుంగర
న్యులు॥ ౧౮౧॥ ఇలఁబుట్టి పెరుగుటయుఁ దా ॰ నలరంగాఁ గష్ట సుఖ
ము ॰ లాదగఁగనుటన్ । దొలఁచుట పదవులు నరకముఁ । గలయించు
నెఱింగి మేల్కఁ ॰ గాంచుమునీవున్॥ ౧౮౨॥ తే-గీ॥ పడతి యోచింప
సత్కర్మ ॰ పరులు సౌఖ్య । మనుభవింతురు దుష్కర్ము॰లధికశ్రమల।

నంత్రియేగాని పుణ్యాత్ము / లధికమనుచుఁ । బాపకర్ముల డక్కగఁ / బల్కరాదు॥౧౮౩॥ క॥ వినుపాపాత్ములకైనను । ననఘాత్ములకైనఁగాని యవనీస్థలిలో । జననమరణములుదప్పవు । ఘనతరముగవారి వారికర్మ / రీతులఁదిక్॥ ౧౮౪॥ క॥ భవమును దెచ్చును బాపము । భవమే గల్గించు పుణ్య / ఫలమీరెండుక్ । దవులక మోఁగినవాఁడే భవనాశము లెడలు ఘనుఁడు / పావనుఁడరయన్॥ ౧౮౫॥ ఉ॥ కర్మముచేత జీవులకుఁ / గల్గును జన్మము లెంచిచూడఁగాఁ । గర్మముచేతఁ జెంపగను / గర్మముచేతనె గల్గు నాశముక్ । గర్మముచేత సౌఖ్యమును / గర్మముచేతనె గల్గు దుఃఖముక్ । గర్మమె జన్మహేతువని / కర్మముఁబాసినవాఁడు ముక్తుఁడౌ ౧౮౬॥ తే-గీ॥ కర్మరహితంబు దేనిచేఁ / గాదుగురుని । కరుణచేతను బరమాత్మఁ / గాంచినపుడె । కర్మబంధంబులెల్లను / గడకుఁబాయుఁ । దపనబింబముఁ బొడగన్న / తమముభంగి ౧౮౭॥ క॥ ఉపవాసవ్రతక్రతువుల । జపదానాధ్యయనసంధ్య / సత్స్నానములక్ । దపశాంతిశమదమంబుల । నెప్పుడు నుమోక్షంబు నొంద / నేరరు సుజుల్ ౧౮౮॥ సీ॥ వసుమతి నరులకు / వస్తువర్గంబును - భుజియింప రోగముల్ / పుట్టుచుండు । నట్టివస్తువె మరల / ననుభవించినదేహ - దగ్ధతయెక్క వౌ / యాధిగాను । బరఁగఁ దత్ప్రతిహతంబైన యౌషధమును - గుడువక తద్వ్యాధి / గుదురనట్లు । నగ్ని క్రియోపాసన / వ్రతక్రతుతీర్థ-జపసత్యతపదాన / శౌచమాదికర్మములు జన్మవృద్ధికే / కర్మమునకుఁ । బ్రతిహతంబైన జ్ఞానంబు / బడయకున్న । జన్మరహితంబు గల్గునే / కిశియు లేని । రేయినభ్రంబు తోడైన / రీతిఁ గర్మ॥ ౧౮౯॥ చ॥ బురదను మంచినీరములు / వోసియలందిన బోవుగాక యా। బురదను జొంపితోఁగడుగ / బోవునె పోదుతలంపనట్టులే। గరితరో జన్మహేతువగు / కర్మము జ్ఞానముచేతఁ బాపకే । కరమనురక్తి గర్మములు / కర్మముచేతను నాశమొందునే॥ ౧౯౦॥ తే-గీ॥ పైరులెల్లను వర్షానఁ / బండినట్టు । మించు పరమార్థమున ముక్తి / గాంచవచ్చు । మంచుచేతను బైరు / ఫలించినట్లు । కర్మచర్యల మోక్షంబు / గాంచరాదు । ౧౯౧॥ క॥ అనవుడు విమలజ్ఞానం । బునకును గర్మంబెమూలముగఁ జెప్పితిరిం । తనెనిష్ఫలమని కర్మం । బును ద్రోయఁగ నేలయనినఁ / బొలఁతికి ననియెక్॥ ౧౯౨॥ ఆ-వె॥ కమలవదన యెట్టి / కర్మంబులైనను । నెంచ మూర్ఖుఁ డాచ / రించుఁగాని । పరఁగ బ్రహ్మపదము / ప్రత్యక్షముగఁ గన్న । జ్ఞానియెప్పుడుఁ జేయఁ / బూనఁబోఁడు॥ ౧౯౩॥ క॥ విను కర్మభక్తిజ్ఞానం । బును నొకటికి నొకటిఁ బడసి / మోక్షంబును గై । కొనఁదగుఁ గర్మాచరణంబుననే మోక్షంబు

నెవరుఁబో వగ భ్రాంతిన్ ౧౯౭ ఆ వె. కర్మగల్గువాఁడు క్రమముగా నెప్పుడో । వడయుముక్తివన్ని చెడకయున్న । జ్ఞాని యట్లుగాదు మారిపి సాస్త్రశ్రేష్ఠ । సుగతు సాత్త్వికపురుషు ముక్తిఁ గాంచు॥ ౧౯౮॥ చ॥ శుని మొదలౌకక తక్కరునిఁ జూచి మొఱంగినఁ జుట్టు ప్రక్కలన్ । శునక ములెల్లఁ గన్నటులఁ జూడకె గూయుచునుండునట్లుగన్ । ఘనపరమాత్మ తత్త్వమును గాంచినవేత్తలు పల్కువాక్యముల్ । వినియును దామఁగ న్నటుల వింతగఁ జెప్పుదురెవ్వఁ గోరదలున్ ౧౯౯ ॥ ఆ-వె॥ కనినవా రలనాను గానని వారికి । గుర్తు లేమిగలవు కోరిచూడఁ । గన్న దెవరో యిందుఁ గానని దెవ్వరో । కన్నవాఁడె వానిఁ గాంచుచుండు॥ ౧౯౮॥ సీ॥ కాశికిఁ బోవగా గనుగొనించు వారెల్ల-దెలివిని నక్కాశిదిక్కుఁ గూర్చి । పోయినఁ గాశికిఁ బోవచ్చుఁ బెడత్రోవ-బోయినఁ గాశికిఁ బోవఁగలరె । యేజాతివారైన నేనీతివారైన నే మతజ్ఞులునైన నెవ్వరైన । మోక్షంబునందు నపేక్ష గల్గినవారు ముక్తిమార్గముఁ బట్టి రక్తిమీఱ । నరిగినను ముక్తిఁ జేరంగ నగునుగాని । తప్పుదారులఁ బడి చనితల్లడిల్లు । మూఢు లేరీతిఁ గాంతురు ముక్తిపదము । ఘోరమగు మాయఁ బడి తన్నుఁ గొను టెగాక॥ ౧౯౯॥ ఉ॥ దారినిఁ దప్పి కాఱడవి దారినిఁ గానక తత్తఱంబుచే । దారి నెఱుఁగు వానిఁ గని దారి నెఱింగినవాని చాడ్పునన్ । గారవ మొప్పమాయను కానన మందునఁ జిక్కకే నరుల్ । కారుణమూర్తిఁ గన్గొనినఁ గానఁగవచ్చును మోక్షమార్గమున్॥ ౨౦౦॥ ఆ-వె॥ సూరిజనుఁడు తాను సుగతిఁ జెందుటెగాక । యొరులఁ గూడదు గతి నొందఁ జేయు । చెనఁటి నరుఁడు తాను జెడిపోవుటేగాక । కోరి యితర జనులఁ గూడఁ జెఱచు॥ ౨౦౧॥ సీ॥ వేదశాస్త్రములెల్ల వివరింపఁగా నేల - వివిధపురాణముల్ వెదుక నేల । పంచకావ్యంబులు పఠియించగాఁ నేల - నమరత్రికాండల నరయ నేల । తర్కలక్షణములు తఱచి చూడఁగ నేల - ఛందంబు మిక్కిలి చదువ నేల । విద్యలెల్లను గఱచి విఱ్ఱవీగఁగ నేల - భాషలెల్లను నేర్చి ప్రబల నేల । పొట్టకూటికె యివియెల్లఁ బోల్చి చూడఁ । బగము పాండిత్యవిద్యలఁ బడయరాదు । పరమగురుమూర్తి పాదముల్ పట్టినపుడె । ముక్తిఁ జెందును గాకెంత మూఢుఁడైన॥ ౨౦౧॥ తే-గీ॥ కోరి యంబుధిపై వాన గురిసినట్లు । కాననంబున వెన్నెల గాయు రీతిఁ । గోటి చదువులు చదివియు గురుని కరుణ । వడయలేకున్న చదువులు వ్యర్థమయ్యె॥ ౨౦౨॥ చ॥ కనుఁగొనువాని చేరువ నెగల్గియు నంధుడు గానఁ డర్కునిన్ । గనులనుగల్గువాఁడె గను గావున మూఢుఁడు నాత్మవేత్తయు।

న్నైనరఁగ నొక్కలోకమున నెసఁగియు నంధునిరీతి మూఢుఁడుఁ దాఁ। గనుఁ
గొనఁ లేఁడు బ్రహ్మమును గాంచుచునుండును నాత్మవేత్తయుఁ॥ ౨౦౩॥
క॥ ఏవలనఁ గాదు ద్వైవము భావంబున దెలియవలయు బరయోగమునన్।
దేవుఁ దర్శించినయా। జీవుఁడు నిమిషమున ముక్తిఁ జెందుమ్మృగాక్షీ॥
౨౦౪॥ ఆ-వె॥ అనిన యోగమనఁగ నది యెన్నిరీతులై యుండుఁ దెల్పు
మనిన నువిదఁ జూచి। మాధవుండు యోగ మార్గంబుఁ దెలియంగఁ।
బల్కె నిట్టులనుచుఁ బ్రౌఢిమెఱయ॥ ౨౦౫॥ ఆ-వె॥ జ్ఞానయోగమనఁగ

## యోగలక్షణము.

నరవి నభ్యాసయో। గంబునాఁగ రెండు గతులు జ్ఞాన। యోగమనఁగ
రాజ యోగమానది సాంఖ్య। తారకామనస్క పేరలొప్పు॥ ౨౦౬॥
క॥ ఎంచఁగ ఖేచరిభూచరి। యుంచును షణ్ముఖియుమధ్య మనశాంభ
వినాఁ। బంచవిధంబులు ముద్రలు। సంచితముగ నవియు మిగుల నాయా
సక్రియల్॥ ఆ-వె॥ అబలవినుము యింక నభ్యాసయోగంబు। నదియు
మూఁడు తెఱంగులై వెలుంగులాలితముగ మంత్రలయహఠయోగంబు।
లనఁగఁ బరఁగుచుండు నవనియందు॥ ౨౦౭॥ క॥ పాయక యిరువదియొ
క్కటి। వేయిన్నూఱ్ల హంస వెసఁ దీయక దా। చేయింబవలు జపిం
చుట। యోయబ్జదళాక్షి మంత్రయోగంబనగున్॥ ౨౦౮॥ ఆ-వె॥ మంత్ర
యోగమనఁగ మఱియది యొండొక్క। తెఱవును గలదిష్ట దేవతాది।
బాహ్యమంత్రములను బఠియించుటలు బాహ్య। మంత్రయోగమనఁగ
మహిఁ జెలంగు॥ ౨౦౯॥ ఆ-వె॥ అన్నమాటఁ జెప్ప కరయఁ శాపా
నుగ్ర। హములనొసఁగుశక్తి నమరుచుండు। మనుపఁ జెఱుపఁ జాలు
మహిమ కొందఱియందుఁ। జెలఁగుచుండు మంత్రసిద్ధులందు॥ ౨౧౦॥
ఉ॥ మానిని చక్రషట్కమున మానసముల్ విహరింపఁ జేసి యు। మ్మాని
త హంసచక్రముల మాటికి నిల్పుచు నచ్చటచ్చటన్। బ్రాణమునం దపా
నము న పానమునందున బ్రాణముం దగన్। బూనిలయింపఁ జేసినదె
పో లయయోగమనంబడుం ధరన్॥ ౨౧౧॥ సీ॥ మనమును బిందువం
దున బ్రాణమును గళ - నమ్మనో ప్రాణముల్ నాదమందు। లయముఁ
జేసియుఁ జిత్కళాదులు దర్శించు-చుందురు భావింపఁ గొందఱిలను।
జెలఁగి జిహ్వాంతర జిహ్వాలనేకంబుఁ జేసి హూంకృతిమును జిక్కఁబట్టి।
హంసనాజ్ఞాచక్ర మందు నావృచు మనం - బందుఁ గొందఱుండిందు
పఱతురింక। నరయు నిజకాయములనంత హంసలయముఁ। జేసి పరకా
యములఁ బ్రవేశించుచుందురు। లెలమి సీలయయోగంబు నిట్లనేక। చంద

ములనాచరింతురీ § జగతిలోన ॥ ౨౧౩॥ ఆ-వె॥ సరవి నింద్రియముల § సంచారముల మాన్పి । హంసనడక నడిపి § నపాన । ప్రాణములను రెంటిఁ § బాయక కుంభించు । నదియె హఠమసంగ § నగును మాసవ॥ ౨౧౪॥ సీ॥ పాయు రింద్రియమున § దోయముల్ పడిఁబీల్చి – మలకల్మషములాది § వెలికిఁద్రోసి । కంఠగతంబులౌ § కఫపిత్తములుగ్రక్కి – షడ్రసంబులను వ § ర్జన మొనరించి । మూర్ధిఁబ్రాణంబు ని § రోధించిహంసను-గలయఁ గేవలకుంభ § కమున నిల్పి । కాయసిద్ధినిఁబొంది § గణుతింప నణిమాది – యష్టసిద్ధులుగాంచి § యనువుమీఱ । దూరశ్రవణము పరికింప § దూరదృష్టిగగన సంచారములునాది § గలిగియుండు । ఠఠయ హఠయోగులరీతి § సవనియందుఁ । బరఁగుచుందురు లోకులు § భ్రమలు సెంద॥ ౨౧౫॥ తే-గీ॥ ఉర్వి నీ మూఁడు దెఱఁగుల § యోగులకును। సహజముగఁ బెక్కుభంగుల § మహిమలుండు । మహిమలంబడి బ్రహ్మంబు §

—: అష్టాంగలక్షణము :—

మఱుఁగుగనని । కతన మోక్షార్హులెన్నఁడు § గారువీరు॥ ౨౧౬॥ వ॥ ఈ త్రివిధంబులగు యోగులకు యమనియమాసన ప్రాణాయామంబులు పూర్వాఁగంబులుగాను బ్రత్యాహార ధ్యానధారణసమాధులు త్తరాంగంబులుగాను బ్రవర్తిల్లు, న దు యమంబున సత్యాక్షమార్జవమహింసాదయాధృతిమితాహార బ్రహ్మచర్య శౌచంబులగు, నియమంబనఁ దపోదాన సంతోష జపార్చనవ్రతతీర్థ శ్రవణాస్తికత్వంబులగు. ఆసనంబనఁ గూర్మాసన కుక్కుటాసన సిద్ధాసన పద్మాసన వీరాసన స్వస్తికాసన భద్రాసన సింహాసన యోగాసనాభ్యాసనంబు లభ్యసించుట, ప్రాణాయామంబనఁ బ్రాణాపానంబుల నొకదానియందొకటి కుంభించుట. ప్రత్యాహారంబన విషయంబులవలన నింద్రియంబుల మరలించుట ధ్యానంబన నామరూపంబుల ధ్యానించుట సగుణ ధ్యానమనియు, నిర్గుణాత్మను జింతించుట నిర్గుణధ్యానమనియుం జెప్పంబడు ధారణంబన నాధారాది షడ్చక్రముల యందును మనంబు నరికట్టుట సమాధియన బాహ్యాదేహభేలయందు మనంబుఁజొప్పించుట సవికల్ప సమాధియనియు, నిర్గుణాత్మ నేమఱకుండుట నిర్వికల్ప సమాధియనియుఁ జెప్పంబడు॥ ౨౧౭॥ ఉ॥ ముందె యెఱుంగనేరక యె § ము క్షిపదంబగు రాజయోగము । న్నిందున భ్యాస పామరులు § నిట్టిదురంతర యోగసాధనల్ । బొంది ప్రమాసలొందిచెడి § పోవు దురాత్మసుఖంబుగానకే । మందులు పొట్టుకంచి ఫల § మందునఁ గానక పోవురీతిగ ॥౨౧౮॥ ఆ-వె॥ అధిక కష్టమిట్టి § అభ్యాసయోగముల్ । గాసి

గాని ముక్తిఁగానఁబడదు । అగణితంబుసులభ ǂ మగు రాజయోగంబు।
ముఖ్యమందఱికిని ǂ ముక్తిపదము॥ ౨౧౯॥ క॥ భూజనుల కెల్లవారికి ।
రాజెట్టుల గొప్పయగుచు । రంజిలునట్లే । పూజితము రాజయోగము ।
రాజగు యోగములకెల్ల ǂ రాజీవాక్షీ॥ ౨౨౦॥ క॥ అన ముద్ర లైదుగల
వని । వినిపించితి విప్పుడవియుǂవినఁగావలతుఁ । వినిపింపుమనిన నింతికి॥

పంచముద్రల లక్షణము.

ననుపొందఁగ నిట్టులనియె ǂ నాయమవిభుఁడుఁ॥ ౨౨౧॥ ఆ-వె॥ ఒడలు
బడలఁజేయు ǂ యోగసాధకులకే । ముద్రలవిప్రదాన ǂ ములగుఁగాని।
యరయసాంఖ్యతార ǂ కామనస్కజ్ఞులా । బుధులకెపుడు ముఖ్యǂములవి
గావు॥ ౨౨౨॥ క॥ వనితా యైనను నీవును । వినఁగోరితి గాన నవియుǂవిశ
దముగానీ । కును నెఱిఁగించెద వినుమిఁక । నొనరంగా నొక్కటొకటి ǂ
నొయ్యనిపుడుఁ॥ ౨౨౩॥ తే-గీ॥ మూసియైనను నక్షులుǂమూయకైన ।
మనసుదృష్టియు భ్రూమధ్య ǂ మందుఁజేర్చి । యూర్ధ్వముఖముగఁజూచు
చుǂ నుండెనేని । ఖేచరీ ముద్రయగునది ǂ కీరవాణి॥ ౨౨౪॥ క॥ సదమల
గతి నాగ్యోక్తినిఁ । బదపడి ఘ్రాణాగ్రమందుఁ ǂ భాయకచూడ్కుల్।
గదలింపక వీక్షించిన । నదిభూచరి ముద్రసరణిǂయంద్రు మహాత్ముల్ ।
౨౨౫॥ తే-గీ॥ నేత్రయుగమును మఱియునాǂ శ్రోత్రయుగము । ఘ్రాణ
యుగమును మూసియుఁ ǂ గ్రమముగాను ǂ జూపు భ్రూమధ్యమునునిల్పిǂ
చూచెనేని । షణ్ముఖీ ముద్రయగునది ǂ సారసాక్షి॥ ౨౨౬॥ క॥ కనులు
వికసించి చూపును । మనముఁ జిదాకాశమందుǂమఱఁగించి చిదాత్మను
గలసి చిత్కళాదుల।వినయంబునఁగనిన శాంభǂవిముద్రయగుఁ॥ ౨౨౭॥
తే-గీ॥ అరనిమీలితలోచనుం ǂ డగుచుమేటి। దృక్కు నాముక్కుమ
ధ్యను ǂ దోపఁజేసి । కలయునామీఁద నిటలంబుఁ ǂ గాంచెనేని।మధ్యల
క్ష్యంబునగునదిǂమందగమన॥ ౨౨౮॥ క॥ కనులును వీనులుమూసియు ।
ఘనముగ భ్రూమధ్యసీమ ǂ గాంచుచు మఱియుఁ । దనలోనెమ్మదివిన
విన।మునుమును నోంకారశబ్ద ǂ మును బ్రబలమగుఁ॥ ౨౨౯॥ క॥ తరు
వాత మేఘరవమును । మఱిఘంటావేణుతాళ ǂ మద్దెలవీణా । వరభేరి
భ్రమరశరనిధి । కరణినినాదములు పెక్కుǂగతుల వినఁబడుఁ॥ ౨౩౦॥
ఆ-వె॥ అట్లు చూడఁజూడ ǂ నతిదారుణాకృతి ǂ నంధకారరూపǂ మగు
చుఁదోఁచుఁ । గలయఁదిమిరమందు ఖద్యోతములరీతి । మెఱుపులతల
భంగి ǂ మెఱయుచుండు॥ ౨౩౧॥ క॥ కమలాక్షి వినుము యొందొక।యమి
తంబగు వెలుఁగుపొడమిǂయంతయుఁదానై । తమమెల్లఁబాఱఁదోలును।

విమలంబై యుండుపండు ౹ వెన్నెల కాంతిన్ ౹౹ ౨౩౨౹౹ ఆ-వె౹౹ మజివసంత
కాల ౹ మార్తాండభంగిని ౹ శిశిర ఋతువునందు ౹ శశివిధంబు౹ప్రళయ
కాలవహ్ని ౹ పగిదిం గాందోచు న౹క్షత్రమండలంబు౹చందమునను౹౹౨౩౩౹౹
క౹౹ ఆరయ వజ్రంబులవలె ౹ ధారుణిమణులట్లు నింద్రధనువు ననువునన్
పారసనీలంబుల గతిం ౹ దీరగుపరమౌక్తికముల ౹ తెఱంగున వెలయున్౹౹
౨౩౪౹౹ ఆ-వె౹౹ గోపురములరీతి ౹ గోత్రములట్టుల౹ మేఘముల తెఱంగు ౹
మేడలవలెం ౹ గరులచందమునను ౹ హరులవిధంబున౹నరదబంతిపోల్కి ౹
నమరుచుండు౹ ౨౩౫౹౹ క౹౹ కనక రజితములభంగినిం ౹ బెనుపొందుచునుం
డునెమిలి ౹ ఫించములగతి ౹ న్ననువొందు హిమముకరణినిం ౹ దనరంగా
దీపకళిక ౹ తతులవిధమునన్౹౹౨౩౬౹౹ క౹౹ చలువవ్రుటంబులకై వడి౹ సలలి
తముగం బూయు వృక్ష ౹ జాలముభంగిన్ ౹ జలనిధికరళ్ల మాడ్కిని౹బలు
వగు నమృతంపుజ్యోతి ౹ పగిది వెలుంగున్౹౹ ౨౩౭౹౹ ఆ-వె౹౹ చిత్రగతులం
దోచు ౹ చిత్కళ లెల్లను ౹ జూడంజూడమిగులం ౹ జోద్యమగుచు ౹ విశ్వ
మంత లేని ౹ వింతలుగాన్పించు ౹ సుదతి నీవునట్లు ౹ చూడుమింక౹౹౨౩౮౹౹
ఆ-వె౹౹ ఇంతియందుందోంచు ౹ వింతల నరయంగ ౹ వేయికన్నులున్న ౹
వేల్పుకైన ౹ శేషధరునకైన ౹ శోషాహికైనను ౹ నలువిగాదజునకునైన
నెన్న౹౹౨౩౯౹౹క౹౹ తారక మర్మము దెలియక౹గారవమున ముద్రలందుం
గను చిత్కళలే౹తారకమని పల్కుదురది౹తారక మెప్పుడునుగాదు౹తరు
ణేందుముఖీ౹౹ ౨౪౦౹౹ తే-గీ౹౹ కలకు సుప్తికి జాగ్రత ౹ కాదియైన ౹ యట్టి
వస్తువె తారకం ౹ బనంగనొప్పు౹నదియుగానక జాగర ౹ మందుంజూచు౹
ముద్రలెల్లను నిద్రలో ౹ మునింగిపోవు ౨౪౧౹౹ క౹౹ సకలవిచిత్రాలయ
మగుం ౹ బ్రకటింపంగ ముద్రలైదు౹భ్రాంతికిమూలం ౹ బకలంకమైనమా
త్మకు ౹ నింకనే భ్రాంతియును లేదు ౹ నిర్గుణుండగుటన్౹౹ ౨౪౨౹౹ క౹౹క్రమ
మున నీముద్రలుగన ౹ భ్రమపుట్టుచు నుండుంగాని ౹ భ్రాంతిరహితమున్
సమలీలగాదుగావున ౹ విమలాంగిముద్రలరసి౹విడువంగవలయున్౹౹౨౪౩౹౹
క౹౹ నిద్రాన్నపానములవిడి ౹ యద్రుల గుహాలందుం దూఱి ౹ యడవుల
నున్నన్ ౹ ముద్రలయందున ౹ భ్రమగల ౹ క్షుద్రాత్ములు గాంచలేరు ౹
నూటిగముక్తిన్౹౹ ౨౪౪౹౹క౹౹ నిద్రకు నాదినిం దెలిసియు ౹ ముద్రల భావం
బురోసి ౹ మూలమెఱింగియున్౹సద్రూపము గననేర్చిన ౹ భద్రాత్ములు
గంద్రుముక్తి ౹ బహుసులభముగన్౹౹ ౨౪౫౹౹ క౹౹ వెలినుండి యింటిలో
పల ౹ వెలుంగును వీక్షించి దివ్వె ౹ విధమెఱుంగకయా ౹ వెలుంగే కారణ
మని మదిం౹దలపోసినవానిరీతిం ౹ దగుముద్రలిలన్౹౹ ౨౪౬౹౹ క౹౹ దీపంబు

గన్నవానికి । వ్యాపకమగు వెలుఁగు కారణాత్మకమగునే । యాపర మాత్మను గాంచిన । యాపావనమతులకెల । యాసాధనముల్ ॥ ౨౮౭॥ ఆ-వె॥ అనినయోగముద్ర । లాదిగవింటిని । నింక నీప్రపంచ । మెట్లు పుట్టె। ఘటియు సాంఖ్యయోగ । మన నెద్దియన్న నా । నాతికిట్టులనియె ।

ప్రపంచోత్పత్తి లక్షణము.

నచ్యుతుండు॥ ౨౮౮॥ క॥ పడఁతీ యెంతటివారికిఁ । జడయక యీ విశ్వ సృష్టి । తరమా చెప్పన్ । గడువడి నీవొక్కొక్కటి। నడుగంగా నేరనట్టు । లడిగెదవు సతీ॥ ౨౮౯॥ క॥ నెట్టన లోకము లేవియుఁ । బుట్టక మున్నేమి లేక । పూర్ణంబగుచున్ । బట్టబయలై నబ్రహ్మము । పట్టుగ నొక్కండె యుండె । భామినితొలుతన్ ॥ ౨౯౦॥ ఆ-వె॥ ఘటియు నట్టిబ్రహ్మమందె మిలేకయే । స్వయముగ నొకమాయశక్తిగల్గె । నరయ నిద్రయందు । నడఁగిన తెల్వియు। వదుసఁ దనకుఁదానె వచ్చినట్లు॥ ౨౯౧॥ తే-గీ॥ నాతి యమ్మాయయందున । నాకసంబు । వొడమె నానింగియందునఁ । బుట్టె గాడ్పు । ననిలమందున నగ్నియు । ననలమందు । జలము జలమందుఁ బృథ్వియు । సంభవించె॥ ౨౯౨॥

వ॥ ఓయంచయానా, యివి పంచమహాభూతంబు లనంబరఁగు, నందు నభంబునకు శబ్దంబును, వాయువునకు శబ్ద స్పర్శంబులును, దేజంబునకు శబ్దస్పర్శరూపంబులును, నుదకంబునకు శబ్దస్పర్శ రూపరసంబులును ధరణికి శబ్దస్పర్శ రూప రస గంధంబులును గుణంబులై యొప్పు॥ ౨౯౨॥ ఎ॥ చ॥ అమరఁగ నట్టిమాయ త్రిగు । ణాత్మకమయ్యెను రాజసంబునన్ । గమలజసత్త్వసంతతులు । కంజహితుండునుగల్గె జీవులున్ । విమలసుగంధి సత్త్వమున । విష్ణుసుధాకర తారలున్ సురల్। సముదయమొందె నాశివుఁడు । సాగరవృక్ష గిరుల్ తమాంశమై॥ ౨౯౩॥ తే-గీ॥ రమణి జగములఁ గల్పించు । రాజసమున సకలజీవులఁ బోషించు।సత్త్వమునను।దవిలి యఖిలంబుఁబొలియించుఁ । దమముచేతఁ । ముత్తెఱంగుల నీ మాయె । మూలమిలను ॥ ౨౯౪॥ క॥ మొదలు రజోగుణమున నె।యుదయించును సత్త్వమొంది । యొగనత్త్వాంసం । బదియగుచుఁ దమముఁ జెందం।బదపడీవినుమవి తమాంశ । మైయొప్పారున్ ।౨౯౫॥ క॥ మగువా విను పదునాలుగు । జగములునీరీతినయ్యె । సాంఖ్యమనంగాఁ । దగు దేహతత్త్వగోప్యము।తగఁదెల్పెద వినుమి యింకఁ । దామరసాక్షీ॥ ౨౯౬॥

వ॥ ఓకాంతామణీ, భూతపంచార్ధార్థంబులై దును నిజాంశంబులై చెలంగు చిక్కిన యర్ధాంశంబులొక్కొక్కటి చతుర్భాగంబులై, యితరభూతచతు

ష్టయంబుం గూడుచున్నది. ఇది పంచీకరణ లక్షణంబగు, నదియెట్లనిన:-

సాంఖ్య లక్షణము.

సీ॥ అంతరిక్షములోని ఽ యర్ధభాగము రెండు-రీతులై యొక్కటి ఽ
జ్ఞాతమయ్యె । మఱియొక భాగంబు ఽ మఱినాల్గువిధములై - వాయ్వనల
సలిల ఽ వసుధలందుఁ । జేరిమనోబుద్ధి ఽ చిత్తహంకారంబు - లాయెను
దద్విష ఽ యంబులగుచు । నెగడు సంకల్పంబు ఽ నిశ్చయంబును జింత-
కర్తృత్వములువాదిఽ గాఁగఁబరఁగు । వీనికధిదైవతంబులై ఽ వెలయ
క్షేత్ర । పాలకుండును జంద్రుండు బ్రహ్మవిష్ణు । రుద్రులగుదురు భావింపఽ
రూఢిగాను । నంతరింద్రియపంచకం ఽ బనఁగ నివియె॥ ౨౧౭॥ సీ॥ పవ
నంబులోనర్ధ ఽ భాగంబు ద్వివిధమై-వరుసనందొక్కటిఽవ్యానమయ్యె ।
గడమభాగము నాల్గు ఽ ఖండంబులగుచును - మఱిమిన్నుగూడి సఽమా
నమయ్యె । దహనుని గలసి యు ఽ దానంబునయ్యెను - వారి జేరియుఁ
బ్రాణ ఽ వాయువయ్యె । వసుధనొంది యపానఽ వాయువునయ్యెను-బరి
కించిచూడంగఁ ఽ బద్మగంధి । విజయుఁడాదిగ జయుఁడును విశ్వయోని।
గలయుఁగ విసృష్టుఁడును విశ్వ ఽ కర్తలనఁగఁ।దనరు చుండుదు రధి దేవఽ
తలుగఁణింపఁ । బంచప్రాణంబులివియనఁ ఽ బరగుధాత్రి॥ ౨౧౮॥ సీ॥అన
లభూతములోని ఽ యర్ధభాగము రెండు - సగములై యొకటి లోఽచనము
నయ్యె।నందుఁజిక్కిన సగం ఽ బటనాల్గు తెఱఁగులై-గగనా నిలోదక ఽ
కాశ్యపులను । జెంది శ్రోత్రముత్వక్కు ఽ జిహ్వనాసికములు- సంచితం
బుగనాయె ఽ నెంచిచూఁడ । రూపశబ్దస్పర్శ ఽ రుచిగంధములువీని -
కరయంగ విషయాదు ఽ లై చెలంగుఁ । దెలియఁగా వీనికిని నధిఽ దేవత
లును । భానుఁడును దశదిశలును ఽ బవవము వరు । ణాశ్వినీ దైవతము
లనఽనమరుచుండు । నివియె దలపోసిచూడ జ్ఞానేంద్రియములు॥ ౨౧౯॥
సీ॥ అప్పుభూతములోనిఽయర్ధభాగము రెండుఽసగములై యొకటి రఽసంబు
నయ్యె । నందునిల్చిన సగముఽనాల్గుఁభాగంబులై - దలఁపంగ నితరభూఽ
తంబులైన।యంబరమార్గంబు ఽ నందునఁగూడియుఁ - జర్చింపనొక్కటిఽ
శబ్దమయ్యెఁ । దగనొప్పనా మారు ఽ తంబునుబొందియు - సానుగానొ
క్కటి-స్పర్శయయ్యెఁ । జెలువుమీఱంగ ననలంబుఁ ఽ జేరియొకటి।రూప
మయ్యెను దలపోయఽరూఢిగాను। నవనిఁగలసియుగంధంబుఽనాయెనొకటి।
పంచతన్మాత్ర లివియగు ఽ నెంచిచూడ। ౨౨౦॥ సీ॥ అవనిభూతము
లోని ఽ యర్ధభాగము రెండు - భాగంబులై యొంఁడు ఽ పాయువయ్యె ।
మిగిలిన ఖండంబు ఽ తగనాల్గుభంగులై ఽ గగనసమీరాగ్నిఽ కములము

లను । బరఁగఁగూడియువాక్కు పాణియుఁబాద గుహ్యంబులు క్రమ
ముగా నాయెనింక । మలవిసర్జనమును బలుకనీవియు గమనానం
దములు విష యాదులగును । నతులితంబుగ నీయింద్రి యంబుల
కును దలఁప నధిదేవతలు మృత్యుదహన శక్రవిష్ణుధాతలువరుసగా వెల
యుచుండు । నరయఁగ గర్మేంద్రియములివి యనఁగఁబరఁగు ౨౬౧॥ వ॥
మున్నుచెప్పిన వ్యాన సమానోదాన ప్రాణాపానంబులైదును మఱియు
వాయుజనితంబులైన నాగకూర్మ కృకర దేవదత్త ధనంజయులను నుపవా
యుపంచకంబునుంగలసి దశవాయువులనం బ్రసిద్ధంబులయ్యె, నందు వ్యా
నుండు శరీరమాద్యంతమునువ్యాపించి లోపలి శీతోష్ణంబులలోనికిం బ్రస
రింపఁజేయుసమానుండు నాభియందుండిభుజించిన పదార్థములయొక్క సార
మెల్లనాడులకుంబంచిపెట్టు; నుదానుండు కంఠమందుండి సమస్తరుచులం
గోరించు, కఫము మొదలగు దగ్గులంబుట్టించు, కల్వరింతలం బెట్టించు, నిష్ఠీవ
నంబు జేయించు, భ్రమింగించు; ప్రాణుండు హృదయమందుండి యుచ్ఛ్వా
సనిశ్వాసంబులచే నారగించిన శాకాదిపదార్థంబులనన్నింటి హరింపంజే
యు, నపానుండు గుదమందుండి యధోద్వారంబులబంధించి యాయాకా
లంబుల మలమూత్రశుక్లరక్తాపానంబుల వదలింపంజేయు; నాగుండురోమ
నాడులయందుండిదుఃఖగీత రాగహాస్యాదులంజేయించు; కూర్ముండుపాదం
బులందుండి శుష్కమైన శరీరంబు బలపఱచు, వాక్నేత్రంబుల వికసింప
మూయింపంజేయు; కృకుడందునాసాగ్రమందుండిక్షుత్తృష్ణాదితలంపులొ
దవించు, తుమ్మించు దగ్గించు, వమనంబుగావించు, నావులింపంజేయు,
మృతంబైననువిడువక దేహస్థౌల్యమునుబుట్టించు; దేవదత్తుండులింగాత్ము
లయందుండి చక్కఁగాబల్కించు, కూర్చుండంబెట్టిపరుండంబెట్టు, లేపి
నిలువంబెట్టు గమనాగమనంబులంజేయించు; ధనంజయుండు బ్రహ్మరంధ్ర
స్థానమందుండి శ్రోత్రములయందెల్లప్పుడు సముద్రముభంగిఘోషింపంజే
యుచు మరణకాలమునకుముందుగా నిశ్శబ్దమైపోవు॥ ౨౬౨॥ సీ॥ నాతిస
మిష్టితో నయ్యహంకారంబు గూడనన్నమయాఖ్యకోశమయ్యెఁ ।
బ్రాణేంద్రియములతోఁ బరఁగహంకారంబు గూడఁబ్రాణమయాఖ్య
కోశమయ్యె। మేటినెమ్మనము కర్మేంద్రియంబులతోడఁ గూడమనో
మయ కోశమయ్యె । నెలవుగాబుద్ధిజ్ఞానేంద్రియంబులతోడఁగూడ
విజ్ఞానాఖ్యకోశమయ్యె । సంతతంబును జిత్తంబుజ్ఞాతతోడఁ । గూడు
టానందమయమను కోశమయ్యెఁ । బంచకోశంబులీరీతిఁ బరఁగుచుం
డుఁ । బొందుగానెల్ల దేహంబులందు నరయ॥ ౨౬౩॥ సీ॥ గగనంబుచేఁ

గ్రాగ్రాగామంబుక్రోధంబుఽమదలోభమోహము ఽ ల్మాత్సరంబు । గాడ్పు
చేఁదీవ్రంబు ఽ గమనంబులజ్జయుఁ – జలనంబుభయమును ఽ సంభవించెఁ।
బావకుచేతఁబి ఽ పాస క్షుదాలస్య – సంగనిద్రాదులు ఽ సరవిఁగల్గె ।
శుక్ల మూత్రశ్లేష్మ శోణితమేధస్సు – లుత్పన్నమయ్యెనుఽనుదకమునను ।
మఱియుఁజర్మంబునస్థియు ఽ మాంసకేశ । నరములాదిగ జనియించెఽనవ
నివలనఁ । వెలఁత యీదేహతత్వముఽలిట్టివనుచు । నలువకైననుభావిం
ప ఽ నలవియగునె॥ ౧౬౪॥ తే-గీ॥ ప్రాణధర్మంబులగు క్షుత్పి ఽ పాసతె
లమిఁ । దలఁప భవనాశములు దేహఽధర్మములగు । జోకమానస ధర్మ
ముల్ఽశోకమోహ । ములు షడూర్ములనంబడుఽమోహానాంగి॥ ౧౬౫॥
క॥ కులరూప ధనమదంబులు । వెలయంగా యౌవనంబుఽవిద్యారాజ్యం।
బెలమిఁ దపస్సును శీలం । బలరంగ నష్టమదము ఽ లనఁబడు నవియున్॥
౧౬౬॥ క॥ విను ముత్సాహవ్యసనము । ధనసేవక విశ్వరాజ్యఽతనువుల
వ్యసనా । లౌనరు మనోవ్యసనఁబును । ననుసప్తవ్యసనములను ఽ నడఁ
పఁగ వలయున్॥ ౧౬౭॥ ఉ॥ కొందఱు ముప్పదాఱయని ఽ కొందఱు
తొంబదియుంచుఁ దత్వముల్ । కొందఱు నైదటంచు మఱి ఽ కొందఱు
నిర్వదిమూడటంచునున్ । గొందఱు నిర్వదేననుచుఁఽ గొందఱు నిర్వది
యేడయింద్రిల। న్నొందఱు నెన్నిరీతులనుఽనెట్లువచించిన వానికేతగున్॥
౧౬౮॥ ఆ-వె॥ అఖిలతత్వములకు ఽ నాదారమగుచును । నవ్యయాత్మ
తత్వ ఽ మలరునొకటి । దానిసమముమిగులు ఽ తత్వంబు లెవ్వియు। లేని
దియును సుజన ఽ సేవితంబు। ౧౬౯॥ సీ॥ బ్రహ్మంబునందునఁఽబంచము
ఖంబుల – నెవ్వియుంచన విను ఽ మేర్పరింతు । నీశాన్యముఖమునఽ నింగి
యై విలసిల్లు – దత్పురుషముఖంబునఁ ఽ దగును గాడ్పు । ముదముమీఱ
నఘోర ఽ ముఖమున ననలంబు – వామదేవాస్యంబు ఽ వారియగును ।
మొనసి సద్యోజాత ఽ ముఖమునఁ బృథ్వియుఁ – దలపోయఁ బంచభూ ఽ
తంబులివియు । భవము నాశముతేనట్టి ఽ బ్రహ్మమునకుఁ । బంచముఖ
ములు గలవంచుఁ । బల్కరాదు । పంచభూతంబు లేయిలఁఽ పంచముఖ
ము । లగుచు వీనిచే భువనంబు ఽ లన్నియయ్యె॥ ౧౭౦॥ ఉ॥ కొందఱు
చెట్టుముందనియుఁ ఽ గొందఱు విత్తని పెక్కుభంగుల । న్నందరు విత్తు
చెట్టులకు ఽ నారయభేదముఁజెప్పశక్యమే । ముందెయొనర్చె విత్తనముఽ
మూలముగాఁగను సృష్టికర్తయు । న్నందుఁదలంపఁ జెట్టునగుఽనట్టిమహా
త్మ్యముఁజేసెఁగాగునన్॥ ౧౭౧॥ ఆ-వె॥ కారణంబులేనిఽకార్యంబు లిల
లేవు । కార్యములకు నాది ఽ కారణంబై । కారణంబువిత్తు ఽ కార్యం

బుచెట్టగుఁ । గాక చెట్టగునొకో కారణంబు॥ ౨౭౨॥ క॥ మును మన్ను
కారణంబై । ఘనకుంభాకారమగుచుఁ గార్యంబులగున్ । మును విత్తుకా
రణంబగు । ననువొందఁగఁజెట్టు కార్యమగును దలంపన్॥ ౨౭౩॥ ఆ-వె॥
విత్తుకారణాత్మ విశ్వంబు కార్యంబు కారణాత్మలేక గాదుజగము ।
కారణంబువలనఁ గల్గెను సర్వంబు । గాన విలుకునాత్మ కారణంబు॥
౨౭౪॥ సీ॥ నలినాక్షి బ్రహ్మమా నన సరోవరమందుఁ బరమహం
సంబనఁ బక్షియొకటి । నిరతంబుక్షుత్తృష్ణ నిద్రయురోగంబు-జరయు
మృతియులేక సంచరించు సాటిగాఁగనుజెప్ప పాటులోనాయంచ-
దివిరి జగములెల్లఁ దిరిగివచ్చు । సతతంబునాయంచ సంచారమును
లేని-లోకంబుపొలిసి నిర్లోకమగును । దానిఁ బట్టుటకును దర్శించు
టకునైన నలవిగాదు శివున కజునకైన । నట్టియంగదర్శనంబు
చేతనుగాదె । యార్యులెల్ల ముక్తులైరితలఁప ౨౭౫॥ క॥ అంచకు
వర్ణగుణంబులు । నెంచగాలేవు రూప నియుతులు నాలో । పొంచిన
గనుపడవిఁక నా । యంచకుఁబ్రతిలేదు జగములందునఁజూడన్॥ ౨౭౬॥
ఆ-వె॥ అమ్మరాళమునకు నావలనొకకోఁతి దిరుగుగాలిభంగి దిశలు
దిశలు । నంచనెపుడుగూడు నప్పుడేయాకోఁతి । చచ్చుమాయలెల్ల
సమసిపోవు॥ ౨౭౭॥ క॥ ధారుణి హంసముపాలను । నీరం బేర్పఱచినట్లు
నిజమును మృషయున్ గూరిమి నీదేహంబున నారయఁగావచ్చుఁబరమ
హంసదారికిన్॥ ౨౭౮॥ తే-గీ॥ శక్తికిని సాధ్యమునుగాదు యుక్తులకును।
జిక్కుపడదది యెవ్వారి చిత్తములకు । నొనర గురుశాస్త్రమనియెడి
నుచ్చులొడ్డి । బహుళ సులభంబుగాదానిఁ బట్టవచ్చు॥ ౨౭౯॥ క॥ ఆ
పరమహంసఁబట్టిన । యాపుణ్యుల భాగ్యమింత యనఁగావశమే।యా
పుణ్యులెధన్యాత్మకు । లాపుణ్యులెజన్మశూన్యులనఁగావలయున్॥ ౨౮౦॥
ఆ-వె॥ నడకలెల్ల హంసనడకతో సరిగావు । హంసనడకఁజెప్పనలవి
గాదు । హంసనడకవలన నఖిలప్రపంచంబు। నడుచుకాలచక్రమాది
గతులు॥ ౨౮౧॥ క॥ అంచయనఁగ వేఱొక్కటె।యంచితముగ నంతరా
త్మ కర్థమగును నాయంచయె । యాత్మండాత్మయె । యంచయగును
నెంచిచూడ హంసవిహారీ॥ ౨౮౨॥ క॥ తనయింట శత్రుమిత్రులఁ।గని
తనుఁదాహాత్మగాఁగఁ గనఁడగునట్టు । ల్గనుఁగొనఁగలేకయుండిన।మను
జుని బ్రతుకేమిబ్రతుకు మదగజగమనా॥ ౨౮౩॥ ఆ-వె॥ దేహగుణము
లెల్లఁ ॥ దెలిసియు నామీఁదఁ దారకంబు నాత్మఁదలచవలయు । బ్రహ్మ
రాజఋషులు ప్రహ్లాదుఁడాదిగాఁ దారకమునఁగాదె ధన్యులైరి॥

౨౮౫॥ ఓ వెలఁది వినుము సురలకు । దేవత్వము తారకమున ౷ దీపించెను ద । ద్భావముఁ దెలియక గాదె । భావింపఁగ నసురమర్త్యభావులు నగుట౯॥ ౨౮౬॥ చ॥ అనియిటుఁ దెల్పుచున్నఁబతి ౷ యంఘ్రిలపాలముసోఁక మ్రొక్కియు౯ । ఘనమగు భక్తిదోఁపఁగర ౷ కంజయుగంబును మోడ్చి నాథయో । యనఘచరిత్ర నీవలన ౷ నద్భుతబోధనువింటి నియ్యెడ౯। ననుదయఁజూచి తారకము ౷ నాదరమొప్ప ననుగ్రహింపవే॥ ౨౮౭॥ క॥ శ్రీకర రహితవికారా । ప్రాకటగుణ కర్మదూర ।భవరోగహరా ౷ భీకర శత్రుతృణీకర । యాకాశ సమానరూప ౷ యార్యసమీపా॥ ౨౮౮॥ మాలిని॥ సుఋషమతరకీర్తి ౷ నిర్మలానందమూర్తి । పరమపదయువిశాలా ౷ భక్తసంత్రాణశీలా । దురితగతపవిత్రా ౷ దుఃఖవల్లీలవిత్రా। పరమపద నిరూపా । భవ్యలోకప్రదీపా॥ ౨౮౯॥

గద్య॥ ఇది పోలకం - లక్ష్మీనృసింహార్యపుత్ర, సాధుజనమిత్ర నారసింహ నామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదంబను - సుజ్ఞాన శాస్త్రమునందు ద్వితీయాశ్వాసము - సమాప్తము॥



# శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదం బను
# సుజ్ఞాన శాస్త్రము.
## తృతీయాశ్వాసము



క॥ విశ్వాత్మ విశ్వనాయక । విశ్వేశ్వర విశ్వగాత్ర ౷ విశ్వమయాత్మా । విశ్వవికల్ప సురక్షణ।విశ్వాంతక విశ్వకర్త ౷ విశ్వాతీతా॥౧॥ వ॥ అవధరింపుమాకృష్ణుండకాంతామణికిట్లనియె॥శా॥ భామా యేరికిఁ దారకంబు మహిమ౯ ౷ భావింపరాదెంతయు౯ । సామాన్యుల్ మది ౷ గోరరట్టివిధము౯ ౷ సంసారవారాశిలో । వేమాఱుంబడి యీఁదువారు సుగతి౯ । వీక్షింపఁగానెట్లగును। భూమీమండలి జన్మశూన్యులగునా ౷

### తారక లక్షణము.

పుణ్యాత్ములుండకుంగ౯॥ ౩॥ క॥ తారకమహిమను జెప్పెద।నరీమణి వినుమునీవు ౷ నయమొప్పగనా।తారకము జననమరణ ని । వారకమది శోకమోహ ౷ వర్జితమరయ౯॥ ౪॥ ఆ-వె॥ తపజపార్చనాది ౷ దానతీర్థ

వ్రత। క్రతుకులాశ్రమాది మతపురాణ వేదశాస్త్రములకు వివిధం
బులగు ధర్మములకుఁ దారకంబు మొదలుచూడ॥ ౫॥ క॥ తారకము
సాధులకుఁగనుఁ। జేరువయగు సర్వమునకుఁ జేరఁగడయగుఁ॥ ధారుణి
వేలుల కెల్లను। వారిధిచందంబుగాఁగ వారిజగంధీ॥ ౬॥ ఆ-వె॥ హరి
హిరణ్యగర్భు లమర దిక్పాలకు। లిన సుధాకరాగ్ను లనిల శంభు।
లాదితారకంబె యాడించు సర్వంబు। నకును దారకంబె నాటకంబు॥
౭॥ క॥ తారకము మనశ్శుద్ధికిఁ। గారణమగు సాధనంబు గావున మజీ
యా తారకము నభ్యసించిన। వారికిఁ జలనంబుగలదె వారిజనయనా॥౮॥
ఆ-వె॥ తారకంబు త్రిగుణ తాపంబులను బాపు। విషణములమాపు
నెల్ల వాస। నలను జంపఁజేయు నరివర్గమును గెంటు। నడఁచు వ్యసనముల
మ దాష్టకంబు॥ ౯॥ సీ॥ తలిదండ్రిగురుబంధు తరుణీగోపాలక-హత్య
లనుమిగుల నఘములైనఁ। గడఁగి పెక్కుఱు నన్య కాంతలయాడినఁ-
గామాంధమను మహా కలుషమైన। పలుమాఱు హేమాది పరవిత్త
ములుచాల దొంగిలించిన మహా దోషమైన। బహ్వన్నృతాది పాపము
లైన వేమాఱు సురను గ్రోలిన ఘోర దురితమైన। నింక నెటువంటి
పాపంబు లిలనొనర్చు। పాతకులనైన తారకం బందిరేని। నిఖిల
కలుషంబులను బాసి - నిమిషమునకు। ముక్తినొందంగఁ గలరింక ముద
ముతోడ॥ ౧౦॥ క॥ అతిదుష్కృతములు సేయుచు। సతతము వాల్మీకి
బోయ జన్మండయ్యున్। గతజన్ముఁడగుట నెఱుఁగవే। సతి తారక
ధనమువలనఁ జర్చింపగఁ॥ ౧౧॥ ఆ-వె॥ మానులు కోపతాప ములు
గల్గి శాపంబు। లొడులకొసఁగియుండి యుద్వేఁదాము। నీచజాతు
లందు నెఱిఁబుట్టియును దార। కముననఁగాదె వారు ఘనులునైరి॥
౧౨॥ క॥ సారసమిత్రుని౽బొడఁగని। ధారుణ గాఢాంధమెల్లఁ దాఁబా
యుగతిఁ। దారకముగాంచినప్పుడె। నారీమణి పాసిపోవు నఖిలాఘం
బుల్॥ ౧౩॥ ఆ-వె॥ తారకంబుచేత దగ్ధంబుగాకుండు। నట్టిపాపమెద్ది
యవనిగల్ల। దెట్టియఘములైన గొట్టివేయఁగఁజాలు। తారకంబె
పరమ। తారకంబు॥ ౧౪॥ క॥ చీరఁగలదే యఘుంబులఁ। దారకతత్వ
రుల కఘము తగఁగలదను నా। క్రూరుల పాపము మాత్రము। తారక
మొగిఁ బాపలేదు తరుణేందుముఖీ॥ ౧౫॥ ఆ-వె॥ తారకామృతంబుఁ
ద్రావు భక్తులకును। వేఱె ధర్మమొకటి గోరఁదగునె। కాంతలెల్ల నొ
సఁగు కల్పవృక్షముండ। గచ్చపాదను జేరు కరణిఁగాదె॥ ౧౬॥ క॥
సారసగర్భుండాదిగ। సారసముఖి సకలజీవ సంఘంబులు నా। తారక

ముచేతఁ గల్గెను । తారకమే విశ్వమునకుఁ • దారకమరయన్॥ ౧౭॥
తే-గీ॥ తారకముచేతరోగముల్ • పాఱిపోవు । తారకముచేత దారిద్ర్య
తతులువాయుఁ । దారకముచేత సౌఖ్యంబు • ధనముగల్గుఁ । దారకము
చేత సిద్ధిఁ • దలపులెల్ల॥ ౧౮॥ సీ॥ ధరణి దైవములెల్ల • దారకంబు
సమంబె-యీప్సితంబు ప్రజల • కిచ్చునెడల గామధేనువు తార • కంబు
తోసరియౌనె - యీప్సితంబు ప్రజల • కిచ్చునెడలఁ । గల్పవృక్షము
తార • కంబునుబోలునె - యీప్సితంబు ప్రజల • కిచ్చునెడలఁ।దలఁపఁ
జింతామణి - తారకంబు సమంబె-యీప్సితంబు ప్రజల • కిచ్చునెడల॥
౧౯॥ ఆ-వె॥ మును నిలింపభర్త • తనవైభవంబెల్లఁ । గోలుపోయిపిదప•
గురునికరుణఁ । జేసిప్రణవమంత్ర • సిద్ధిఁగైకొనిగాదె । యఖిలరాజ్యప
దవి • నందగలిగె॥ క॥ తారకమె శాంతినిచ్చును । తారకమే జనదవార్ధి
దాఁటించుననా । తారకమె మాయఁబాపును । తారకమే మోక్షమొ
సఁగి • ధన్యునిఁజేయున్॥ ౨౦॥ఆ-వె॥ తారకంబుకంటెఁ • దగమోక్ష
సాధనం। బొండులేదు జగతి • మండలమునఁ । దారకంబె పరమ•ధర్మం
బటంచును । బరమశివుఁడు దెల్పెఁ • బార్వతికిని॥ ౨౧॥ క॥ తారకమె
మూలమంతకుఁ । దారకమే సకలప్రాణి • తతులవెలుంగున్ । దారకమే
లేకుండిన । నీరేడుజగంబులవుడె • నిర్మూలముగున్॥ ౨౨॥ ఆ-వె॥ తార
కంబనియెడు • ధనమును గైకొన్న। వారికెనయె యింద్ర•వైభవములు।
వారిపదవిఁజెప్ప • వశమె శక్రునకైన • నబ్జభవునకైన • హరునకైన॥
౨౩॥ క॥ తారకము జీవులకు నా । ధారముగావునను జూడఁ • దగనంత
టికిన్ । దారకము తానెయగునా । కారణమునఁగల్గెఁ దార • కంబను
పేరున్॥౨౪॥ ఆ-వె॥ తారకంబనంగ • దైవంబెభావింప । దైవమనఁగఁ
బరఁగు • దారకంబె తారకంబుకంటెఁదలఁపంగ వేఱొండు । దైవమ
రయలేదు • ధరణిలోన॥౨౫॥ చ॥ తలఁప ననేకపూసలొక • దారము
నందున నిల్చినట్లుగా । నిలఁగలజీవకోటులకు • నెల్లను దైవమె సూత్ర
ధారియై।యిలరు సమస్తభూతముల•యందుఁ జరించుచునుండు నాతనిన్।
తెలియుట దుస్తరంబు మఱి • దేవగణంబునకైన రుక్మిణీ॥ ౨౬॥ ఆ-వె॥
అక్కజముగ నతఁడొ•పెక్కింద్రవలెఁదోఁచు।నిక్క మెన్నిచూడ•నొక్కఁ
డగును । నింద్రజాలకుండు • నిఖిలఁబుఁ దనమాయ । గాను జూపుఁ
దాను • గాఁడెయొకఁడు॥ ౨౭॥ క॥ దారువులయందు ననలము । తీరునఁ
దైలంబుతిలల • దీపించుగతిన్ । క్షీరముల ఘృతముభఁగిని । నారయ
భగవంతుఁడుండు • నఖిలమునందున్॥౨౮॥ తే-గీ॥ చుట్టు తెరలోనఁదా

నుండి సూత్రములను । బూని బొమ్మలనాడించు వానిలీల । మాయఁదాఁ
జాలముచేసుక మఱుఁగునుండి। జీవులనెల్ల నాడించు దేవుఁడొక్కఁడె॥
౨౮॥ క॥ వాలాయంబా దైవము । నాలీలఁ గదుపకున్న నానాజీవుల్ ।
కీలూడిన బొమ్మల క్రియఁ । గూలవె నిమిషంబులోనఁ గువలయనేత్రీ॥౨౯॥
ఆ-వె॥ బొమ్మలాడుచున్న పోల్కిఁ గాఁగనుపించు । నాటకుండు లేక
యాడఁగలవె । యాడుమేని బొమ్మ లందఱు నొగిఁ గందు । రరయ లేరు
బొమ్మ లాటకాని॥ ౩౦॥ క॥ బొమ్మల నాడించుచుఁ దను । బొమ్మల
మధ్యమున వెల్గు భూతేశ్వరునిన్ । నెమ్మదిఁ గానక తంత్రపు । బొమ్మ
నమ్మియును మాయఁ బొందుదు రెలమిన్॥ ౩౧॥ ఆ-వె॥ తంత్రములకు
మేటి యంత్రంబులకు మేటి । మంత్రములకు మేటి మంత్రమగుచు ।
సూత్రములకు మేటి సూత్రంబు తారక । సూత్రమదియె బ్రహ్మసూత్ర
మనఁగ॥ ౩౨॥ క॥ చోరుండైనను దురితా । చారుండును నైన నమిత
జారుండైనన్ క్రూరుండైనను మఱియా । తారకతత్త్వంబుఁగనిన ధన్యా
త్ముఁడగున్॥౩౩॥ ఆ-వె॥ అట్టి తారకంబు నందంగ శక్యమే । యెట్టి
వారికైనఁ బట్టువడదు । పట్టువడిన యేని భగవంతుఁ డాతఁడే। యనఁ
గవచ్చు నెవ్వఁడైన గాని । ౩౪॥ క॥ మతవర్గంబుల చేతను । వ్రతజప
తపశౌచదాన వరశీలములన్ । క్రతుతీర్థ కర్మదుష్కృత । గతులను
గనరాదు తారకం బరయంగన్॥ ౩౫॥ క॥ మఱి యీ తారకమార్గము।
పరికింపంగ నరుదీ ప్రపంచమునందున్ । దరిఁజేర లేని మార్గము। లరయఁగఁ
బెక్కులును గలవు హంసవిహారీ॥ ౩౬॥ సీ॥ జలజాక్షి వినుము ప్ర
జ్ఞానమే బ్రహ్మమున్ ఋగ్వేద వాక్యంబు రీతి దెలిసి। పరికింపఁగా నహం
బ్రహ్మాస్మి యనుయజుర్వేద వాక్యంబును వివరమెఱిఁగి। దనరఁ దత్త్వమ
సినాఁ గను సామ వేదవాక్యంబునుఁ భావించి యనువు మీఱఁ। గ
నయమాత్మా బ్రహ్మమనునథర్వణ వేద - వాక్యంబు వీక్షించి వరు
సతోడ । నితర సంకల్పములు లేక నిశ్చలతను । భూతముల కెల్ల నా
ధార భూతుఁడైన । బ్రహ్మమే యాత్మ యాత్మయే బ్రహ్మమనుచు ।
నాత్మవేత్తలు గాంతురహర్నిశంబు॥౩౭॥క॥ షండుని కయ్యాను రంభయు।
నుండియుఁ గార్యంబు లేని యొప్పున దమలో। నిండియుఁదానై వెలుఁ
గుచు। నుండిన దారకము నొండ నోపరు చెనటుల్॥ ౩౮॥ ఆ-వె॥ ఇలను
దారకంబు సులభమైయుండఁగఁ । దెలియలేక గుట్టు తెలివిమాలి।
మతములాది పెక్కు మార్గంబులం జిక్కి । వెతలఁ బడుదు రెల్ల వెఱ్ఱి న
రులు॥ ౩౯॥ చ॥ మతకులశాస్త్ర ధర్మములు మాని తదాశ్రమవా ది

పద్ధతుల్ । సతతము భక్తిఁ బెంపొదవ సద్గురుపాదము లాశ్రయించి
సద్గతిఁ గలిగించు తారకముఁ గాంచిన వారికె గాక యన్య సం। శ్రితినను
పొందువారలకు సాధ్యమె బాయఁగ జన్మబంధముల్ ॥౧౦॥ క॥ తార
కధన మూర్జించిన । వారలకును నన్య ధనము వరఁగ ఘనంబే ; సారా
మృతములు గ్రోలిన । వారికిక్షీరాదు లెంత వసుమతిలోనన్ ॥ ౧౧॥ క॥
తారకమే పచరాచర । తారకమని యాత్మలోనఁ దలఁచుచుఁ బసుకా।
తారకమే తారకమని తారకమును జెందువారె తత్వజ్ఞులిలన్ ॥౧౨॥
ఉ॥ ధారుణికెల్ల రాజగుచుఁ దానె ప్రభుత్వముఁ జేయుచుండినన్ । నారయ
విశ్వమెల్లఁ దనహస్తములోపలఁ జేర్పనోపినన్ । నేరుగ సర్వవిద్యలను
జేర్చి కవిత్వముఁ జెప్పజాలినన్ । దారకమూర్తిలేక భువిఁ దత్సకలంబును
వ్యర్థమారయన్ ॥ ౧౩॥ ఆ-వె॥ తారకంబునకును దాత్పర్యమగు నాత్మ।
సూత్రధారియనఁగ జ్యోతియనఁగ। పరమహంసయనఁగఁ బరమాత్మ
యనఁగను । స్వామియనఁగ సర్వ సాక్షియనఁగ॥ ౧౪॥ క॥ మగువా
విను బ్రహ్మంబనఁ । దగఁ బరతత్వంబనినను దైవంబనిన । న్నగుణుండ
నక్షరుఁడన। భగవంతుఁడనంతుఁడనఁగఁ బరమాత్మునకౌ॥౧౫॥ఆ-వె॥
పసిడి స్వర్ణ హేమ బంగారమనినను । గనకమునకు వేఱు గానిభంగిఁ।
బెక్కు నామములను బేర్కొనుచుండినఁ । దారకంబునకును వేఱుగ
లదె॥ ౧౬॥ క॥ అనఁ బరమాత్ముఁ డొకండే । యనువున రూపములు
పెక్కు లయ్యెనొ చోద్యంబును నయ్యో శంకమదిదోఁ । చెను దీనిం
దెల్పుమనిన శ్రీహరిపత్నిన్ ॥ ౧౭॥ ఉ॥ ఏకముగాదె మృత్తిక యనేక
ములై చెలువొందుఁ గుంభముల్ । ఏకముగాదు హేమమున నేక
ములై నగడొందుభూషలున్ । ఏకముగాదె తంతువు ననేకములై గను
పించు వస్త్రముల్ । ఏకపరాత్మ దేహము లనేకములై విలసిల్లునట్లుగన్ ॥
౧౮॥ సీ॥ అజహర హరినరా ద్యసుర దిక్పాల స - న్ముని సుధాకర
తార లినసుపర్వ । గరుడకిన్నరయక్ష గంధర్వపన్నగ - శిష్ట విద్యా
ధర సిద్ధసాధ్య । హరిణ మర్కట భృంగ హరిసూకర శునక-గజ
తురంగ పతంగ ఖర లులాయ । బ్రాహ్మణచండాల పశుక్రిమికీటక-
వ్యాఘ్రభల్లగహన వనధిగోత్ర జాలస్త్రీపురుష గనపుంసకవికార।
జారచోరార్భకావృద్ధ జనసమాజ । పంచభూతాది సర్వప్రపంచ
మందు । నిండునండనక పరాత్మ నిండియుండు॥ ౧౯॥ తే-గీ॥ శాకినీ
బ్రహ్మరాక్షస సముదయములు । భూతభేతాళము లతండె పూసి
చూడ । మంత్రఘన యంత్ర తంత్రాది మహిమలకును । గారణుండగు

సర్వార్థ ſ కారి యతఁడు॥ ౫౦॥ క॥ భూరజములు రేణువులను । దారల
లెక్కింపవచ్చుఁ ſ దరుణీమణి యా। తారకబ్రహ్మము సర్వా ſ కారంబు
లునెన్న బ్రహ్మ ſ కైనను వశమే॥ ౫౧॥ చ॥ పుడమిసమస్తజీవులను ſ
బొమ్మలఁ జేసియు నాడఁజేయుచున్ । విడుచును గొన్నిఁ గొన్నిఁటిని ſ వీడక
కొన్నిటి నిల్పి కొన్నిఁటిన్ । నడఁచు నెఱుంగ లేరెవరు ſ నాతని మాయలకె
ల్లవారలు । న్నడఁగి సబద్ధులౌదురు మ ſ హాత్ములు పండితులెల్లనం
ధులై ॥౫౨॥ ఆ-వె॥ కర్తకర్మక్రియలు ſ గలయఁగఁ దానయై । తాను
గాని భంగిఁ ſ గానఁబడుచు । సజముఁ గలుగఁజేయు ſ హరిరక్షణము సేయు ।
శివుఁడు లయము నొందఁ ſ జేయునఁగ॥ ౫౩॥ క॥ సర్వముదై వాధనము ।
సర్వంబునఁ గలడతఁడు సర్వసముండై । సర్వంబు తానయగుచును । సర్వం
బును గాక వెల్గు ſ సమరసవృత్తిన్॥ ౫౪॥ ఆ-వె॥ కలఁడు కలఁడటన్న ſ
ఘనులకు దైవంబు గలయవెందునైన ſ గల్గి తోఁచు । లేఁడు లేఁడటన్న ſ
లీలదానెందైనఁ । గలిగి హీనులకును గానఁబడఁడు॥ ౫౫॥ సీ॥ రాజునై
మంత్రినై ſ రయమొప్ప - భృత్యుఁడై యోగినై భోగినై ſ రోగియ
గుచు ſ కర్ముఁడై ధర్ముఁడై ſ కడుబలాబలుఁడునై - యర్థినై దాతనై ſ
హర్తయగుచు । శాంతుఁడై యుగ్రుఁడై ſ సత్యాత్ముఁడై యనృ -
తాత్ముఁడై పేదనై ſ ధనికుఁడగుచు । సుజనుఁడై మూఢుఁడై ſ సుజ్ఞాన
వంతుఁడై - ధీరుఁడై భీతుఁడై ſ జారుఁడగుచు । నొక్కచోటనాఁడు ſ నొక
చోటఁ బాడు వే । నొక్కచోట నేడ్చు ſ నొకటనవ్వు । నొక్కచోటఁ గిట్టు ſ
నొక్కటఁబుట్టుపో । వాని మహిమ దెలియ ſ వశమె యింతి॥ ౫౬॥ క॥ వారనవీ
రన నెవ్వారు । నారీమణి పెక్కురూప ſ నామములగుచున్ । వేఱుగ వేఱు
గఁ దోఁచుట । నారయ మదికల్పితంబు ſ నాటకుఁడొకఁడే॥ ౫౭॥ ఆ-వె॥
ఒక్కఁడగుచుఁ దాను ſ బెక్కుదెఱంగుల । నిట్లు చేయఁబడుట ſ యేల
యనిన । నొనరఁ దనకుఁ దా వినోదంబుకొఱకునై । యాచరించుచుండు ſ
నద్భుతములు॥ ౫౮॥ చ॥ తలఁపఁగ నింద్రజాలకుఁడు ſ తన్మహిమన్ గరు
లొంటెలశ్వముల్ । చెలఁగి రథాదిసైన్యములు ſ చిత్రపురంబులుఁ జేయు
మాపు నవ్వల నతఁడొక్కఁడైనటుల ſ వారక దైవము సర్వజీవులన్ ।
గలుగనొనర్చు వింతలను ſ గాంచు నడంచును నొకఁడొందుదర్॥ ౫౯॥
ఆ-వె॥ ఎన్నిగతులఁ దోఁచి ſ యేవిధంబుననున్నఁ ſ దానుగాని దొకటి ſ
దలఁపలేదు । అగ్నికుష్ణగుణము ſ లరయంగ సహజమై । వేఱుగాని భంగి ſ
సారసాక్షి॥ ౬౦॥ క॥ తనమాయవలననైనది । తనకన్యముగాదెదియును ſ
దత్సకలమునన్ । దనరూపు గల్గియుండును । దనమాయ లయింపనిల్చుఁ ſ

డొక్కఁడె। సీ॥ బ్రహ్మాది కీటపర్యంతముఁ బామరజనులందు - బల
యుతులందు దుర్బలులయందు। ఘోరపాతకులందు - భూరిపుణ్యుల
యందుఁ - గపటాత్ములందు నిష్కపటులందు। ననృతాత్ములను
సూనృతాత్ములయందును - మఱి శాంతులందుఁ దామసులయం
దు। ద్రవ్యవంతులయందు దారిద్ర్యజనులందు - ధర్మాత్ములందు నధ
ర్ములందు। నీచజనులందు నాజగదీశులందు। నెచ్చుతగ్గులు నేమియు
నెంచరాక। సర్వజీవులఁ బరమాత్మ సముఁడునగుచు। నొక్కరూపం
బుచే వెల్గు నిక్కముగను॥ ౬౨॥ క॥ ఒకఁడే సకలచరాచర। నికరంబు
లయందుఁ గలుగు నిక్కంబుగ నా। సకలేశుఁడుగాకన్యుం। డిఁక నె
వ్వరుదిక్కుగల్గ రెండవ పెడకిరన్॥ ౬౩॥ తే-గీ॥ అండపిండాండబ్రహ్మాండ
మాదియగుచు। నాళలీనమైనట్టియా నభమువోలె। ఘటపటాదులఁ
జరియించుఁ గాలిపోల్కి। దారకమలరుమణిగణ తంతువట్లు॥ ౬౪॥
చ॥ మునుమును నూలులేక నిలఁ బుట్టము లెవ్వియు లేని చొప్పునన్నను
వగుమన్ను లేకను ఘటాదులు నెవ్వియు లేనికైవడి। న్నినుమును లేక
యాయుధము లెవ్వియు చేర్పడకుండునట్లుగాఁ। దనువులు నాదిలోక
ములు దైవము లేకయు గావు గావునన్॥ ౬౫॥ ఆ-వె॥ ఆత్మవలనఁ గల్గు
నఖిలప్రపంచంబు। నాత్మకరసిచూడ నన్యమగునె। విత్తువలనఁ గల్గు
వృక్షంబు భావింప। విత్తనంబునకును వేఱుగలదె॥ ౬౬॥ క॥ ఎక్కడఁ
జూచిన గగనం। బొక్కటియైయుండునట్టి పోలికనే। దిక్కులు
పిక్కటిలందా। నొక్కఁడె తారకమునగుచు నుండుదనువులన్॥ ౬౭॥
తే-గీ॥ దేవుఁడొక్కండెయిల సర్వ దేహములను। దోఁచు నెట్లని
నీమదిఁ దోఁచెనేని। భానుఁడొక్కండె బహుజల భాండములను।
బెక్కురూపులఁ దోఁచడే బిసరుహాక్షి॥ ౬౮॥ ఆ-వె॥ బాహ్యమందుఁ
జూడ బహురూపులై తోఁచు। నంతరమునఁ జూడ నాత్మయొకటె।
చూపునందుఁ గల్గు రూపంబులెల్లను। జూపులోనఁ జూడ శూన్యమ
గును॥ ౬౯॥ క॥ నావుడు బహువిధరూపుల। భావంబునఁ గానుపించు
పరమాత్ముమదిన్। సేవించు టెట్టులొకనిగ। నావిధముం దెలుపుమనిన
నతఁడిట్లనియెన్॥ ౭౦॥ క॥ మానిని పశువులు భేదం। బైనను భేదంబు
లేదు పాలకునట్లే। మేనులు పాక్షికభిన్నం। బైనను భిన్నంబులేదు
పరమాత్మునకున్॥ ౭౧॥ క॥ తరణియొకండయ్యు సకల। ధరణీవలయము
నరశ్మి తనదైనగతిన్। పరమాత్ముండొక్కండై। పరఁగుచు నిఖిలంబు
నిండి భాసిలుచుండున్॥ ౭౨॥ ఆ-గీ॥ జగతి జీవతతుల చరణంబుల

న్నియు । హాస్తిపదములోన నడఁగునట్లు । చరలు మొదలుభూతనికస
ల ప్రపంచంబు నాత్మలోనిడగుచు। నడఁగియుండు ॥ ౨౩॥ క॥ నీరజహితశశి
కాంతలు । బాఅని చోటులనునైనఁ బరికింపఁగనా । తారకబ్రహ్మము
గలుగును । సారసముఖి యతఁడు లేని స్థలముం గలదే॥ ౨౪॥ ఆ-వె॥ ఇం
తలావటంచు నింతదీర్ఘంబంచు । నిట్టిదన్నియుం జుట్టిదంచు । నాత్మ
నెన్నరాదు నామరూపాదిక । ములకతీతుఁడగుట మోహనాంగి॥ ౨౫॥
క॥ అనలంబుఁదాకి యినుమును। దనరూపైదోఁచునట్లు దైవమునానా ।
తనువులయందునఁ గల్గియుఁ । దనవలెనే గానుపించుఁ దత్సకలంబుల్॥
౨౬॥ క॥ ఘనమగుగణములు వేఱగుఁ । దనరంగా వానియందుఁ దంతు
వొకటియగుఁ । దనువులు సర్వము వేఱగు । గనుఁగొన దైవంబొకండు
కాంతామణిరో॥ ౨౭॥ సీ॥ అలలును బుద్బుదంబులు ఫేనములునన్న-
నవియెల్ల నీరంచు నరయునట్లు । నాయుధంబులు రూప నామముల్
వేఱైన - నవియెల్ల నినుమంచు నరయుభంగి । నవని భూషలురూప
నామముల్ వేఱైన - నవియెల్లఁ బసిఁడిగా నరయుభాతి । రూఢిపల్యాలు
నామరూపముల్ వేఱైన నవియెల్ల మాలంచు నరయురీతి । నరయ
కుంభరూప నామముల్వేఱైన । నన్నిమన్నియంచు నరయుపోల్కిఁ।
బెక్కునామరూప భేదముల్ దోఁచిన । నిఖిల మాత్మయంచు నెంచ
వలయు॥ ౨౮॥ ఉ॥ పూర్ణతటాకభాండముల బోల్కి నిషేధమొనర్చి
తద్గతం । బైన జలంబులేక మనిభావమునన్ జలపోయుచందమిా। మాన
వదేవ పక్షిమృగవానరిత జంతునికాయ కాయముల్ । మాని తదంత
రాత్మఁ బరమాత్మని నేకముగాఁగనందగున్॥ ౨౯॥ సీ॥ ఒక్కదేశం
బున నొక్కకాలంబున - నొక్కరూపంబుచేనున్నవాని । వేఱొక్క
దేశాన వేఱొక్క కాలానఁ - గొండొక్కరూపాన నుండఁజూచి। రూఢి
దేశముకాల రూపముల్ విడియెల్ల-యతఁడె యాతండంచు నరయు
మాడ్కిఁ। బెక్కుదేశంబులై పెక్కుకాలంబులై - పెక్కురూపంబులై
భేదబుద్ధి । కలిగిఁ దోఁచుచున్నచు గాలరూప । దేశ నామంబులను
నెల్లఁదీసివేసి। పూని యింతకుఁగారణ భూతుఁడైన। వానినొక్కనిఁగాఁ
జూడ వలయునింతి॥ ౩౦॥ ఆ-వె॥ ఎన్నిగతులనీకు సనుబోధించిన ।
నాత్మకంటెఁగల్గ దన్యమొకటి । యెన్నియెన్నిరూపు లెట్లెట్లుదోఁ
చిన । నన్నియాత్మయంచు నరయుమిావు॥ ౩౧॥ క॥ అనవుడువిని పర
మాత్ముం । డన నేరూపంబువాఁడు నగుజీవాత్ముం । డననెట్టివాఁడు

జీవాత్మ పరమాత్మల లక్షణము.

వీరలకును భేదంబేమియు వినవే కోమలికిసలయోష్ఠీ॥ ౭౨॥ మ॥ తరుణీ దేహ
మునందు రెండుగతులన్ మధ్యంబు మర్మంబుగాఁ। బరమాత్ముండనని
ర్గుణుండునగుచున్ భాసిల్లు నశ్రాంతమున్। గరిమన్ జీవుఁడనంగఁ దాసగు
ణమై గన్పించుచేమర్మమున్నరయఁ దాను నెఱుంగకున్నదియే యజ్ఞా
నమెవ్వారికిన్॥ ౭౩॥ సీ॥ అజ్ఞానమెయ్యది యనవిచారించిన నేర్పునఁ
దన్నుఁదా నెఱుఁగకుంట। యెప్పుడదన్నుఁదా నెఱుఁగరా యెఱుఁ
గర దేమెఱుంగుదురన్న నేను కలని। నేఁబురుషుండను నేఁబ్రాహ్మ
ణుండను నేక్షత్రియుఁడ వైశ్యుఁడనువరయ। నేను శూద్రుండను నేవాని
నిపుత్రుండ నేను ధాత్రీధవుఁడ నేను కవుఁడ। నేను రాముండ కృష్ణుండ
నేను నరుఁడ ననెడు పద్ధతు లెఱుఁగుము రంజిలను। నట్టి యజ్ఞానమును
బాసి యతులమహిమ। దన్నుఁదాఁగన్నవారలే తత్త్వవిదులు॥ ౭౪॥
ఆ-వె॥ ప్రచురమైన జీవపరమాత్మ భావముల్। తేఁటతెల్లమిగను దెలి
యవలయు। నట్లుగాక యున్న నజ్ఞభవాది వి। ర్జడులకైనఁ జెడదు
సంశయంబు॥ ౭౫॥ క॥ కావున సతి పరమాత్ముని। యావిధమును గొంత
వింటి వదిచెల్లుందెన్। జీవాత్మ తెఱఁగువినుమిఁక। భావంబునఁ
జిక్కులెల్ల బాయునుసికన్॥ ౭౬॥ ఆ-వె॥ జగతి పాపపుణ్య చయ
మును గావించు। నరకస్వర్గములను ననుభవించు। నెఱుఁగుచుండు
మఱచు నెల్లకార్యంబులు। సేయుచుండువాఁడె జీవుఁడగును॥ ౭౭॥
క॥ జీవుఁడె జన్మకుమూలము। జీవుఁడె సుఖదుఃఖములను జెందును
ధాత్రిన్। జీవుఁడె బంధములోఁబడు। జీవుఁడె మోక్షంబుఁగాంచు సిద్ధ
ము తరుణీ॥ ౭౮॥ ఆ-వె॥ సఖియ జీవుఁడెన్న సకలేంద్రియములకు। రాజు
నగుచునుండు రాజితముగ। నతఁడు లేక యింద్రియంబులు నేమియుఁ।
జేయఁజాలవింక సిద్ధముగను॥ ౭౯॥ క॥ ధరషడ్వింశకుఁడగు నా। పర
మాత్ముఁడెయుంచు నాత్మ భావింపవలెన్। మఱి పంచవింశకుండన।
నరుదుగ మనమునిసజీవుఁ డనిగాంచఁదగున్॥ ౮౦॥ తే-గీ॥ ఇంద్రియం
బులుగైకొని యెల్లపనులు। గడుప్రనట్లుగఁజేయఁడాఁ గర్తయగుచు
నీలతోయదమధ్యస్న్మేరుపీఠి। సబికుఁడైయుండు జీవుండు। జాగర
మున॥ ౮౧॥ క॥ గళమునకు డిగ్గినిల్చిన। కలలను గనుచుండు హృదయ
గతుఁడైనయెడన్। దెలివిదొఱంగి యవిద్యను। నలరంగా మునిఁగిపోవు
నఖిలముఁ దాసున్॥ ౮౨॥ తే-గీ॥ అంత నాపంచకమల సింహాసనమున।
జేరి జీవుండు జాగ్రతఁ జెంది తనదు। భటులుగానున్న యింద్రియ

ప్రకృతిచేత । నెల్ల కార్యంబులును జేయు నేర్పరించు॥ ౯౩॥ క॥ జీవుఁడె
జాగ్రతనొందును । జీవుండే సుఖదుఃఖంబుఁ జేయునుబనులన్ । జీవుఁడె
స్వప్నముగాంచును జీవుండే నిద్రఁజెందు జీవుఁడె తెలియన్॥ ౯౪॥ క॥
ఇన తేజ మాశ్రయించియు । జను లాయాపనులఁ జేయు చందముపర
మాత్ముని సత్తామాత్రంబునఁ । బని గొని మనమింద్రియములు పనులను
గడవున్॥ ౯౫॥ తే-గీ॥ స్వాంతమును జెర్వ సనుపొందఁ గా నయస్సు।
నెట్లుచలియించువారీతి సిద్ధనంబు । నైన బ్రహ్మంబు సన్నిధి నరయఁ
ద్రిగుణ । సహితుఁడగుచును జీవుండు చలనుఁడయ్యె॥ ౯౬॥ ఆ-వె॥
సభయ మనంబునేక సంశయములకు మూ । లంబు నిగ్రహింప రాని
దంచు । నెంచిచూడ సకల చాంచల్యములకును । గారణంబునగును
గాన వినుము॥ ౯౭॥ ఉ॥ ఇట్టిమనంబు దుస్తరము దెట్టుల నిగ్రహమే
నొనర్తునా । నిట్టటుసంచరించు పశు వెట్టులబంధమొనర్పనిల్తునో ।
యట్టుల నెప్పుడేమఱక యాద్యులబోధనుమంచివాగెలన్ । గట్టుపడంగఁ
జేసినను గాకను గాలిమనంబునిల్చునే॥ ౯౮॥ ఆ-వె॥ ఒనర వలల
నుడల నోడలఁగోలలఁ । గా దెయ్యమక పక్షి గజమృగంబు । లాది
దగులువనుట యట్లు తారకసాధ । నమున మానసేంద్రి యములు
చిక్కు॥ ౯౯॥ క॥ అనవ్రుడుఁడవచు వాక్కుటిరయే । గనుపడునందఱికి నాల్గు ।
గలవని మేనుల్ । వినియుంపు నెవ్వియుమిడుచు । గనకొనఁగకె నవియెగోపికె
తావల్లభుఁడున్॥ ౧౦౦. క॥ మరితత్వపంచవింశతి । సురుచిరముగఁ గల్గి

తనుచతుష్టయ నిర్ణయము.

నదియె స్థూలశరీరం । బరఁగఁగ జాగ్రతదానికి । విరివిగ నామంబున
లరు విశ్వుఁడనంగన్॥ ౧౦౧॥ క॥ జ్ఞానేంద్రియములు బ్రాణులు । మానిప్రాణ
మునుగూడి మానసబుద్ధుల్ । గానయివ్యసూక్ష్మమదికలదానికినామం
బుకల్గెఁదైజసుఁడనఁగన్॥ ౧౦౨॥ క॥ ఇరవుగఁ జిత్తముజ్ఞాతను । గరమ
రుదుగఁ గూడినదియె కారణదేహం। బరయసుషుప్తియు దానికిఁ। బరి
కింపఁగ నామమొప్పెఁ బ్రాజ్ఞుఁడనంగన్॥ ౧౦౩॥ క॥ కలజాగ్రతనిద్ర
లలో। నెలమి స్వయంజ్యోతియగుచు నిలిచిన వెలుఁగే॥ దలఁప మహాకా
రణమది । నలువొందు హిరణ్యగర్భుఁ డను నామమునన్॥ ౧౦౪॥
తే-గీ. మూడు దేహంబులనుదాల్చి ముఖ్యముగను । జీవుఁడీమూడవ
స్థలఁ జెందుచుండు । నేయవస్థలనెఱుఁగక యేకరీతి। నుండు పరమా
త్ముఁడెపుడు నఖండమగుచు॥ ౧౦౫॥ క॥ కారణదేహంబనఁగను।నార
యగూఢంబు ముంచు నదియే దెల్పన్ । కారణమును విత్తదియే। శారీ

రము లనెడువృక్ష । చయమొనరింపన్॥ ౧౦౬॥ ఆ-వె॥ మూడు మేనులే
కను । మూలమైయున్నట్టి । పరముగానలేక । భ్రాంతుఁడగుచు । నిద్ర
జాగరముల । నిరతంబు జీవుండు । మునిఁగి తేలుచుండు । మూఢవృత్తి॥
౧౦౭॥ మత్తకోకిల॥ ఎన్నిగానిల జన్మకర్మలఁ జెందుచుండెడు జీవుఁడు।
నెన్నిభంగులనైనఁ జెందఁడి । కెన్నఁగా నలమోక్షమున్।బన్నుగాఁ బర
మాత్మనెప్పుడు। భావమందునఁగాంచునో । గ్రన్ననం గడ దేరునప్పుడె ।
గట్టిగా మఱిజీవుఁడున్॥ ౧౦౮॥ క॥ జలములయందున లవణము । గలిగి
నగతి నాత్మయందె గల్గమనంబున్ । జలగతలవణముపోలికఁ।గలియఁగ
బరమాత్మయందె । గతజీవుఁడగున్॥ ౧౦౯॥ ఆ-వె॥ నిర్మలాత్మయందు ।
నీవికారంబగు । నట్టిమాయదోఁచు । నెట్టులనిన । దోయజారియందుఁ ।
దోఁచుకళంకంబు । వలెనటంచుఁ దెలియ । వలయుఁదరుణి॥ ౧౧౦॥ క॥
పరమాత్మయందు జీవుం । డరయంగా నెట్లుగల్గె । ననియెంచకునీ। కెఱిఁ
గింతునదియు నెట్లనఁ । బరిశుద్ధపు నీళ్ళఁబుట్టు । పాచివిధమునన్॥౧౧౧॥
ఆ-వె॥ స్ఫటిక ముకురమాది - జలములయందునఁ । బ్రతిఫలించివస్తు ।
ప్రతతివోలె । మఱియు నిష్కళంక । మైన బ్రహ్మమునందు । మలినమై
నజీవ । మాయదోఁచె॥ ౧౧౨॥ క॥ ఏవిధమైన కళంకము । భావింపఁగఁ
గల్గదెపుడు । పరమాత్మునకున్ । గావున మాయలు సర్వము జీవునకే
గాని మాయఁ । జెందునె యతఁడున్॥ ఉ॥ ప్రాపుగ నిర్వికారుఁడగు
బ్రహ్మము నద్దియెఱుంగకుండఁగా బాపుమాయయేపగిది । ప్రాప్తము
నయ్యెనటంచుఁ జూడఁగా । దీపముక్రిందనీడయును । దీపమెఱుంగక దోఁ
చుకైవడి । న్నాపరమాత్మ యందునను । నాతఁడెఱుంగక గల్గెమా
యయున్॥ ౧౧౩॥ ఆ-వె॥ అనిలవశత నెగసి । యంబుధరంబులు పరఁగ
మింటఁగూడి । పాయునట్లు । త్రిగుణవశములగుచు । దీపించువిశ్వంబు ।
బ్రహ్మమందు మఱలఁ బాయుచుండు॥ ౧౧౪॥ క॥ ఫణిరాజవేణివినుని ।
ర్గుణుఁడేమాయలను నెఱుఁగ । కుండఁగఁదనలో గుణమయవిశ్వము
దోఁచుట। గణుతింపఁగ నూర్ణనాభి కైవడినొప్పన్॥ ౧౧౫। క॥ నావుడు
చక్రము లనఁగను।నేవియగున్నెన్నియవియు నెచ్చటనుండున్। నేవిధము

## షట్చక్ర నిర్ణయము.

దెలియఁదగునన । నావెలఁదికినిట్టులనియె । నగధరుఁడెలమిన్॥ ౧౧౬॥
తే-గీ॥ కమలదళనేత్ర యీ స్థూల । కాయమందు । నరయఁగా సప్తచ
క్రంబు । లమరుచుండు । గోప్యములుగాన నేరికి । గోచరంబు । గావు
వానినీకెఱిఁగింతుఁ । గాంతవినుము॥ ౧౧౭॥ఆ-వె॥ దినమురాత్రిగలుగున్

దినముకీర్త్యాదియును । నొక్క—వేయినాఱు ళ నూఱుమార్లు । హంసనడుచు
చుండు ళ నజపాఖ్యనొకరీతి । సకలజీవులందు ళ సంతతంబు॥ ౧౧౯॥ వ॥
విరాట్టుస్థూలశరీరాంతర్గతంబునగుచు గుదస్థానంబున "ఓం" అను బీజాక్ష
రంబును భూసదనంబును బీతవర్ణంబునై యాధారచక్రంబు శోభిల్లు,
నందుఁ జతుర్దళంబులయందు వ-శ-ష-స-యనువర్ణంబులుం గలిగిభూ
లోకంబనం జెలంగునందువల్లభశక్తియుక్తుండైన విఘ్నేశ్వరునకునార్నూ
ఱుహంసలును, లింగస్థానంబున "న" యను బీజాక్షరంబును జలనిలయంబు
ను శ్వేతవర్ణంబునై స్వాధిష్ఠ చక్రంబురంజిల్లు. నందుషడ్దళంబుల యందును
బ-భ-మ-య-ర-ల-యనువర్ణంబులాఱుంగలిగిభువర్లోకంబనందగు, నం
దుభారతీయుక్తుండైనబ్రహ్మదేవునకునాఱు వేలహంసలును నాభిస్థానంబున
"మ" యను బీజాక్షరంబును ననలాలయంబును రక్తరూపంబునై మణి
పూరకచక్రంబు భాసిల్లునందుదశదళంబులయందును-డ-ఢ-ణ-త-థ-ద-
ధ-న-ప-ఫ-యను దశవర్ణంబులు గలిగి, సువర్లోకంబనంబడు నందు శ్రీసతీ
యుక్తుండైన విష్ణుదేవునకు నాఱు వేలహంసలును హృదయస్థానంబున 'శి'
యను బీజాక్షరంబును ననిలవాసంబును ధూమ్రవర్ణంబునై యనాహత
చక్రంబువిలసిల్లు, నందుద్వాదశదళంబులయందును-క-ఖ-గ-ఘ-ఙ-చ-
ఛ-జ-ఝ-ఞ-ట-ఠ-యనుద్వాదశవర్ణంబులుఁగలిగి మహర్లోకంబనంబరఁ
గునందుఁ బార్వతీయుక్తుండైన శివదేవునకునాఱు వేలహంసలును; గంఠ
స్థానంబున "-వా-" యను బీజాక్షరంబును గగనసదనంబును నీలవర్ణంబు
నై విశుద్ధ చక్రంబు చెలువొందు, నందు షోడశదళంబులయందును-అ-ఆ-
ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏఐ-ఓ-ఔ-అం-అః-యనుషోడశస్వరం
బులుంగలిగిజనర్లోకంబనఁదలరు, నందుమాయాశక్తియుక్తుండైనజీవాత్మ
నకు వేయిహంసలును, భ్రూమధ్యస్థానంబున "-య-" యను బీజాక్షరం
బును పంచభూత సమన్వితంబును మాణిక్యవర్ణంబునై యాజ్ఞాచక్రంబు
నొప్పు, నందుదళద్వయంబునందును "హం-క్షం-" అను వర్ణద్వయం
బునుం గలిగి తపోలోకంబనందనరు, నందు నాదిశక్తియుక్తుండైన పర
మాత్మునకు వేయిహంసలును, బ్రహ్మరంధ్రస్థానమున "-రాం-" అను
బీజాక్షరంబును సర్వవర్ణ సమగ్రంబునై సహస్రారచక్రంబు వెలుంగు
నందు సహస్రదళంబులును గుణనిర్గుణంబులుం గలిగి సత్యలోకంబనవె
లయు; నందుసర్వశక్తియుక్తుండైన సద్గురుస్వామికి వేయిహంసలునునర్ప
ణంబగుచుండు॥౧౨౦॥ పం-సీ॥ మఱిహృదయాంతర ళ మందున నొక
యష్ట - దళపద్మమలరును ళ దానినడుమ ॥ హంసదీపాకృతి ళ నైవెలుం

గుచు వాయు - చలనమైయూఁచుపుట్టి దళములందుఁ। బాఱనింద్రునిదిక్కు
పాఱఁబుణ్యవిచార - మాజ్ఞేయమునఁగుద్పుట్టి సట్టిచింత। యమభాగ
మునఁబాప మాచరించెడిచింత - నైరృతిదిగ్రతి నందుచింత। నెల
మివరుణునిదిక్కు నిద్రించుచింతయు గరువలిదిక్కున గమనచింత॥
తే-గీ॥ కోరిధనదునిదిశ డబ్బు గూర్చుచింత। రమణియీశాన్యదిశ
నువై రాగ్యచింత। సకలితంబుగనాజ్యోత్రతి ఘట్టికమల। మధ్యము
ననిల్వనగుఁ బర మార్థచింత॥ ౧౨౧॥ ఆ-వె॥ జ్ఞానమనఁగ వెల్గుకై వడి
నుండున। జ్ఞానమనఁగఁదమము చందమొప్పు। జ్ఞానమనెడు వెల్గు
గాంచినయప్పుడే యు। జ్ఞానమనెడుతమము సమయునబల॥ ౧౨౨॥ క॥
సుజ్ఞానముగనునంతకు। నజ్ఞానంబు విడిచి చన దంబుజవదనా। యజ్ఞా
నముదుగువఱకును। సుజ్ఞానముదోఁచఁబడదు సుజనులకైనన్॥ ౧౨౩॥
ఆ-వె॥ విననివానికంటె విన్నవాడధికుండు। విన్నవానికంటెఁ గన్న
వాఁడు। కన్నవానికంటె ఘనుఁడుయాభూఘుఁడు। వానికంటెఘనుఁడు
వసుధలేఁడు॥ ౧౨౪॥ క॥ ధరనొకని పేరువినియును। మఱివానిం జూడ
నట్టి మనుజవిధమునన్। బరమాత్ముందనెనినియును। నెఱుఁగన్ప్రౌఢుఁ
గాంచియతని నింతకుసేవ్యన్॥ ౧౨౫॥ సీ॥ కాశియన్ వాక్యంబు కర్ణం
బునను విన్నఁ - జెలఁగఁగాశియనుచుఁ జెప్పుకొనిన। వినినంతతాఁ
జెప్పు కొనినంతమాత్రాన-వారణాసిని గన్న వాఁడగునొకో। నెలవు
గానక్కాశి నెఱిఁగినవారల - వెనువెంటనేతెంచి విలసితముగఁ।
గాశికాపురమును గనులారఁజూచినఁ గాదెయాత్మకుఁదృప్తి కర
మటులినే? తే॥ యరయఁగాననఁ బరమాత్ముఁ డంచు విన్న। నేమిగ
లదింకఁ బరమాత్మ నెఱుఁగువారి। కరుణచేతను బరమాత్మఁ గాన
కున్న। వినినచెప్పినవెల్లను విఫలమరయ॥ ౧౨౬॥ చ॥ జలజ దళాక్షి
లోకమున సద్గురుమూర్తి యనుగ్రహంబునన్। దెలివివహించి బ్రహ్మ
మునుదీర నెఱుంగక యెంతవారికిన్। బలువిధశాస్త్రవాసనలఁబాయదు
సంశయమెంతమాత్రమున్। జెలవుగఁ జిత్రదీపమునఁ జీకటియున్ జెడ
నేరనట్లుగన్॥ ౧౨౭॥ తే-గీ॥ బ్రహ్మవిద్యయు జన్మంబుఁ బాపుకతన।
నమృతమును మృత్యుజరలాది నణఁచువలనఁ బరఁగఁజండాలుచేనైనఁ
బ్రహ్మవిద్యఁ। బొందదగునమృతము విషం బుననునైన॥ ౧౨౮॥ క॥
ధరనీచువలననైనను। నరయంగానెట్లువచ్చు నప్పరమహితం। బర
యంగ నెవ్వరికైనను। గురుతరముగ నతనిఁగొల్చి గొనకావిద్యన్॥
౧౨౯॥ క॥ ధనమిచ్చియైనఁ దానే। ర్చినవిద్యయొసంగియైన శిష్యత్వంబు।

న్నొనరించి పరమవిద్యను । గొనఁదగు మనుజుండు హీనలోకులచేనైనన్॥ ౧౩౦॥ క॥ గురుశుశ్రూషలొనర్చియుఁ । బరవిద్యనుగొనుటమిగులఁ ఫల కారియగున్ । మఱిధనవిద్యలుసేవకు । సరిగావనియందురార్యలోజనులు ధరిత్రిన్॥ ౧౩౧॥ క॥ మాటలుచేతను మోక్షము । నేటుగ నెవ్వరును దెలియ § సేరరుగానన్ । నాటకకథాదులుండెను । సూటిని దెలియంగ వలయు § సూక్ష్మములోనన్॥ ౧౩౨॥ తే–గీ॥ ఉంకుని మ్మోసదెబ్బదిరెండు వేల।నాడులందుననిడ వామ § నాసికమునఁ । గుడినిఁబింగళయనునాడి § గుదిరియుండు । మధ్యభాగంబునను సుషు § మ్నయు వెలుంగు॥ ౧౩౩॥ సీ॥ హాస్తినాడియు జిహ్వ § యందున నెడమనేత్రంబున ఘాసిల్లు § రమణ తోడ । నాతిశంఖనినాడి § నాభియందుననుండు – గాంధారి యను నాడి । కంటనుండు । విడకపూషానాడి § కుడికర్ణమందుండు – నెడమఁ బయశ్విని § యిమిడియుండు । లీలనలంబస § లింగంబునందుండుఁ – గుదిరికుహూనాడి § గుదమునుండు । మొనసి యీచెప్పినవియెల్ల § ముఖ్యమైన । నాడులందున నిడయుఁ బిం § గళ సుషుమ్న । లనెడు నా డులుమూఁడును § నన్నిఁటికిని । శ్రేష్ఠమైనట్టి నాడులౌ § చిగురు § బోఁడి॥ ౧౩౪॥ క॥ కమలాసన పింగళయే । కమలాక్షుని నాడియంచుఁ § గనఁదగునిడయే । కమలారినాడి యనఁదగు । నమరంగ సుషుమ్నయ గ్ని § నాడియనఁదగున్॥ ౧౩౫ ఏ॥ తే–గీ॥ ఇడయుఁ బింగళయు సుషుమ్న § యెచట § గూడు । నట్టిసదనంబె భ్రూమధ్య § మనఁగ నొప్పు । రంగుగనదియె ముక్కోటి § సంఘమనఁగఁ । గోరిచూడంగ నదియె త్రికూటమనఁగ॥ ౧౩౬॥ క॥ గంగయనంగను నిడయుం । బింగళయన యమున యనియు § మేటిసుషుమ్న । పొంగుసరస్వతి యనియును । సంగతి దెలియంగవలయు § సామజగమనా॥ ౧౩౭॥ ఆ–వె॥ రమణి ఘ్రాణకర్ణ § రంధ్రముల్ భ్రూమధ్య । దిగువఁగలసియుండు § నగణిత ముగఁ । తెలియఁ వినుమ యదియె § శృంగాటకంబన । నదె చతుష్పదం బ § నంగనొప్పు॥ ౧౩౮॥ ఆ–వె॥ నయన వక్త్రగుహ్య § నాసాగుద శ్రోత్ర। ములును మార్గనవక § మొగినినయ్యె । నెన్నుటకునువశమె § యీనవద్వారక । నాఁబురంబునీకు § నకునునైన॥ ౧౩౯॥ తే–గీ॥ అరయ నీపురినిర్మితం § బంచచేత । జీవుఁడనియెడు మంత్రితోఁ § జెలువు మీఱ । నింద్రియంబులనెడుభట § నికరమునతో । రమణఁబాలించు పరమాత్మ § రాజగుచును॥ ౧౪౦॥ క॥ వినుమిఁకనీ కాయాపుర । మున భగవంతుండుగలఁడు § పురుషోత్తముఁడా । యనఘుని సేవించియుఁ బావ

నలగుదురు పూరజనులు / వారిజగంధీ॥ ౧౮౧॥ ఆ-వె॥ ఒనరఁ ద్రిపు
టీనదుమ / నుపజిహ్వకను బూర్వ । దిక్కునగుచునుండు / దేవుఁడ
రయ । గూఢమెవ్వరికి న / గోచరమిది బాహ్యరూపులన్నిఁటికిఁ బ /
రుండునగుట॥ ౧౮౨॥ క॥ తెలియఁగవచ్చును హేమ్యము । దెలియంగా
వచ్చు కాల / దేశవిధంబుల్ । దెలియఁగవచ్చును నాశము । దెలియంగా
రాదనుమ్ము / దేవునిమహిమల్॥ ౧౮౩॥ ఆ-వె॥ పద్మనేత్ర యట్టి భగ
వంతు నిష్ఠను । నీకుఁ దెలుపనాత్మ / నెంచినాఁడఁ / గాన నిపుడునీదుక
కన్నులపండువు । గాఁగఁ జూడుమాత్మ / కలంకదీజ॥ ౧౮౪॥ క॥ ఇందు
ముఖి యాపరాత్పరుఁ । డెందోకలఁడంచునీవు / నెన్నకేమిఁకనా । యిం
దుదివాకరనాడుల । యందునఁ జరియించుచుండు / నాతఁడె తలఁపన్॥
౧౮౫॥ తే-గీ॥ ఇడను బింగళనాడిని / నేకరీతిఁ । బవలు రాత్రియు
నంతర / బాహ్యములను । మాఱుతాకృతియగు పర / మాత్మఁగనిన।
మనుజునకు ముక్తి కరతలా / మలకమరయ॥ ౧౮౬॥ క॥ ఈడునుజోడును
లేకయు । నాఁడుది మగఁవాడుగాక / యఖిలమునందున్ । గూడియుఁ
గూడకమెలఁగెడు । వాఁడె భగవంతుఁడనుచు / వర్ణింపఁదగున్॥ ౧౮౭॥
తే-గీ॥ సుదతి పరమాత్మకెన్నడు / క్షుదయుఁదృష్ణ । గలుగనేరదు
జాగ్రత / కలయుసుప్తి / యరయ లేవింకఁ ద్రిగుణంబు / లాదిమాయ।
లేమియును లేక తావెల్లు / నెల్లయెడల॥ ౧౮౮॥ క॥ సుడిఁగొని షట్చక్రం
బుల । విడువక పరమాత్మ తంతి / విధమున నెపుడున్ । నడుచుచునుం
డునులోవెలి । నిడపింగళనాడులందు / నిందునిభాస్యా॥ ౧౮౯॥ తే-గీ॥
అరయమనమాది సర్వేంద్రియములుగాక । ద్వంద్వకామాది ముక్తబం /
ధములులేక । జన్మవృద్ధియు క్షీణంబు / జరయు మరణ । మాదివికృతి
లేకయు పర / మాత్ముఁడుండు॥ ౧౯౦॥ క॥ పరమాత్ముఁడు సుఖదుఃఖము।
లెఱుఁగడు పుణ్యంబుపాప / మెఱుకమఱవులున్ । ఎఱుఁగరం డే కర్మం
బుల । నిరతము నొకరీతినుండు / నిర్గుణుఁడగుచున్॥ ౧౯౧॥ ఆ-వె॥ నిర్గు
ణత్వమునను / నెద్దియుగాకయు । సగుణరూపమునను / సకలమగుచు।
సర్వసాక్షియగుచు / సగుణాదిజగములు । గాకయుండునిర్వి / కారుఁడ
గుచు॥ ౧౯౨॥ క॥ మదికినిఁదోఁచుచు నుండును । వెదకినఁ గనుపడక
యుండు / విశ్వంబెల్లన్ । బొదలుచునుండును దాన । సదయాంతర్యా
మియగుచు / సకలమునందున్॥ ౧౯౩॥ ఆ-వె॥ నామరూపగుణము /
లేమి బ్రహ్మమునకు । లేనికతనమాయ / లోనఁజిక్కి । యతనిగానలేక /
యడవియుగంబులు । తపమునల్పుటయును / దాపసులును॥ ౧౯౪॥ ఆ-వె॥

స్వగతవిగతముల్ స్వ॥జాతివిజాతిభే।దములు లేక నాత్మ॥తత్త్వమగుచుఁ। గన్నవారికెందు॥నెన్నశక్యముగాక।యున్నవానిఁ గనుము॥సన్నుతాంగి॥ ౧౫౬॥ క॥ అన్నింటను బర। మాత్మయె। యున్నను దద్రూపులెవ్వి॥ పొందఁడతండు। నెన్నఁడు నేగతిఁ జెందక। యున్నట్లే యుండునెపుడు॥ నొక్కవిధముగాన్॥ ఆ-వె॥ అనిన రక్తమాంస॥మైన దేహంబుల।యందు నాత్మయెట్లు॥ పొందకుండు। నదియుఁ దెల్పుమనిన॥ నాయిందుముఖితోడ। నగుచు నిట్లనియె॥ నగధరుండు॥ ౧౫౭॥ క॥ జలజాప్తుఁడు కల్మషజల। ములఁ దోఁచియు నంటఁ బంక॥ మునుబొందక ని। ర్మలుఁడగు క్రియఁ బరమాత్ముఁడు।గలయఁడు నానాశరీర॥ గతుఁడయ్యుఁ దగన్॥ ౧౫౮. క॥ అనిలము మేధ్యామేధ్యము। లను బాఱియుఁ దద్వికార॥మంటనియట్లే। మనుసర్వభూతజాలము। లను నంటియునంటకుండు॥నాత్మయు నెదియున్॥ ౧౫౯॥ తే-గీ॥ అవని మనుజుఁడు గృహముల॥ యందు మెలఁగి। కాపురంబులు సేసిన॥ కరణి సర్వ।లోకముల యందుఁజూడఁదా॥నేకమగుచుఁ। దనువులే తనకిండ్లుగా॥దైవమొప్పు॥ ౧౬౦॥ క॥ తనువే తానని యెంచుట। మనుజులకండఱికి సహజమగునది మఱియున్। దనుఁ దానెఱుఁగక మాటికిఁ। దనువే తాననుటగొప్ప॥ తప్పుగఁగాదే॥ ౧౬౧॥ ఆ-వె॥ ఇంటనుండువాని॥ కింటికిసంగంబు। లేక యుండునట్లు॥ జోకతోడ। దేహమునకు నందు॥ దేహికిసంబంధ।మేమి లేక యెపుడు॥ మెలఁగుచుండు॥ ౧౬౨॥ క॥ ఇంటికి వెలిగా మానవుఁ।డంటక విహరించుచుండు॥ నటువలె దేహం। బంటక దేహిచరించును।నంటినగతినుండు వేని॥ నంటకయుండున్॥ ౧౬౩॥ ఆ-వె॥ భవనమందు నరుఁడు॥ నివసించియున్నను। నిల్లు నేనటంచు॥ నెంచనట్లు। మేనునందుఁ దాను॥ మెలఁగుచునున్నను। దనువు తాననంగఁ॥దగదు చూవె॥ ౧౬౪॥ చ॥ వెలయఁగ గేహమందునను॥ వింతపదార్థములెల్లఁ గన్పడన్। వెలుఁగనొనర్చి వానికిని॥ వేఱగుచుండెడు దీపమట్లుగన్। వెలయఁగ మానసాది సక॥ లేంద్రియ సంగతమైన మేనులన్। దెలివి వెలుంగఁ జేయుచును॥ దేహియు వేఱగుచుండు నింతకున్॥ ౧౬౫॥ క॥ అనవిని తారకమంత్రం।బును నానతియిమ్మటన్నఁ॥ బురుషోత్తముఁడున్। గని భీష్మరాజవరసుత। కును జెప్పఁదొడంగె నిట్లు॥ కుతుకమెలర్పన్॥ ఆ-వె॥ మగువ వినుము మంత్ర॥మంత్రమూలములు మం।త్రార్థ మంత్రసార॥ మాదియైన। మర్మములను నీకు॥ మానక యెఱిఁగింతు। నిపుడు సూక్ష్మబుద్ధి॥ నెఱుఁగవలయు॥ ౧౬౬॥ పరహంసుని

హంసలక్షణము.

సంచారము । నదలెవ్వరు నెఱుఁగరింకఽ నంతరమునకున్ ।నదు దెంచు నె
పూరకమగుఁ । బరికింపఁగ రేచకంబుఽ బాహ్యము కేగన్॥ తే-గీ॥ లోప
లికి నేగి యాయుంచ ఽ లోన నడఁగు।నదియె యంతరకుంభకంఽ బనఁగబ
రఁగు । వెలికి సంచారమే తెంచి ఽ వెలినడంగు । నదియెపో బాహ్యకుం
భకంఽ బనఁగ నొప్పు॥ ౧౭౯॥ క॥ పూరకమున సొవర్ణం।బారయ రేచ
కమునందు ఽ హాస్వనువర్ణం । బూరకగూర్చి జపించినఁ । దారకమం
త్రంబ యగును ఽ దప్పదు ముమ్మా॥ ౧౮౦॥ క॥ ఇదియే పరమరహస్యం ।
బిదియే మంత్రార్థమనఁగ ఽ నిలను ప్రసిద్ధం । బిదియే జపసూత్రంబన ।
నిదియే పరికింప నజపనిజవేత్తలకున్॥ ౧౮౧॥ తే-గీ॥ అరయువ క్త్రింబు
కర్మేంద్రి ఽ యంబుఁగాన । బాయకను నోట జపమును ఽ జేయరాదు।
కర్మవాక్కున ధ్యానింపఁ ఽ గర్హమునకె । మూలమగుఁగాని ముక్తికి ఽ
మూలమగునె॥ ౧౮౨॥ క॥ వెదవ్రులను గనల నీయక । విదితంబుగఁ బర
మహంస ఽ వెంబటించిన । సదిఁబొందించి భజించిన। సదయాత్ముఁడు
సులభముగను ఽ సద్గతిఁగాంచున్॥ ఉ॥ తారకమంచు నెంచఁబడు ఽ తత్వ
మెఱుంగఁగలేక కొందఱిం । పారధరిత్రిన ప్రణవఽమంత్రము మాత్రము
నేర్చి వాక్కునన్ । సారెకు నుచ్చరింపుదురు ఽ సార్థకమే ముగుదాన భా
వమున్ । దారకమంత్రమందునను ఽ దప్పకగూర్చి జపింపలేని చోన్॥
౧౮౩॥ క॥ మూనిని రేమంత్రంబులు । సానుగ జిహ్వేంద్రియమునఽ జపి
యింపవలెన్ । గాని యిఁక వాక్కుచేతను । బూని స్మరింపగరాదు ఽ
భువి నెవ్వరికిన్॥ ౧౮౪॥ క॥ అజపామంత్రం బెవ్వఁడు। భజియింపక తనకు
దానె ఽ బవలును రేలు । న్నజపనటించును గావున । నజపను నామంబు
గల్గె ఽ నాహంసునకున్॥ ౧౮౫॥ తే-గీ॥ చతురపంచషడాక్షరి ఽ సంతతు
లును । నష్టమేకత్రయాక్షరు ఽ లాదిగాఁగ । సప్తకోటి మహామంత్రఽ
చయములెల్ల । మఱియు సరిగావు తారక ఽ మంత్రమునకు॥ ౧౮౬॥ క॥
మంత్రములకెల్లఁ దారక । మంత్రంబే మూలమంత్రఽమగుఁ గావుననీ ।
మంత్రము సామాన్యంబగు । మంత్రంబని యెపుడు నిదుఽమది నెన్నకుమీ॥
౧౮౭॥ తే-గీ॥ ధరణిని నజపసూత్రంబు ఽ దాల్చినట్టి । నరుఁడెవండైన సఁ
హాఱుఁడ ఽ నంగఁబరఁగుఁ । దక్ష్యముగ బాహ్యసూత్రంబు ఽ దాల్చియు
జప । పరత లేకున్న నెట్లగు ఽ బ్రాహ్మణుండు॥ ౧౮౮॥ క॥ బ్రహ్మవిచా
రము నొందియు । బ్రహ్మముఁగనుఁగొన్నవాఁడెఽ బ్రాహ్మణుఁడగుఁబో।
బ్రహ్మమని నోటఁబల్కుచు । బ్రహ్మముఁ గనలేనివాడు ఽ బ్రాహ్మణుఁ

డగునే॥ ౧౮౦॥ ఆ-వె॥ అనిన వెలుఁగటంచు ఽ నందురు కొందఱు। నేమి వస్తువదియు ఽ నెట్టులుండుఁ। దెల్పుమంచు వేఁడ ఽ దేవకీనందను।డాదర మున నిట్టు ఽ లనియె సతికి॥ ౧౮౧॥ క॥ వెలుఁగనఁగాఁ బరమాత్ముఁడె। వెలుఁగన ననలార్కచంద్ర ఽ వెలుఁగులుగాఁదా। వెలుఁగులకెల్లను మొదలిటి। వెలుఁగే యీవిశ్వమెల్ల ఽ వెలిఁగించుఁదగన్। ౧౮౨॥ సీ॥ అబ్జభవాదుల ఽ కాధారమగువెల్గు ప్రణవరూపంబునై ఽ పరఁగువెల్గు। దివిజేంద్రసురలకుఁ ఽ దేజమిచ్చినవెల్గు - పంచభూతములందుఁ ఽ బ్రబలువెల్గు। అష్టదిక్పాలుర ఽ యందుఁగల్గినవెల్గు - తారచంద్రార్కులఽ దనరువెల్గు। పదునాల్గులోకముల్ ఽ ప్రబలిసిండినవెల్గు - సిద్ధచారణులందుఁ ఽ జెలఁగువెల్గు। నిఖిలజీవులయందును ఽ నెగడువెల్గు। అఖిలమునకును బరమునై ఽ యలరువెల్గు। చెలఁగి యావెల్గు నిట్టనిఽ చెప్పుటకును। గమలజునకైన శక్యంబు ఽ గానివెల్గు॥ ౧౮౩॥ క॥ వెలుఁగుచు మలుగక యెప్పుడు। వెలుఁగై భువనంబులెల్ల ఽ వెలిఁగించుటచే। వెలుఁగనునామము గల్గెను। వెలిలోపలఁ గలిగి వెలుఁగు ఽ వెలిగించుటచేన్॥ ౧౮౪॥ తే-గీ॥ వెలుఁగనంగను దీపంబు ఽ విధముసుండు। నంచుఁ గొందఱందురు నావె ఽ యజ్ఞులగుచు। నిఖిలమునకును గళలను ఽ నిచ్చి తాను।నిష్కళారూపమైయుండు ఽ నేమిగాక॥ ౧౮౫॥ క॥ ఎన్నెన్నియాఖ్యలొప్పుచు। నున్నను బరవస్తువునకె ఽ యూహింపఁడగున్। గన్నెవిపరీతభావము। లెన్నఁడుఁజేయంగఁదగదు ఽ యెవ్వరికైనన్॥ ౧౮౬॥ ఆ-వె॥ మానితముగ శ్రవణ ఽ మనననిధిధ్యాస। లను గురూపదేశ ఽ మునను బేర్మి। శాస్త్రదృష్టమనను ఽ సరవితో నాత్మని। శ్చయమువలన ముక్తి ఽ సంభవించు॥ ౧౮౭॥ చ॥ అరయఁ బరాత్మగానకను ఽ యాత్రలు తీర్థములెన్ని సల్పినన్। గుఱుతుగ నశ్వమేధములు ఽ కోటులొనర్చి యశంబుగాంచినన్ ఽ ధరగుడిగోపురంబులును ఽ దప్పక నూతులు నేర్పరించినన్।నిరతము నెల్లదానములు ఽ నిచ్చిన మోక్షము గాంచరాదిలన్॥ ౧౮౮॥ క॥ మనసీయులఁ బోకలకును। జనకుండఁగజేసినెమ్మి ఽ సద్గురుకరుణన్।దనుదనయందునఁగాంచిన। ఘనమతిమంతునకుసాటి ఽ గలరేజగతిన్॥౧౮౯॥ క॥ తమ కుసుమంబులు మూర్కొనఁ। దమఫలముల ననుభవింపఁగ ఽ దరులెఱుఁగనియా।క్రమమున నాపరమాత్ముఁడు। తమలోననె గల్గియుండిఽ తానెఱుఁగరొగిన్॥ ౧౯౦॥ ఆ-వె॥ సఖియ తనదునింట ఽ సకలపదార్థంబు। లుండ బిచ్చమెత్తు ఽ లోభికరణి। వెదుకనేల తమకుఽ వెలుపల లోపలఁ। గలిగియున్న యాత్మఁ ఽ గానలేక॥ ౧౯౧॥ క॥ ధరణీపతులకునై

నను । వరయోగులకైన భాగ్యఽ వంతులకైనన్ । బరమార్థమెఱుఁగు
కంటెను । బరికింపఁగనెక్కుడైన ఽ పదవియుగలదె॥ ౧౯౩॥ చ॥ చెడును
ధనంబురాజ్యమును ఽ చిత్రరథంబులు ఘోటకావళుల్ । చెడును గజం
బులొంటెలును ఽ సేనలుకోటలు పట్టణంబులున్ । జెడుదురు తల్లిదం
డ్రులును ఽ స్నేహితదార సుతాదిబంధువుల్ । చెడనిపదార్థమీశ్వరునిఽ
చింతనయొక్కటి సర్వకాలముల్॥ ౧౯౪॥ ఆ-వె॥ అఖిలమస్థిరంబుఽయర
యఁగ జన్మాది । గతుల దుఃఖములకుఁ ఽ గారణంబు।దైవభక్తి శాశ్వఽ
తంబునై జన్మాది । బంధసంకటములఁ ఽ బాపుఽగాన॥ ౧౯౫॥ ఉ॥ కూటికి
లేక కష్టములు ఽ కోటికివచ్చినఁ బత్నిపుత్రులున్ । గాటికి నేగినన్ గృహ
ముఽగాలిన సర్వము కొల్లబోయినన్ । నేటుగనెందునన్ దనకుఽనెవ్వరు
లేకయు నొంటిదైనఁదా । మాటికి దేహజాడ్యముల । గ్రుగ్గిన భక్తిని
నిల్పఁగాఁదగున్॥ ౧౯౬॥ ఆ-వె॥ నిరతమాత్మచింత నెఱవుచు సర్వంబు।
మిథ్యయంచుఁగాంచు ఽ మేటివేత్త। పాయఁగలఁడుమాయ ఽ పాశంబు
లెల్లను । బాముమేన్గుబుసముఁ ఽ బాయుభంగి॥ క॥ ఫణికేయెఱుకగుఁ
గాకయు । ఫణిపాదము లెఱుఁగరాదుఽ బ్రహ్మకునట్లే । తనుఁదానెఱు
గఁగలేఁడీ । తనువందునఁ దత్త్వవేత్తఽ దక్కఁగనొరుఁడున్॥ ౧౯౭॥
ఆ-వె॥ ఆత్మ నెఱుఁగువారె ఽ యనుభవజ్ఞులుకాని । యెఱుఁగకున్నఁ
గార ఽ దెవ్వరైనఁ। బ్రసవమైనసతికె ఽ ప్రసవాది విషయంబు । లనుభ
వములు వంధ్యఽ కనుభవంబె॥ ౧౯౮॥ చ॥ తెఱవజలంబు గ్రోలినను ఽ
దీఱునుగాక పిపాసమాఱునే । తఱచుగసర్పిద్రావినను ఽ దాహము
హెచ్చునుగాక యట్టులే । స్థిరపరతత్త్వచింతనము ఽ చేతను దీఱునుగాక
యన్యసం।స్మరణలనెంతమిన్నగలఽవైనను బాయునెమోహతృష్ణయున్॥
౧౯౯॥ ఆ-వె॥ తనున్నఁదానెఱుంగఁ ఽ దనవుతాఁగకుండుఁ । దనవుగా
నియప్పుడెఁ ఽ దలఁపులుడుగుఁ । దలఁపులుడిగినపుడె ఽ తన్మయత్వము
నొందుఁ । దన్మయతనుదానె ఽ దైవమగును॥ ౨౦౦॥ ఆ-వె॥ ఆత్మతత్త్వ
మార్గఽ మరయ కెవ్వారికిఁ । జిక్కవిడువదింత ఽ చిత్తశుద్ధి । గాదుజగ
తిఁగోటి ఽ కల్పంబులకునైనఁ । గడువరాదు జన్మకర్మములను॥ ౨౦౧॥
ఉ॥ నావుడుఁగల్గ వాత్మకును ఽ నారయజాగర నిద్రస్వప్నముల్ । జీవుఁడు
నీయవస్థలను ఽ జెందుచునుండు నహర్నిశంబులు । న్నేవిధమాత్మయందు
నను ఽ నిల్పఁగ నేర్చును జంచలుండునో । జీవుఁడు బ్రహ్మమెట్లగును ఽ
జెప్పి కృతార్థతఁజేయు మచ్యుతా॥ క॥ అశరీర విగతకల్పన । విశదాచల
తత్త్వవేత ఽ విద్యాతీతా । శిశుతాదిమస్థితేఃపర । పశుపతిసంస్తుత్యనామఽ

పరమలలామా॥ ౨౦౪॥

మాలి॥ జననమరణహీనా ఄ సాధు హృత్పద్మలీనా । మనన విబుధశీలా ఄ మాయసంహారలోలా । ఘనసదనయనూనా ఄ కాల కల్పాంతమానా । మునిజనహితపాత్రా ఄ మోక్ష లక్ష్మీకళత్రా॥

గద్య॥ ఇది పోలకం - లక్ష్మీనృసింహార్యపుత్ర, సాధుజనమిత్ర
నారసింహ నామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీ
సంవాదంబను - సుజ్ఞానశాస్త్రంబునందుఁ
తృతీయాశ్వాసము - సమాప్తము,



శ్రీసద్గురువేనమః,

# శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదంబను

# సుజ్ఞానశాస్త్రము.

## చతుర్థాశ్వాసము.



క॥ నిర్గుణతత్వనిరీహా త్రి । వర్గాది సమస్తదోష ఄ వర్జితభూషా। స్వర్గ సుఖనరకదుఃఖ వి । సర్గామృతపీతమాన ఄ సత్యవిధానా! ౧॥ వ॥ అవధరింపు మక్కేశవుం డక్కీరవాణి కిట్లనియె॥ ౨॥ ఉ॥ పావనమైన నీ విమల ఄ ప్రశ్నలకుం దగునుత్తరంబులుం । భావజవైరి దేవమునిఄపద్మ భవాదులు సెప్పనేర్తురే ఄ నీవును దొంటిజన్మమున ఄ నెట్టితపంబులు సేసి యుంటివో । గావున నిట్టిప్రశ్నములు ఄ గల్గెనునీమది కంబుజాననా॥ ౩॥ ఆ-వె॥ పశుఁతి జీవుఁడెట్లు ఄ బ్రహ్మంబయగునని ఄ యడిగితివిపుడువిను ఄ మదియుఁదెలియ । నెఱిఁగినట్టివారి ఄ కిది మహాసులభంబ । యెఱుఁగ కున్నఁగష్ట ఄ మెవరికైన॥ ౪॥ క॥ జీవుం డెట్టియవస్థల । నేవిధముననైన బ్రహ్మ ఄ మేమరక తగం।జీవభ్రాంతులనుడిగిన।జీవన్ముక్తుండునగును ఄ జీవుఁడు తరుణీ॥ ౫॥ ఆ-వె॥ నీరుపాలునందు ఄ నిజముగాఁజేర్చిన । క్షీర మగునుగాని ఄ నీరుగాదు । అట్టులాత్మయందు ఄ నాజీవిఁజేర్చిన । నాత్మ డగును జీవుఁ ఄ డరసిచూడ॥ ౬॥ క॥ క్షీరములఁ గలయు నీరే! క్షీరము లగు నీటఁగలపఄక్షీరములగు నే। తారక మొందిన జీవుఁడె । తారకమగు మాయఁగలియఁ ఄ దారకమానే॥ ౭॥ ఆ-వె॥ బ్రహ్మమందుజీవ ఄ భావం

బుఁగూర్చిన । బ్రహ్మమగును జీవ పదములేక । యగ్నియందుఁగాష్ఠ
మమరంగఁగూర్చిన । దారులేక వెల్గు దహనుమాడ్కి॥౮॥ క॥ ప్రవిమల
తారకమందున । సవినయముగ మాన సంబు సంధించినచోఁ । బ్రవి
నాశమొందు నామది । లవణము జలమందుఁజేరి లయమొందుగతిన్॥
౯॥ తే-గీ॥ వివిధ పుష్పంబులంటి జీ వించు నళియుఁ । జంపక ప్రసవ
ముఁదాఁకి చచ్చినట్టు । లఖిల వృత్తులఁజరియించునట్టిమనము । నాశ
మొందును బ్రహ్మంబు నంటినపుడె॥ ౧౦॥ క॥ వరసూనృతాత్ముఁడై
నను । మఱిశాంతుండైన నీతి మార్గుండైనన్ । బరతత్వసంగిగాకయె ।
సరగున విడదింద్రియముల చలనంబెపుడున్ ॥ ౧౧॥ ఆ-వె॥ హరినిఁ
గన్నయపుడె యఖిలమృగంబులు । పొదలనడఁగి కదిలి మెదలనట్లు ।
తారకంబునెపుడు దర్శించునప్పుడే । యడఁగియుండు నింద్రియములు
మనము॥ ౧౨॥ క॥ సరసీ జాప్తుఁడు గ్రుంకెడు । తఱి నూరకయుండు
విహగతతిగతిమనమున్ పరమాత్మయందు గ్రుంకినఁ । గరమరుదుగ
నింద్రియములు గదలకయుండున్॥ ౧౩॥ ఆ-వె॥ వరుసఁదనకురాజు
వశుఁడై ననుర్వినే । జనులు తన్ను నొంపఁ జాలనట్లు । నాత్మ తనకు
వశము నైయున్న నింద్రియ । చలనమేమిసేయఁ జాలుఁదన్ను॥౧౪॥
క॥ నిరతంబు జీవుఁ డిరవుఁగ । బరమాత్మను గలసిమెలసి పామరతను
వున్ । మఱచినఁదానే తానగు। మఱియదె జీవేశ్వరైక్య మనఁగఁజె
ల్లంగున్॥ ౧౫॥ తే-గీ॥ అట్టి జీవేశ్వరైకంబె యరసిచూడ । మానితం
బగు మాన స మాధియనియు మంత్రగోప్యంబునదె తిరు మంత్ర
మనియు । నెంచుచుందురు బుధజను లంచితముగ॥ ౧౬॥ చ॥ పరిపరి
వేదశాస్త్రములు భ్రాంతికి మూలమటంచు రోసియున్ ।దురితపుఁ గర్మ
మార్గములు దుఃఖ కరంబులటంచు నెంచియున్ । బరువడి హంసమం
త్రమున భావముగూర్చిన పావనుండగున్ । బరుసముసోఁకి లోహము
వె బట్టుగఁగాంచనమైన యట్లుగన్॥ సీ॥ గుళ్లుగోపురమాది కూపత
టాకముల్ బహుసత్రవనములే ర్పఱచువారు । నఖిలదానంబులు
నాచరించెడువారు । చెలఁగి సఖంబులఁ జేయువారు।సత్యవ్రతంబుచే
గతి భాసిలువారు - తీర్థయాత్రలకెల్లఁ దిరుగువారు నష్టాంగ
యోగంబు లభ్యసించెడువారు పంచముద్రలలోనఁ గాంచువారు ।
సకలవేదాదిశాస్త్రముల్ చదువువారు । స్నానసంధ్యాద్ధి తపములు స
ల్పువారు । నజపసూత్రంబుఁజెందిన యట్టిఘనుల । పాదరజమును
బోలరు పద్మగంధి॥ ౧౭॥ క॥ రేచక పూరక కుంభక । సూచనలేన

ట్టివాఁడ ఽ చూతుఁడమాయే । సూచనగల్గినవారలు । చూచెడునాచూ
పులోనె ఽ చూచెదరాత్మన్॥ ౧౯॥ ఆ-వె॥ చూపులెల్లఁజూచి ఽ చూపు
లోఁ బ్రభమఁజెందుఁ। జూపులెల్ల భ్రమను ఽ జొరగఁజేయుఁ । జూపునేకమైన ఽ
నాత్మంబు గనుపించు। నాత్మయందుఁ జేర ఽ జూపునిల్చు॥ ౨౦॥ క॥ చూపును
రూపునుగుణముల । వ్యాపారముచేతఁ గల్గెఁ వర్ణింపఁగన్ । జూపునురూపున
కవ్వల । నాపోజ్యోతియన వెలుఁగు ఽ నదితారకమా॥ ౨౧॥ తే-గీ॥ సతి
యకారం బనఁగ రజ ఽ స్సదియె బ్రహ్మ । యగు నుకారంబనఁగఁ సత్వ ఽ
మదియె విష్ణు । వగు మకారంబనఁగఁ దమం ఽ బదిశివుండు దలఁపనిం
దెద్ది యనుగాదు ఽ తారకంబు॥ ౨౨॥ క॥ బిసరుహాలోచన వినుమిఁకఁ।
బసమీఱఁగఁ దత్పదంబె ఽ పరమాత్మ యగున్ । బొసఁగుసు జీవుఁడు
త్వంపద । మసిపదమున వీనిరెంటికైక్యంబరయన్॥ ౨౩॥ క॥ క్షరమున
జీవుండగు న । క్షరమునఁ బరమాత్మ యగును । సతియట్టి క్షరా।క్షర
ములుగూడిన నదియే । పరమార్థమనంగఁ బరఁగు ఽ బంకజనయనా॥
౨౪॥ ఆ-వె॥ నాదమంచుఁ బల్కు ఽ నదియె యోంకారంబు। బిందువనఁగ
జీవుఁ ఽ డిందువదన । నాదబిందు రెండు ఽ నమరంగఁగూడినఁ । గళయ
నంగనొప్పుఁ ఽ గమలగంధి॥ ౨౫॥ క॥ సత్తనఁగా బరమాత్ముఁడు। చిత్త
నఁగా దెలియవలయు ఽ జీవుఁడనుచున్ । సత్తును జిత్తును రెండును ।
హత్తుగ నేకీభవింప ఽ నానందమగున్॥ ౨౬॥ ఆ-వె॥ వ్యక్తమనఁగ
నాత్మ ఽ వరుస నవ్యక్తము జీవుఁడనఁగ నెగడు ఽ సిద్ధము గను । నాత్మ
యనిన విద్య ఽ యగు నవిద్యను జీవుఁ। డంచుఁ గాంచవలయు ఽ నంచి
తముగ॥ ౨౭॥ క॥ గిరినింగోత్రము నగమను । కరణిని భాండమునుగలశ ఽ
ఘటమనునట్లే । పరమాత్మ జీవులకు న । త్తెఱఁగునఁ బరినామములను ఽ
దెలియు మొకటిగన్॥ ౨౮॥ క॥ అనవుడు నన్యము లేకయుఁ। దనుఁదానై
నిండియుండఁ ఽ దగ బరమాత్ముఁ । డనియును జీవుండనియును । నను
టేమికతంబోయనిన ఽ హరి యిట్లనియెన్॥ ౨౯॥ ఆ-వె॥ ఆత్మయందు
జీవుఁ ఽ డారోపితంబగు । నెన్నినిజము జీవుఁ ఽ డెందుఁగలుగు । నరయ
రజ్జువందు ఽ నారోపితంబగు ఽ పాముభ్రాంతి నిల్వఁ ఽ బడునెచూడ॥
౩౦॥ క॥ తనఁ దాను గాంచినప్పుడె । మనుజీవ వికారభావ ఽ ములు
సర్వంబున్ । దనలోలేక నశించును । గనుఁగొన జీవుండుమగుడఁ ఽ
గల్గునె తలఁపన్॥ ౩౧॥ క॥ తనమోము ముకురమందునఁ । గనుఁగొన
వేఱొక్కరూపు ఽ గాఁదోఁచుగతిన్ । దనువను నద్దములోపలఁ । గను
పడు పరమాత్మ రెండు ఽ గతులగునట్టుల్॥ ౩౨॥ ఆ-వె॥ దర్పణంబు

దీయఁ దనప్రతిబింబంబు । పోయి వదనమందె పొందినట్లు । తనువు
దొలఁగిచూడఁ దత్ప్రతిబింబంబు । లేకయుండు నాత్మ నేకమగుచు॥
౩౩॥ సీ॥ దర్పణమందునఁ దనమోముబింబింప-మోము తాననిజూచి
ముదముఁజెందు । నానానంబువిధము నద్దంబులోఁ దోఁచు - మోము
నిక్కంబైన మోముఁ గనునె । కనులద్దమునుజూచుఁ గాని యాయ
ద్దంబు - కనులనుజూచుట గలదెయెందు । నిలదర్పణము లేక నేత్ర
యుగమె నిల - సురుచరాననమును జూడఁగలదె। యక్షియుగముచేఁ
దనమోము నరయుటకును । వద్ద మొకసాధనంబునై యమరుచుండు
గతినిఁ బరమాత్మ తన్నుఁదాఁ గాంచుటకును । జీవుఁడొకసాధనంబునై
చెలఁగుచుండు॥ ౩౪॥ క॥ మనమే పరమాత్మనుగను । ననినను మనమె
ట్లుగాంచు నదిజడమరయన్ । దనుఁదానె మనమనెడు సా । ధనమునఁ
బరమాత్మయె తనుఁ దాఁగాంచునోగిన్॥ ౩౫॥ క॥ తరుణీ ఘటమే దే
హము । తిరముగనందుండుజలమె తెల్వితలంపన్ ।బరమాత్మకుఁ బ్రతి
బింబమె । పరికింపఁగ జీవుఁడగును బాలేందుముఖీ॥ ౩౬॥ క॥ క్షితిజల
ఘటమున రవికిని । బ్రతిబింబంబున్న యట్లు భాసిలుచుండున్ । సతియా
ఘటము దొలంగినఁ । బ్రతిబింబం బేదియింక భానుఁడెగాకన్॥ ౩౭॥
తే-గీ॥ జ్ఞప్తికాయంబులనుజల కలశములను । బ్రతిఫలించెను బర
మాత్మ భానుపగిదిఁ । దెలివి దేహంబులనుమాయఁ । దీసిచూడఁ ।
దనకుఁ బ్రతిబింబ మున్నదే తానుగాక॥ ౩౮॥ క॥ గురు తెలుఁగ లేక
రజ్జును । బొరిబొరిఫణి యంచుభీతిఁ బొందినయట్లే।పరమాత్మయంచుఁ
దెలియక । మఱిజీవభ్రాంతిఁబొందె మానవుఁడకటా॥ ౩౯॥ క॥ ఇదివట్టి
త్రాడటంచును । బదపడిఁ గనుఁగొన్నవాఁడు పామనియనునే । యిది
పరమాత్మయటంచును । మదిఁదెలిసిన జీవుఁడన్నమాట వెడలునే॥ ౪౦॥
ఆ-వె॥ ఆత్మయందు జీవుఁ డను భ్రాంతిఁ బొందియుఁ । దిరిగిదాని నిజ
ముఁదెలసెనేని । యాత్మయంచు నిశ్చయంబగునాతండు । జీవుఁడంచు
భ్రాంతిఁ జెందఁడెవుడు॥ ౪౧॥ చ॥ ఇనుఁడు నభంబునుండునని యేడె
నిక్కమెఱింగి భ్రాంతిచేఁ । గనఁడిఁకఁదోయకుంభమునఁ గన్పడుబింబ
మెసత్యమట్లుగా । ఘన పరమాత్మ తత్వమును గాంచినపిమ్మటబ్రహ్మ
వేత్తలున్ ।దనువున జీవబింబమును దథ్యమటంచుఁ దలంచరెప్పుడున్
౪౨॥ క॥ పరమాత్ముఁడె నిజబింబము । పరమాత్ముని యందుఁదోఁచు
ప్రతిబింబంబున్నరయఁగ జీవుఁడె దబ్బర।పరమాత్మనుగనిన జీవ భావ
మువాయున్॥ ౪౩॥ ఆ-వె॥ మున్నురజ్జుగాంచి పన్నగంబనుభీతిఁ । జెంది

పిదప దానిఁ ¦ జేరిజూచి। త్రాడటంచుఁజేత ¦ ధరియించు వానికిఁ। బాము
గలచునందు ¦ భయముగలదె॥ ౮౪॥ ఉ॥ నాకుఁ బరంబుగా నెగడునట్టి
విధంబు వచించు తత్వమున్। నాకును వేఱుగాదనుచు ¦ నారయ నేనెద
లంచిచూడఁగా। నీకనుపించు దేహమిది ¦ యిల్లనిజంబగు నాత్మయేన
యే లోకసమస్తజీవతతి ¦ లోనఁబరాత్ముఁడనై వెలుంగుదున్॥౮౫॥ క॥
ననునెఱుఁగక యజ్ఞానులు। తనుగుణములు నన్నుఁగాఁగ ¦ దలఁతురు
ధరలో। నను నిశ్చయముగ నెఱిఁగినఁ। దనుగుణమును నేనుగాను ¦
దథ్యంబబలా॥ ౮౬॥ చ॥ సరగున నొక్క సద్గృహిణి ¦ చాలక యేలెను
నష్టభార్యలన్। దిరముగ నష్టభార్యలతొ ¦ తృప్తినిఁబొందక కామవారి
ధిన్। జొరఁబడి గోపికాసతుల ¦ షోడశవేలను గూడెనంచునన్। బరిప
రిరీతులిట్లుగను ¦ బల్కుదురల్పులు నంబుజాననా॥ ౮౭॥ క॥ గురుకరుణ
వడసినప్పుడె। గుఱుతుగ దేహాదిజీవ ¦ గుణముల నెల్లన్। దొఱఁగితి
సర్వముగానని। పరమాత్ముఁడనైతి నాకు ¦ భ్రాంతియుఁగలదే॥౮౮॥ సీ॥
స్త్రీలోలుఁడని నన్నుఁ ¦ జెనఁటులనుటగాని-యెవ్వరు నాజాడ ¦ నెఱుఁ
గలేరు। దేహమేలేని వి ¦ దేహినై యుండంగ - నింద్రియంబులు నాకు¦
నెట్లుగల్గు। గామాదికంబులు ¦ గణుతింపఁగానేవి। కలనిద్రజాగరం ¦
బులును నేవి। సుఖదుఃఖములు నేవి ¦ క్షుత్పిపాసలు నేవి। స్త్రీపుంసరూ
పాది ¦ స్థితులు నేవి। త్రిగుణ రహితుండనగుచును ¦ దినము రాత్రి। నితర
సంకల్పములులేక ¦ యేకరీతి। సోహమను పల్కుఁ బల్కుచు ¦ సుస్థిర
ముగ।నుందు నేనెట్లు సతులను ¦ బొందినాఁడ॥ ౮౯॥ క॥ అంగంబు గలు
గువానికె। సంగమ క్రియలాది ధరణి ¦ సంభవమౌఁగా। కంగంబె లేని
వానికి। నంగనలను గవయుటెట్లు ¦ లమరును నాకున్॥ ౯౦॥ క॥ తరు
ణులఁగూడితినందురు। పురుషులు మొదలైన సకల ¦ భూతగణంబుల్।
మఱిఁగూడిమెలఁగుచుండిన। పరుఁడగునన్నెఱుఁగలేని ¦ పామరులెల్లన్॥
ఆ-వె॥ కులములేనివాఁడ ¦ గుణములే దొకచోట। నునికిలేదయెందు ¦
నొంటివాఁడఁ। జుట్టమొకరులేరు ¦ శూన్యుండఁదుద మొదల్। లేనివాఁడఁ
గాంత ¦ లెవరు నాకు॥ ౯౨॥ క॥ సతిఃతులుగూడునది యొక।మితమేసక
లంబునేర ¦ మించుచునుండన్। రతియనఁగ నొక్క శాస్త్రమె।సతియేన
స్ఖలిత బ్రహ్మ ¦ చారిని నగుదున్॥ ౯౩॥ క॥ తలఁపగమూత్రపురీషం।
బులువిడిచినకరణి సతుల ¦ భోగక్రియలం।దలరగ శుక్లమువడలినఁ।గలు
గునె యద్దానబంధ ¦ కము వేత్తలకున్॥ ౯౪॥ ఆ-వె॥ ఒక్కచోటెనాకు¦
నొక్కదేశంబెనా। కొక్కకాలమగునె ¦ యుండుటకును। నిలను నాకు

నునెల ॥ విడియనవచ్చునే । నిండియుండు నెందు ఽ నేనుగాదె॥ ౫౫॥ క॥
నేనే భూతములైదును । నేనే మూర్త్రిత్రయంబు ఽ నిఖిలజగంబుల్ । నేనె
నరసిద్ధదైత్యులు । నేనే దిక్పాలసురలు । నినశశితారల్ ఽ ౫౬॥ క॥ గరు
డోరగ కిన్నర కిం । పురుషాసుర సాధ్యయక్ష ఽ భోగులువిద్యా।ధరగం
ధర్వులునాదిగ । నిరవుగ నేనౌదు నీవు ఽ నేనేతలఁపన్॥ ౫౭॥ తే-గీ॥
నిర్జరేంద్రుఁడు మునులును ఽ నీరధులును । బర్వతారణ్య మృగపశు ఽ
పక్షితరులు । నండపిండాండబ్రహ్మాండఽమాదియగుచు । నిఖిలమైయేను
వెలుఁగుదు ఽ నీరజాక్షి॥ ౫౮॥ క॥ నేనేస్త్రీపురుషులునై । గానఁబడఁగ
నన్ను నేనుఽగవయుటయెట్లో । నేనయొనర్పఁకదోఁచిన । యానిఖిలము
బొంకు స్వప్నఽమం దనుభవమె॥ ౫౯॥ తే-గీ॥ పడఁతివిను పుష్పముల
సౌరఽభంబుభాతి । సర్వరూపులనేనుండ ఽ సర్వమగుచుఁ । గుసుమము
నుగాక పరిమళం ఽ బెసఁగునట్లు । సర్వమునుగాక యింతకే ఽ సాక్షిన
గుదు॥ ౬౦॥ సీ॥ నావుడు వసుదేవు ఽ నకు దేవకికి నీవు జనియించిపు
ట్టలే ఽ దనుటయెట్లు । దాసాసుతాదులు ఽ తల్లిదండ్రులుగల్గి - నాకు
నెవ్వరులేర ఽ నంగనెట్లు । ద్వారకాపురి కధి ఽ కారినై యొకచోట ఽ
నునికి నాకునులేదు ఽ యనుటయెట్లు ఽ సతులతోఁ గవియుచు సకలకా
ర్యంబులఁ - జేసిచేయనటంచుఁ ఽ జెప్పుటెట్టు॥ తే-గీ॥ లయ్యయో మేను
ప్రత్యక్షఽ మగుచునుండ । నాకు దేహంబెలేదని ఽ నాఁగనెట్లు। దెలియ
నిది నాకుగొప్ప సంఽదేహ మొదను । బెనయుచున్నది దీర్పవే-వనజనాభ॥
౬౧॥ సీ॥ అని రుక్మిణిఁజూచి ఽ యచ్యుతుఁ డిట్లను - చెలియ నీకది
మున్నె - చెప్పినాఁడఁ । గనుపించుచున్న యీ ఽ కాయంబు నేఁగాను -
దేహనాటకుఁడ వి ఽ దేహినంచు । వసుదేవుఁడును మాయఽవనిత దేవ
కిమాయ - వారికేబుట్టిన ఽ వార్తమాయ । బలరామసాత్యకుల్ ఽ పరి
కింపఁగామాయ - యష్టభార్యలు గోపి ఽ కాళిమాయ॥ తే-గీ॥ యేది
పుట్టుచున్నదో ఽ యేదిగిట్టు । నదియెపో మాయ నేనెప్పుఽడదియుఁగాను।
బుట్టుకయులేదు నాకును ఽ గిట్టులేదు । పావనంబగు తారక బ్రహ్మ
మేను॥ ౬౨॥ క॥ తనువులుగల్గని నాకును । జననీజనకులును సుతులు
సతులెక్కడనో । గనుఁగొనఁ బరిపూర్ణుఁడు నా । కును నెలవును నెందు
గలుగుఁ ఽ గోమలిచూడన్॥ ౬౩॥ ఆ-వె॥ ఏనుబుట్టుటయునుఽనింపొంద
ద్వారకా । పురమునుంట సతులఁ ఽ బొందుటయును । సకలకార్యము
లును ఽ సల్పుటకలగాని । నిజముగాదొకటియు ఽ నేనెఱుంగ॥ ౬౪॥ ఉ॥
ఏనుదశావతారములఽ నెత్తితినంచుఁ దలంచుమానవుల్ । గానరు నన్ను

నెంతయును ఽ గల్పితమైన మదీయమాయచే । గాని వధింపదుష్టులను ఽ గావఁగ శిష్టులమాయఁబుట్టునే । గాని దలంప నాకెపుడుఁ ఽ గల్గదు జన్మము కర్మనాశము॥ ౧౬॥ ఆ-వె॥ నిఖిలభూతసమిత్రి ఽ సేరమించుటఁ జేసి । నాకు రామ యనెడు ఽ నామములరెఁ । గాక దశరథునకుఁ ఽ గల్గు వాఁడనె నిరా । కారుఁడగుదు నేను ఽ గలుగుదెపుడు॥ ౧౭॥ క॥ పన్నుగ నాదశరథునకు । మున్నును నేలేక యతని ఽ పుత్త్రుఁడెకర్త । యున్న దశరథుని విశ్వముఁ గ్రన్నన గల్పించునట్టికర్తయెపండో॥ ౧౮॥ ఆ-వె॥ పౌలస్త్రి దశరథునకుఁ ఽ బుట్టిన రాముఁడే । కారణంబటన్నఁ ఽ గల్గుఁ దప్పు । గాన నేను నంతకంటె మున్నెయుండి । గలుగఁజేసినాఁడఁగాదె జగము॥ ౧౯॥ క॥ పరమాత్ముఁడ నాయందున । నరయఁగా నేదు దోష ఽ మఖిలంబు మనః । పరికల్పితమగునదియే । పరికింపఁగ లేనిమాయ ఽ భామామణిరో॥ ౨౦॥ క. సకలంబు నేనెయగుచును । సకలంబునుగాక సర్వ ఽ సాక్షినగుదు నాకోకచోటనుండఁగల్గునె । వికలంబది సర్వమ యుండ ఽ వీక్షింపఁగనే॥ ౨౧॥ సీ॥ అతలమానరికాళ్ళ ఽ వితలంబుమీఁ గాళ్ళు - సుతలంబుమడిమలో ఽ సుందరాంగి । దలఁపఁబిక్కలుతలా ఽ తలముజానులురసా-తల మూరువులుమహా ఽ తలము నరయు । జోకపాతాళ జాలలోకముల్ గుదము నె-క్కొనభువర్లోకంబు ఽ గుహ్యపదము । పొసఁగను వర్లోకఽమును నాభియగు మహ-ర్లోకంబు హృదయంబు ఽ లోలనేత్ర॥ తే-గీ॥ సరిజనర్లోకముగళంబు ఽ సత్యముగను । మఱి తపోలోకమెన్న భ్రూమధ్య మందు । సత్యలోకంబుఫాలంబు ఽ సద్వరాట్పు । రుషుఁడనైనట్టినాకునో ఽ దక్షగాత్రి॥ ౨౨॥ సీ॥ నానాగ్రమున నింద్ర ఽ నగరంబు దక్షిణ ఽ నేత్ర మందమున నగ్ని ఽ హోత్రపురము । కడకర్ణమున నంత ఽ కునిపట్టణం బును - నెసఁగునాగ్రక్కనై ఽ ర్నృతిపురంబుఁ । దెలియ వెన్నువరుణ ఽ దేవుని నగరంబు - పదుసదానికిఁ బ్రక్క ఽ వాయుపురము । నుత్తరకర్ణంబు ఽ నొప్పుకుబేరుని ఽ పురి వామనేత్రంబు ఽ భోగిపురము॥ తే-గీ॥ శిరమున ముమను వైకుంఠ ఽ పురమునుండు । నరయఁగా మేరుగిరినాకు ఽ నగు సుషుమ్న । మందరాద్రియుఁ బింగళ ఽ నుదిదలంప । నిడయుఁగైలాసన గమగు ఽ నిందువదన॥ ౨౩॥ సీ॥ మస్తకాంతర్గతంబగును జంబూద్వీప - మరయఁబ్లక్షద్వీప ఽ మస్థులందు । మొనయుశాఖద్వీప ఽ మును శిరా గ్రంబున ఽ శాల్మలీద్వీపంబు ఽ చర్మమునను । బుష్కరద్వీపంబు ఽ పొల్చ నంఖబుల ఽ కుశద్వీపంబు ఽ మాంసమందుఁ । బొసఁగఁ గ్రౌంచ ద్వీప ఽ మును కేశములయందు - లవణాంబుధియు మూత్ర ఽ మవును

నిక్షు । నీరధియు షర్కసురవార్ధి ౸ నింద్రియంబు । జలఁపఘృతవార్ధిఱ
ధిరంబు ౸ దధిసముద్ర । మరయశ్లేష్మంబయగును క్షీ ౸ రాబ్ధిసాఖ్య ।
నిర్మలోదకోదధియుఁగ౸గన్నిరునాకు॥ క॥ ధరణియుఁబాదములగుచును ।
మఱియంబరతలమువెన్న ౸ మస్తకమగుచున్ । గిఱులునుశల్యములు
నదులు । పరికింపఁగ నాడులగుచు ౸ భాసిలునాకున్॥ ౭౩॥ తే-గీ॥ ఇన
శశాంకులు నాకు న ౸ యనయుగంబు । పవనమును శ్వాసనిశ్వాస ౸
లవుచు వెలుఁగు । నాదుగర్భంబులోపల ౸ నఖిలజీవ । పుంజములుపుట్టు
లయమొందుఁ ౸ బొలఁతియనిన॥ ౭౪॥ క॥ నీలోనజగము లెప్పుడు ౸ నీలా
గేయుండఁగలవొ ౸ లెఱిఁగింపుమింకే । కాలమునకైనఁ జెడునో। యేలాగ
దియన్న శౌరి ౸ యిట్లనుసతికిన్॥ ౭౫॥ ఆ-వె॥ సుందరాంగినీదు౸ సూక్ష్మ
బుద్ధికినాదు । మానసంబుహర్ష ౸ మయ్యెనిపుడు । లాలితముగ వినుము౸
కాలప్రమాణంబుఁ । దెలియపఱతునీకుఁ ౸ దేఁటపడఁగ॥ ౭౬॥ క॥ చనఁగ

కాలప్రమాణ లక్షణము.

నహోరాత్రంబులు దినమగు । మర్త్యులకునదియె ౸ దివసలయంబా ।
దినములు ముప్పదిమాసం । బనఁబడునదె శుక్లకృష్ణ౸ పక్షద్వయమున్॥
౭౭॥ సీ॥ మానవాళికినొక్క ౸ మాసమైనను బిత్రు౸ దేవతాళికి నొక్క౸
దినమునగును ॥ వసుధమనుజులకొక్క । వత్సరంబైనను ౸ దివిజులకది
యొక్క ౸ దివసమగును । తత్క్రమంబున దేవ ౸ తాహాయనంబులు -
వెలయంగఁ దదిరెండు ౸ వేలునైనఁ । దనరఁగృతత్రేత ౸ ద్వాపరికలి
చతు । ర్యుగములువిను మహా ౸ యుగమనంగ॥ తే-గీ॥ నొప్పనవియును
డెబ్బది ౸ యొక్కటైన । రమణియది యొక్కమన్వంత ౸ రంబునగును।
నట్టిమన్వంతరములు పదు౸నాలుగైన । బ్రహ్మకది యొక్కపగలునై ౸పరఁ
గుచుండు॥ ౭౮॥ సీ॥ తగనొప్పనది చతు ౸ ర్యుగసహస్రము మేర-నగు
దివసావసా ౸ నంబునందు । బ్రహ్మయు నిద్రించు౸బగటికాలంబెంత-
యంతకాలము రాత్రి ౸ యరుగునపుడు । సకలజీవాదులు ౸ సమయునం
తటఁ బంచ ౸ భూతముల్మాత్రము ౸ పొలియకుండు । నారాత్రిగడిచిన౸
నలువ తామేల్కొని జీవకోటులమగుడి ౸ సృష్టిసేయు॥ తే-గీ॥ ధాతకది
యొక్కదినమగుఁ ౸ దలఁచిచూడ । నట్టిదినమాసక్రమమున ౸ నరయ
నూఱు । వత్సరంబులు గడచిన ౸ వనజగర్భుఁడంత నాశంబుఁజెందునో౸
యంబుజాక్షి॥ ౭౯॥ సీ॥ చెలువుగా విను బ్రహ్మ ౸ జీవితకాలంబు - మఱి
విష్ణువునకొక్క ౸ మాసమగును । నవి పదిరెండైన ౸ నగువత్సరంబును-
నవియు శతంబైన ౸ హరియడంగుఁ । బరికింపనావిష్ణు ౸ ప్రళయంబులో

పల ǂ నజు లనేకులుపుట్టి ǂ యడఁగిపోదు । నా విష్ణుజీవిత ǂ మగుకాల మును రుద్రు-నకు నొక్క దినమగు ǂ నట్టిదివస॥ ఆ-వె॥ మాస సరణి తోడ ǂ మఱిశతాబ్దంబులు । నిండెనేనిశివుఁడు ǂ నిల్వునతని । ప్రళయము నకులోన ǂ బహుమందివిష్ణులు । పుట్టిగిట్టుదురుగ ǂ పుణ్యచరిత॥ ౮౧॥ సీ॥ అరయంగ రుద్రుని ǂ యాయువ్యమంతయు - నొగమహేశ్వరునకు ǂ నొక్కయామ । మట్టిజాములెనిమి ǂ దైన దినంబొక్కటగునది మాస క్రమాదికముల । వత్సరంబులు నూఱు ǂ వరుసగాఁ గడచిన-నమ్మహేశ్వరుఁడును ǂ నాశమొందు । నవని ప్రళయములోన ǂ నంబుబహురుద్రులు - వొడమినశింతురు ǂ పుడమియందు॥ తే-గీ॥ నమ్మహేశ్వరుఁడు మనిన ǂ యంతకాల । గతి సదాశివునకు రెండు ǂ గడియలగును। నదియె యొక్కముహూర్తంబు ǂ నంగబరఁగు । ననియు ముప్పదియైనను ǂ నగుదినంబు॥ ౮౨॥ సీ॥ కలయనా దినమాస । క్రమమున నూఱేండ్లు ǂ చెల్లిన నాసదాశివుఁడుగిట్టు । నతని ప్రళయములో ǂ నరయు ననేకమ - హేశ్వరుల్ పుట్టి ǂ లయింతురెలమి । నాసదాశివుఁడుండు ǂ నట్టికాలంబెల్ల ǂ నొగి విరాట్పురుషున ǂ కొక్కక్షణము । నగునట్టి క్షణములు ǂ నరయంగ మున్నూట - యఱువదైనను నొక్క ǂ హోయనమగును॥ తే-గీ॥ నట్టి దిన మాస క్రమమున ǂ హాయనములు । నూఱు గడచిన నవ్విరా ǂ ట్పూరుషుండు । చనును నాతనిజీవితǂమునకులోనఁ ǂ బుట్టి బహుసదాశివులును ǂ గిట్టఁగలరు॥ ౮౩॥ చ॥ మెలఁతసమస్త జీవులను ǂ మృత్యువుపట్టి వధించునప్పుడే । జలజహితాది చంద్రులును ǂ సంతుయమాదుర మాయశక్తిచేఁ । బొలుపుగ గోత్రబీజములు ǂ భూజలతాది సమస్తరూపముల్ । ప్రళయదవాగ్నిఁబుట్టి యటు ǂ భస్మముఁ జేయునొకింత మాత్రలోన॥ ౮౪॥ తే-గీ॥ సప్తవాయువులొకపెట్టఁ ǂ జవిరివిసరు । నభ్రనవకంబు నోలి ది ǂ వ్యాబ్దశతము । ఘోరవర్షంబు జడిపట్టి ǂ కురియునపల । వారిధులు నేడు నేకార్ణ ǂ వంబయగును॥ ౮౫॥ వ॥ అట్టియెడ॥ సీ॥ అమ్మహావారాశి ǂ యడఁగుఁ బృథ్వియదిక - జలములస్వల్పలో ǂ ష్టంబు పగిది । నమ్మహోదకమును ǂ నగ్నిపానము సేయుఁ - దప్తలోహము నిరు ǂ ద్రావుభంగి । నమ్మహావహ్నిని ǂ ననిలంబు దెగటార్చు ǂ గాలిదీపంబార్చుǂకరణిగాను । నమ్మహావాయువుǂ నాకాశమునమ్రగ్గు - నాసుషుప్తిని జీవు ǂ లడఁగునట్లు॥ తే-గీ॥ లమ్మహానింగినమ్మాయ ǂ యందడించు । నమ్మహామాయ నాయందు ǂ నడఁగునపుడు । బట్టబయులగు నా స్వరూ ǂ పంబునిలిచి । యుండు నెయ్యెడఁ

బరికింప నొందులేక॥౮౭॥ ఆ-వె॥ అఖిలమూర్తివర్గమడఁగిన నేనుండు నిర్మలుండ నగుచు నేనునిట్టి। ప్రళయ కల్పములును బహుళంబులైనను। నేనుజెడనుభామి నీలలామ॥౮౮॥ క॥ మాయే జగములు యుగములు। మాయేకల్పములు ప్రళయ మాటలునెల్లన్। మాయాతీతుఁడ నేనే। మాయల నెఱుఁగకయ యుందు మదగజగమనా॥౮౯॥ క॥ పాయక మృత్తికకుంభము। గానౌచదుచు మంటియందుఁ గలియుని యట్లే। నాయందు మాయపుట్టియు। నాయందునఁగలియుచుండు నంబుజవదనా॥౯౦॥ ఆ-వె॥ యఖిలవిశ్వసృష్టి మఱి రూటులగునన్న। నిద్రనుండిమేల్కొ నేగుదెంచు। కొలఁదినేనెఱుఁగ కుండంగ నాయందె। గలిగిమాయజగము గలుగఁజేయు॥౯౧॥ ఉ॥ స్థావర జంగమ ప్రకర సంభవనాశములందు నుందునేఁ। గావున మూఢులెవ్వరును గానఁగఁజాలరు మత్స్వరూపమున్। భావనమూర్తులున్ విమల భావవిచారులు జన్మభారముల్। ద్రోవఁగలేకనన్నని ము ముక్తపదంబునుగందురెంతయున్॥ క॥ నేనీ దేహేంద్రియములు। గానని సుజ్ఞానమునను గాంచెద రార్యుల్। మానిని దేహేంద్రియములె। నేననిజ్ఞానంబు లేమి నెంతురమూఢుల్॥౯౨॥ సీ॥ నీరుచలించిన నీటిలోఁ బ్రతిబింబ - మైననింగియుఁ గదలు మాడ్కిఁదోఁచుఁ। బరఁగ నదిని నోడ పరుగిడనది పొంతఁ - జెట్లు గదలుచున్న చాట్లుదోఁచుఁ। బరువడిమేఘంబుపరువెత్తనభమునఁ - జంద్రుండుపరువెత్తు చాడ్పుదోఁచు। నట్లుపుట్టుట పెర్గు టఖిల కార్యంబులు - నాచరించుట మఱి - నాశమౌట॥ తే-గీ॥ లాదికల్పనలెల్ల దే హాంబునొంద। నాత్మయే సర్వమునుబొందునట్లు దోఁచుఁ। గాని పరికించిచూడఁగఁ గానఁబడదు। రమణియాత్మకు నేవిశా రంబునెపుడు॥౯౩॥ ఆ-వె॥ చూపుచెదరినపుడు చూడవస్తువొకటె। రెండుగాఁదోఁచు చుండునట్లు। మానసంబు చలనమైనవానికిలేని కల్పనమ్మునిజము। గానుదోఁచు॥౯౪॥ సీ॥ అల్లిబిల్లిగఁదిర్గు నట్టివానికినిండ్లు - దిశలు భూమియుఁ జెట్లు దిరిగినట్లు। గనుపించునటు దిరు గనివారికెద్దియుఁ - దిరుగకున్నట్లుగాఁ దెలియుభంగి। నజ్ఞాని చంచలం బగు మానసముగల - వాఁడు గావున భ్రాంతి వలనఁదనకు। సంభవ వృద్ధినా శంబులు సకలంబు - సత్యమైతోఁచుట సహజగుణము॥ తే-గీ॥ జ్ఞాని సుస్థిరచిత్తుండు గాన నతఁడు। నెపుడుపరమాత్మ తత్వమే నిశ్చయముగ। నెంచి భ్రమ రూపమైగాను పించుమాయ। కల్లగానెంచి తన్నుఁదాఁ గాంచుచుండు॥౯౫॥ శరీరూపంబు

నదారువు। గురుతరముగఁ దోఁచుచున్నఁ గుంజరముగనే। పరమాత్ము
డిలగఁ దోఁచిన। బరమాత్ముఁడెగాక నిప్రపంచంబగునే॥౯౭॥ తే-గీ॥
గజమనుచుఁజూడ దారువు గానఁబడదు। దారువని చూడఁదోఁచదు
దంతియట్లు। జగమనుచుఁజూడఁ దోఁచదు సర్వసాక్షి। సాక్షియని
చూడఁ గల్పితజగము లేదు॥ క॥ పరసతివేషముఁదాల్చిన। పురుషుఁడు
పురుషుండెగాని పొలఁతుకయగునే। మఱి జీవరూపుఁదాల్చిన పరమా
త్ముఁడు జీవుఁడగునొ పరికింపంగన్॥౯౮॥ తే-గీ॥ మాయయీదేహమని
యెంచి మాయగాని। యాత్మయే కాను పరమాత్ముఁ డంచుఁగాంచు।
నతఁడుముగ్గురు మూర్తుల కాదియైన। దేవుఁడని లోకమునఁ బ్రస్తు
తింపఁబడును॥౯౯॥ క॥ కల్లనిజమంచు నిజమును। గల్లందునఁ గలిగి
యుండుఁ గావున నిజముల్। గల్లందు వెదకి యాత్మను। నుల్లంబునఁ
గూర్చికల్ల యుడుపఁగవలయున్॥౧౦౦॥ ఆ-వె॥ కాననీకు నేను గజ
పినయట్లుగాఁ। గాంచవలయునట్లు గాకయున్న। ఘనతమీఁజనిన్నుఁ
గడతేర్చుటకునింక। నెవరితరముగాదు నిక్కముబలు॥౧౦౧॥ క॥ నీవే
యాపరమాత్మవు। జీవుఁడ నేనంచు భ్రాంతిఁ జెందకుమింకనా। జీవ
గుణంబులుమాయవె। నీవెన్నఁడు మాయగావు నిక్కంబిదియున్॥
౧౦౨॥ ఆ-వె॥ మాయ నీవుగావు మానసేంద్రియములు। గావు నీవు నె
ఱుక గావు మఱువు। నెఱుకమఱపు లేక యేవేళ వెలుఁగొందు। సర్వ
సాక్షివీవు సారసాక్షి॥౧౦౩॥ తే-గీ॥ కాయజీవంబులేనంచుఁ గలను
నైనఁ। దలఁచుబోకుము పరమాత్మ తత్వమీవు। స్త్రీనపుంసక పురు
షాది స్థితులుగావు। రూపనామంబులును లేవు రూపసికి॥౧౦౪॥ క॥
ఇంద్రియములె నేనన నా। యింద్రియములటంచు నీవు నెన్నుటకు।
నీకున్నింద్రియముల్వేఱగుటను। నింద్రియములు నీకుగావు హేమలతాంగీ॥
౧౦౫॥ క॥ మనమే నే ననినను నా। మనమని నీవనుట వలన మానిని
మనమా। యనిలపు భాగంబగుటను। మన మరయఁగ నీవు గావు
మంజులవాణీ॥౧౦౬॥ ఆ-వె॥ బుద్ధి నేననంగఁ బొలుపొంద నీవునా।
బుద్ధియనుట గతన బుద్ధి యగ్ని। భాగమగుట వలన భావించి
చూడంగ। బుద్ధి నీవుగావు పువ్వుఁబోణి॥౧౦౭॥ ఆ-వె॥ చిత్తమే
నటంచుఁ జెప్పిన నీవు నాచిత్తమనుట వలనఁ। జిత్తముదక। భాగ
మగుటఁజేసి పరికింపఁ జిత్తంబు। నీవుగావు భామి నీలలామ॥౧౦౮॥
క॥ అహమే నేనన్నను నా। యహమని నీవనుట వలన వనితగంబై।
యహమలరుచుండుఁగావున। నహమెన్నడు గావు నీవు హంసవిహారీ॥

౧౦౯॥ ఆ-వె॥ నిఖిలమెఱుఁగు తెలివి ఽ నే నవినను నీవు । నాదు తెల్వి యంచు ఽ ననుట వలనఁ । దెలివి నీవుగావు ఽ దెలియంగ సర్వంబుఁ । దెలియు తెల్విఁగాంచు ఽ తెలివినీవు॥ ౧౧౦॥ క॥ దేహేంద్రియములు నేనని । మోహముఁ జెందంగఁబోకు ఽ మున్నుగ నీలో । దేహినిఁ గనుఁగొను మెప్పుడు । సోహంబని పల్కు నజపఽసూత్రమెనీవ్వు॥ ౧౧౧॥ ఉ॥ నా రమణీయ గేహమది ఽ నా ధనమంచు వచించు వానికిన్ ఽ వేఱగుచుండు నట్టిగృహఽవిత్తము లట్టుగ నాశరీరము । న్నా రయఁగ నాదు నింద్రియము ఽ లంచు వచించెడు నీవ్వునింతకున్ । వేఱగుచుందుగాక మఱి ఽ వీనిలో నెద్దియు గావు చూడఁగన్॥ సీ॥ కొందఱు పామరుల్ ఽ గురుముఖంబున నిట్టి - పరమహంస మహిమ ఽ నరయలేక । యది ప్రాణవాయువ ఽ యందురు పరమాత్మ .. వర్ణింపఁగాఁ బ్రాణ ఽ వాయు వగునె। పరగ గుదమున న ఽ పాన సమీరంబు । నాభియందున సమా ఽ నానిలంబు । దలపఁ గంఠమున ను ఽ దానవాయువుసర్వ మేనున వ్యానస ఽ మీరమెన్న । వరుస హృదయంబునను బ్రాణఽవాయువుండుఁ । బవలు రాత్రియు యంత్రంబు ఽ పగిదినిరు । గుండెలోఁ డక్కుటక్కు నఁఽగొట్టుకొనుచు । నదియె బ్రహ్మంబు నానెట్టుఽలనఁగవచ్చు॥ ౧౧౩॥ సీ॥ నరవి నన్నమయకో ఽ శంబె యాత్మయటంచు నందురు కొందఱేఽయవనిలోన నరగఁ బ్రాణమయకో ఽ శంబెయాత్మయటంచు నందురు కొందఱే ఽ యవనిలోన । మానితంబుగ మనో ఽ మయకోశ మాత్మయం-చందురు కొందఱే ఽ యవనిలోన । మగువరో విజ్ఞాన ఽ మయకోశ మాత్మయం-చందురు కొందఱే యవనిలోన । ఓ ఱియు నానంద మయకోశఽమాత్మయంచుఁ । గొందఱనియెదరీపంచ ఽ కోశములకుఁ । దలఁపఁ ద్రిగుణంబులగు నవఽస్థాత్రయంబు।నకువిలక్షణుఁడగు నాత్మఽనరయలేక॥ ౧౧౪॥ చ॥ కలయఁగ నెల్ల వారుతమఽకై వడిమోక్షముఁజెందునట్లుగాఁ। దలపున నెంచి యార్యులిల ఽ దైవరహస్యము సాటిచెప్పినన్ । దెలియఁగ లేరు మాయలను ఽ దేలిమునుంగుచునుందు రెప్పుడున్ । జలరుహ నేత్రలోకమునఽ సత్యముఁ జెప్పిన నమ్మ రెవ్వరున్॥ ౧౧౫॥ ఆ-వె॥ మాయ మార్గములను ఽ మనసుంతురందఱు । నిజమునందు మనసు ఽ నిల్పలేరు । చర్మఖంఠ మెసవు ఽ సారమేయంబును । నిక్షుఁగోలరుచిని ఽ నెఱుఁగనట్లు॥ ౧౧౬॥ క॥ అలసాదుగులను బిడుదులు । పాలనుగ్రోలకయ రక్తఽపాన మొనర్చున్ । అలీల జనులమోక్షము । కీలెఱుఁగక సేతురెల్ల ఽ క్రియలనుమాయన్॥ ౧౧౭॥ తే-గీ॥ అమల వాక్యంబులను లక్ష్య ఽ మమరి

యుండు । ఛిద్రవాక్యంబులను గుఱిఁ జెడపఁగాదు । జనులు సద్బోధలను
విన జనునుగాని । చెనఁటిబోధలు నెప్పుడు వినఁగ రాదు ॥ ౧౧౮ ॥
చ॥ అరయుసము స్వభూతమయుఁడైన పరాత్పరుఁ డందుఁ దృప్తుఁడౌ । పరమ
పవిత్రుఁ డెన్నఁడుఁగు పామరమార్గములందుఁ జొచ్చునే । హరిఁబోరి కల్ప
భూజనిజ వృష్పమరందము నానిగ్రోలుచుఁ । బరువడి తృప్తినొందు
మధుపంబులు వోవునె వేపచెట్లకు ॥ ౧౧౯ ॥ క॥ వసధి దరిఁజేరఁజను
నెడఁ । బెనుగాలియు విసరి నావఁ బెడ కీడ్చుగతిన్ । మునుముక్తిపుణ్యా
హీనులు । గనఁబోయినం దొలఁగ నీడ్చుఁ గర్మచయంబుల్ ॥ ౧౨౦ ॥
ఆ-వె॥ పరముఁ గనుచుఁ జిత్త పరిపక్వమును గాక । నరుఁ డెవండ యైన
నంతలోనె । చచ్చి వేని మఱుఁడి జన్మంబు నందైన । బుధులం జేరి ముక్తిఁ
బొందఁగలఁడు ॥ ౧౨౧ ॥ క॥ పరతత్త్వచింత లేకయు । చరియించెడు మూఢుఁ
డెన్ని జన్మలకైనన్ । దరిఁజేరలేఁడు గావునఁ । బరమార్థమె మాన్పు
నందు భవరోగంబుల్ ॥ ౧౨౨ ॥ సీ॥ నిన్ను నీ వెఱుఁగక యింతకు నిల
మాయ - నెన్నెన్నొ జన్మంబు లెత్తుచుంటి । విపుడు నాకృపచేత
నెఱిఁగితి నిను నీవు - నీ నిజరూపమై నెగడుకతన । నేను ఖదుఃఖంబు లెఱుఁ
గవు పుణ్యంబు - నెఱుఁగవు పాపంబు నెఱుఁగ వీవు । నెపుడు జాగ్రత్స్వప్న
నిద్ర లెఱుఁగవు - రేయిపవలును నొక్క రీతి యగుచు బంధ మోక్షంబులును
లేక పరఁగునీకు । బంధమున్నట్లు దోఁచుట భ్రాంతిచేత । ముక్తిఁగోరియు
నిను నీవు మూలమెఱుఁగ । బంధ మోక్షంబు లెల్లన బద్ధమయ్యె ॥
౧౨౩ ॥ ఆ-వె॥ పుడమిలోన నేను బుట్టితిఁ బెరిగితిఁ । జత్తునంచు మదిని
శంకపడుచు । నేను నాది నీవు నీది నీవారు నావారలంచు భ్రమయ
వాఁడె పుట్టు ॥ ౧౨౪ ॥ క॥ సుమతి మనోజ వికారము । లమరంగా నీకుఁ
గల్గ వాత్మ వగుటచేఁ । గమలారి కళల వృద్ధులు । కమలాప్తున కెన్నఁడేనిఁ
గల్గునె తలఁపన్ ॥ ౧౨౫ ॥ క॥ తరుణికిఁ దిమిరం బెన్నఁడుఁ । బొరయని
గతి మాయ లేమి పొందవు నిన్నున్ । బరమాత్మ వగుటచేతను । బరికిం
పఁక లేవు నీవు బంధవిముక్తుల్ ॥ ౧౨౬ ॥ క॥ దరిఁగొని మండెడు నగ
మునఁ । బరువడి నిలువంగఁగలవె పక్షిమృగతతుల్ । పరమాత్ముఁ డైన
నిన్నును । బొరయంగా లేవు పాపపుణ్యము లెపుడున్ ॥ క॥ అల మాన
సేంద్రియంబులు । చలియించుచు నుండుఁగాన నాకేమనెనే । చలియిం
చితివని దలఁచకు । చలనంబును లేదు సర్వసాక్షివి నీవున్ ॥ ౧౨౭ ॥
తే-గీ॥ ఇంద్రియములెల్ల నచలమై యెసఁగువేళ । నచలమైతిని నేనంచు
నరయఁబోకు । చలన మచల మాదింద్రియచర్య లెల్లఁ । దగుల నేరవు

నిర్గుణ తత్వమిదియ్యు ॥౧౩౧॥ క॥ నిలుకడగల్గిన నీరును । జలనపు నెమ్మనమునకును సంగము లేద । ట్టులఁ గానశంక నుడుగుము । యలరఁగ నిస్సంగివై యఖిలమునందున్ ॥ ఆ-వె॥ అనిన దేవివలన నఖిల ప్రపంచంబు । దోఁచు నేదిలేక దోఁచకుండు । నిశ్చయముగదీని నెఱిఁగింపుమన్న నా [illegible] కిట్టులనియె మాధవుఁడు॥ ౧౩౨॥ సీ॥ వనిత

మిథ్యా జగల్లక్షణము.

జాగర మెంత వఱకుండు నంతకుఁ-గలయుసమస్తంబు గల్గిదోఁచు। లమ్మనంబున విద్య యుండడంగిన వేళఁ - బరఁగ నెద్దియుఁ దోఁచ బడక యుండు । తూర్పున భానుండు తోఁచినతోడ నే-కిరణంబులును తోఁచు నరసిచూడ । నతఁడ స్తమించిన నాతని కిరణంబు-లతనితోడనె పోవు నట్లుగాన । నిను నీ వేయుంచుఁ గిరణంబు [illegible] లెంచినట్లు । మనము గలిగిన గలుగును మాయ యెల్ల మన । ము లేకున్న నిఁక నేమి మాయ లేదు। గాన సర్వంబు మానసికంబె జగము॥ ౧౩౩॥ క॥ నెఱిమానసీక విశ్వము। స్థిరమని పలువలను బాయ కెనఁటినదుండున్ । ఏ పసమరీచుక జలముని। పదువిడి యిలఁగూల మృగము పసిది నశించున్॥ ౧౩౪॥ ఆ-వె॥ అనిన మనముగలిగియమనస్కమెటుగాక । మనము లేక యెటుగునో మర్మమిదియు । నానతిమ్మటన్న నప్పద్మనాభుఁడా । యిందు వదనఁజూచి యిట్టులనియె॥ ౧౩౫. క॥ ఓ వనితామణి మధురము । నీవచనము లెల్లఁ బాగు నేర్పునకరయన్ । నీ వెట్లు నేర్చియుంటివో । నీ విధమున నడుగ నెవరు నేస్తరు సఖియా॥ ౧౩౬॥ సీ॥ పొందు గాను సమాధి యొందుమన మది జేర్చ-టమనస్కమని కొందరందు [illegible] తత్సమాధిని జూలించఁగానె యామానసేంద్రియములు-మరలఁగల్గుఁ। గాననదియమనస్కముగాదు భావింప - నాసుషుప్తివిధంబు నలరుచుండు । నిద్రఁ జెందిన వేళ నిఖిలంబు లేకుండు - నిద్ర మేల్కన్ననునిఖిలముండు । నట్లుగావున నిద్రయు నాసమాధి । మూర్ఛ లీమూడు నొక్కటె మూటినుండి । తెలసియామది సర్వంబుఁ దెలియుఁగాన । నాసమాధిని నమనస్క మనగ రాదు ౧౩౭॥ క॥ కొందఱుజీవముతోడనె। బొందితో భువిచాటునకును బోదురది యెటు [illegible] । పొందున జీవ సమాధిగ । నందురదియుఁ గాడ్సైన నమనస్కంబున్॥ ౧౩౮॥ సీ॥ పడఁతిరో యమనస్క పద్ధతిఁ దెలియంగ-నెఱిగింతు వినుమింక నేర్పుతోడ। స్థాణు తస్కరుఁ డంచుఁ దాభ్రమసి పిదపఁ-దెలిసి కొయ్యని శంక దీఱినట్లు । పరమాత్మ యందున భ్రాంతిచే జీవుని-నారోపితముఁ జేసి నరుడు గురుని । కరుణచే దారు వు పురుషుండు

గానట్లు । పరమాత్మ జీవుఁడన్ ॥ భ్రాంతిఁబోఁజేసి । యలరు మానస
దేహేంద్రి ॥ యంబులెల్ల । లేసి చెప్పఁడు నాయుండు ॥ లేదు మాయ ।
నిర్వికారాఖండుఁ బరమాత్మ ॥ నేనటంచు । భ్రాంతివీడిన సమనస్క ॥ భా
వమయ్యె॥ ౧౩౮॥ క॥ మనమే నీవును నేనును । మనమే కార్యంబులెల్ల ॥
మనమే జగముల్ । మనమే మాయలు సర్వము । మనమును లేకున్న
లేదు ॥ మఱియొక్కటియున్॥ ౧౩౯॥ ఆ-వె॥ బంధమోక్షములకు ॥
భ్రాంతులకెల్లను । కారణంబు మనము ॥ గాకనదియె । బంధమునను
జుట్టు ॥ పడియుండఁగా జాలు । సులభముగను ముక్తి ॥ దెలియఁజాలు॥
౧౪౦॥ క॥ మన మింద్రజాలుఁ డగుదగు । మనమే కల్పించు మాయ ॥
మనమేగాంచున్ । మనమే భ్రమయుచునుండును । మనమే గనుపించ
కెందు ॥ మఱుమాయమగున్॥ ౧౪౧॥ ఆ-వె॥ మనము నెపుడు లేని ॥
మాయ యటంచును । దానుదాని యగుచుఁ ॥ దలఁపుతోడ । నఖిల
మెఱుఁగుచున్న ॥ నతఁ డమనస్కుఁడు । గాని మనములేక।గాదుచూడె॥
౧౪౨॥ క॥ సర్వముఁ జూచుచు విడువక । సర్వంబగు కార్యములను ॥
సల్పుచునున్నన్ । సర్వముఁగనిచేయనిగతిఁ । బర్విన నమనస్కమనఁగ ॥
బడునది కాంతా॥ ౧౪౩॥ ఆ-వె॥ వెలఁది వినుము యొక్క ॥ వృత్తాంత
మును నిప్డు । దండువలన సంశ ॥ యములు వాయు । దీనిచేత నాత్మ ॥
తృప్తియగానమనస్క । భావమెల్లఁ దెలియుఁ ॥ బడును నీకు॥౧౪౪॥ భారత
యుద్ధాదివి రథ । సారథి నేనైతి సవ్య ॥ సాచికి నపుడున్। ఘోరమగు
శంకగల్గియుఁ । బోరికి నొప్పకయు యుతనిని ॥ బుద్ధిచలింపన్॥౧౪౫॥ఆ-వె॥
అపుడు నేను దెలిసి ॥ యుద్ధమ యిద్దేమి॥ యీవు నిజము నింతె ॥ యెఱుఁ
గలేక । భ్రాంతిఁజెంది యిట్లు ॥ భ్రమరుక్కై పడిఁ । దగ విషాదమొందఁ ॥
దగునీకుఁ ।౧౪౬॥ ఉ॥ నేనే సమస్తజీవులును నేనీవును నీయిరువైపు సైన్య
ముల్ । నేఁగుచుండ భండనము ॥ నేను నీ సర్వఁగనంటి విప్పుడున్। నేన
లయింపఁ జేయక యె ॥ నీకును వీరలఁజంపశక్యమే ॥ నేనెహరింతు సైన్య
ములు ॥ నీవును నింతకుఁ గారణంబిలన్॥ ౧౪౭॥ తే-గీ॥ జీవలోకంబు
లెల్లను ॥ సృష్టిసేయఁ । బోషణము సేయ సర్వంబుఁ ॥ బొలియఁజేయ ।
నేనయైయుండ కారణం ॥ బితరముగను । గలుగఁజేతు నాదుమహిమఁ ॥
దెలియ వశమె॥ ౧౪౮॥ క॥ పరమాత్ముఁడనగు నన్నిక । నెఱిఁగిన సర్వం
బునందు ॥ నేనేగాకన్॥ । బరికింపని తెరమున్నదె । పరువడినను గాంచి
నీదు ॥ భ్రాంతివిడుమిఁకన్॥ ౧౪౯॥ తే-గీ॥ నన్ను నెంచి ముక్తులా ॥
నాద్యులెల్ల । భ్రమసి నీవలె నీరీతి ॥ భ్రాంతిపడరు । నిఖిల రూపులు

నేనంచు నెంచికర్త । కర్మక్రియ లనుజిక్కరే కాలమునను॥ ౧౫౦॥ క॥ నేనే చేసెద ననుచును । మానసమున నెంచుటెల్ల మఱియదియు హామే । గాని యింక నేమి సేయుదు । నేనును నీలోన లేక యింద్ర తనూజా॥ ౧౫౧॥ ఆ-వె॥ అరయ లేక నన్ను నజ్ఞానులెల్లను । నహము తోడఁ గర్మ నాచరించి । గాదె నరకస్వర్గ కష్టసుఖంబులు। ననుభవించుటెల్ల నవనిఁబుట్టి॥ ౧౫౨॥ క॥ ఉన్నది నేనే యెందున । నన్నెఱిఁగిన నింక నేది నాకన్యముగ । న్నన్నియు నేనేగావున। నన్నెఱింగిన వారికెందు నహముం గలదే॥ ౧౫౩॥ ఆ-వె॥ తలఁపఁ బదునెనిమిదక్షౌహిణీలగు । సంఖ్యనొప్పు రెండు సైన్యములను । నేను లేక యున్న నెవ్వఁడాడించును । నాటకుండ నేను నఖిలమునకు॥ ౧౫౪॥ క॥ నేనును లేని శరీరము । మానక నీ సేనలందు మఱియున్న యెడన్ । గానంగఁ జేయుమిప్పుడు । నేనును లేకున్న దేహి యీయిలయందున్॥ ఆ-వె॥ దేహికత్తులకును దెగఁడు వాశంబులఁ। గట్టువడఁడు వహ్నిఁ గాలిపోఁడు । రాళ్లఁబగులఁడెందు నీళ్ల చేతఁ దడియఁ । డట్టివానిఁ జంప నలవె నీకు॥ ౧౫౫॥ క॥ ఇలశిథిలంబగు చేలం । బులు వదలియు। గ్రొత్తవస్త్రములు దాల్చిన యట్టుల దేహి చెడిన దేహం । బులు విడి నూతన శరీరములను వహించున్॥ ౧౫౬॥ ఆ-వె॥ మఱియుఁ గాల సమయమైన జీవులకు నేఁ । గారణమున సమయఁ గలుగునట్టి కారణంబు చేతఁ గతమగు నంతియే । గాక నీవు సేయు కార్యమెద్ది॥ ౧౫౭॥ క॥ దేహియుఁ జచ్చునటంచును । మోహంబును జెందువాఁడె మూఢుండవనిన్ । దేహంబులెల్లఁ దెగినను । దేహినగు నేను జెడను దేనను నైనన్॥ ౧౫౮॥ ఆ-వె॥ సర్వరూపములును నమసిన నేనుందు । నాకుఁ గల్గదెపుడు నాశమరయ। ఘట జలంబులందు గగనంబు గనుపించి । ఘటములు బగుల నిల్చు గగనమట్లు॥ ౧౬౦॥ ఉ॥ పుట్టుట వృద్ధినాశములు పొందుట డిందుట మేనికైన చోఁ । బుట్టును గిట్టు దేహికని పోల్తురు లోకమునందు మానవుల్। పుట్టిన వేళ మోదమును బొందుచుఁ జచ్చిన వేళ నేడ్తురా। పుట్టును గిట్టు నేకమని బుద్ధిఁదలంచని కారణంబునన్॥ ౧౬౧॥ ఆ-వె॥ పుట్టి పెరిగి మఱలఁ బోవున దెల్లను । మాయ యంచు నీదు మది నెఱింగి। నిక్కమైన నన్ను నెఱుఁగ నీవును లేవు । రూఢి నేనే యొక్కరుండనైతి॥ ఉ॥ చచ్చుటె నిత్యమంచు మఱి జన్మ మనిత్యమటంచుఁ గాన కే। చచ్చిన వారిఁ జూచి యిఁకఁ జావఁగఁ బోమెడువార లందఱున్। జచ్చుట లేని పోలికలు జావున కేడుదు చావకుందురే । యచ్చుగ వీరలందరును

నంచుఁబొకాపక నవ్వుఁగాలుఁడుఁ॥ ౧౬౩॥ తే-గీ॥ గరిమ సంయోగతద్వి
యోగ ʃ గములఁగూర్చి । పండితులు మోద ఖేదముల్ ʃ పడయ రెపుడు।
వానికై యువెవచ్చును ʃ వానికవియె । పోవు సర్వంబు దీనికై ʃ పొగడ
నేల॥ ౧౬౪॥ క॥ ఆయువు మూడినవారలె । నీయెదుర౯ నిలిచిపోరి ʃ
నీల్గుదురరయ । న్నాయువుగల్గినవారల । నీయధికారమునఁ జంతకే నేస్త
వె విజయా॥ ౧౬౫॥ ఆ-వె॥ కర్మవశముచేతఁ ʃ గల్గును దనువులు।కర్మ
వశముచేతఁ ʃ గల్గువృద్ధి । కర్మవశతగిట్టు ʃ గాక జీవులఁజంప । నగునె
నొరులు కార । ణంబులేక॥ ౧౬౬॥ క॥ వినుపార్థయిదియధర్మమె।యుని
సేయుటరాజధర్మ ʃ మగునట్లుగా । కననీవుముక్కుపట్టుక । వనమున
గూర్చుండుమునివె ʃ వలదనఁబోకు౯॥ ౧౬౭॥ ఆ-వె॥ యుద్ధమిపుడునీవు ʃ
నొనరింపకున్నను । మొనసియిపుడుకాల ʃ మున నశించు । జనములెల్ల
నిపుడు । చావక మానదు । గనుము పేరుసిదిʃగాఁగఁబరఁగు॥ ౧౬౮॥ క॥
తనుఁదాఁ గనియేఁ జేసెద । ననునహము౯ విడిచిజగము ʃ నంతయు
నంతం । బొనరించినఁ బద్దోషము । నను జిక్కండాత్మవేత్తʃ యహము
గలుగమి౯॥ ౧౬౯॥ ఆ-వె॥ అహమువిడకయట్టిʃలజ్ఞానిచేసిన । నతఁడు
నఘమునొందు ʃ నదియు నెట్టు । లనినదివ్వొలేనిʃ యతఁడు నంధంబునఁ ।
బడును గ్రాఁడు ʃ వాయు దమము॥ ౧౭౦॥ క॥ అజ్ఞానముఁ బోనడఁ
చియు । సుజ్ఞానము చేతనీవు । సుస్థిరతరని౯ । బ్రజ్ఞాన్వితముగఁ జేయుము
సుజ్ఞానులు మెచ్చ లెమ్ము ʃ శూరతనిపుడు౯॥ ౧౭౧॥ ఆ-వె॥ అనుచు
నదునకేను ʃ నమనస్క భావంబు । నిచ్చి బవరమునకుఁ । జొచ్చునట్లు।
చేసినాఁడ నాత్మ ʃ సేవితునకుఁ బాప । పుణ్యవితతులెట్లుʃపొందనేర్చు॥
౧౭౨॥ క॥ అమనస్క యోగమనఁ గను । సమయించుటగాదు మనముʃ
సంగత వృత్తుల్ । క్రమమొప్ప లేని వనుచుచు । నమరంగాఁగాంచున
దియె ʃ యమనస్కమగు౯॥ ౧౭౩॥ ఆ-వె॥ ఎట్టివేళనైన ʃ నేదేశమున
నైన । నేమి సేయుచున్న ʃ నెట్టులున్న । నేను జేయువాఁడఁగాఁ నను
నమనస్క । భావమూన వలయు ʃ బ్రహ్మవేత్త॥ ౧౭౪॥ ఉ॥ నావుడుఁ
బంకజాక్షి యము ʃ నస్క ప్రభావము నింతియొప్పునే।నావినుతించితాను
నమ ʃ నస్కయునై యిటుఁబల్కె దేవనా । భావమునందు సందియముఁʃ
బాపుము తత్వ విదుండు మాయ యే । త్రోవను నంట కెప్పుడును ʃ
లోకుల యట్లె నటించు నాఁతడు౯॥ ౧౭౫॥ ఆ-వె॥ అనిన వాసుదేవుఁ ʃ
డా యింతిఁ గౌఁగిలిఁ । జేర్చి ప్రేమపొదలఁ ʃ జెక్కునొక్కి । ముద్దుపెట్టి
తనదు ʃ ముద్దియతోడను । ననియె నిట్టులనుచుʃ హర్షమొప్ప॥ ౧౭౬॥

కః నీ పుణ్యా ఫలము దెట్టిదో । నీపుణ్యా సుభాషణములు నీ సుగుణములు । నెన్నఁ బుణ్యులయొడఁ గానము । శ్రీపుణ్యాచరిత్రవినుము శ్రేష్ఠవిధంబున్॥ ౧౭౭॥ ఆ-వె॥ ఊరనుండనేల యుత్తమ వేత్తకుఁ । గుడుచు నేల ధనముఁ గూర్చునేల । సుతులు సతులునేల సంసారపదియేల । యడవిఁ గొండ లందు రజ్జులగుచు॥ ౧౭౮॥ ఉ॥ కోటి ధనంబు గూర్చినను గూటికిఁ జేరు దరిద్రుఁడైనచో । మేటి సుఖంబులొందినను మేనికి దగ్గఁ దలెన్ని వచ్చినన్ । కోటిగను బిడ్డలుండినను భోగముఁ గోరక యొంటినుండిన । వీటను గానంబునను వేత్తకున్న సమంబె మోక్షమున్॥ ౧౭౯॥ ఉ॥ అన్నము భుజియించినను నంబర భూషలనాది దాల్చినన్ । గన్నియతోడఁ గూడినను గన్నతనూజుల ముద్దునేసినన్ । జెన్నుగ బంధులాప్తులను జేరి నటించిన బ్రహ్మవేత్తలు । న్నన్నడు మాయఁ జెందరికఁ నేమియు నూనములేదు ముక్తికిన్॥ ౧౮౦॥ ఆ-వె॥ నీటియందెయుండి నీరజపత్రంబు నంటియుండ జలము నంటనట్టు । లాత్మవేత్తలకును । నఖిల సంసారంబు దగిలి యుండి మాయ దగుల దెపుడు॥ ౧౮౧॥ ఉ॥ గారడివాఁడు సర్వమును గల్లగ నెంచుచుఁ జేయువిద్యలన్ । గారడివిద్యమాయయని గంచుడు లోకులుదప్పిదంబునన్ దారక తత్త్వమాత్మఁగను ధన్యుఁడు రిత్తని సర్వకార్యముల్ నేడపుకోడఁ జేసినను నెల్లను జూచిన మాయఁ జెందునే॥ ౧౮౨॥ తే-గీ॥ సర్వపనులింట సల్పుచు జారకాంత ప్రియునిపొందుపైని మమతఁ బెనయునట్టు । నన్ని వ్యవహారములుఁ జేసి యాత్మమీఁద । దలఁపు మఱువక ప్రచరించుఁ దత్త్వవేత్త॥ ౧౮౩॥ క॥ బురదనునంటక కమ్మర । పురువును జరియించుచుండు పోలికనరయన్ । ధరవిజ్ఞానమయుండగు । పురుషుండిల మాయఁబొంది పొందం డెవ్వడున్॥ ౧౮౪॥ ఆ-వె॥ గాన నటనతాళ గతులతో దొమ్మరి । నెత్తి ఘటము దొంతి నిల్పినట్లు । సకల కార్యములును సల్పుచుఁ బరమాత్మ ॥ గు ప్తుపీడఁ జాత్మ గోవిదుండు॥ ౧౮౫॥ చ॥ పడువడి నాలమధ్యమునఁ బాల ఘటంబును బెట్టి దానినే । మఱకను గోవులం బిడుకుర మానవు లైవడి నాత్మవేత్తయున్ । సరగునఁ దన్నుఁ దాఁగనుచు సర్వము దబ్బరగాఁగఁ జూచుచున్ । నెరలుచుఁ జేయుచుండు గృహకృత్యములెల్లను నింపు మీఱఁగన్॥ ౧౮౬॥ ఆ-వె॥ ధనము నొక్కచోట దాఁచి తానెందున్నఁ । దానిమీఁద జ్ఞప్తి దగులుపగిది । నేమిసేయుచున్న నెందున్నఁ బరమాత్మ । మఱువకుండు వేత్త మానసమున॥ ౧౮౭॥ క॥ వదునిచ్చకముగఁ జూచుచుఁ । బరపురుషుని పొందుఁ జేయు

భామినివోలెఁ । మఱితనువు నిచ్చకముగాఁ । బరికింపుచుఁ బ్రహ్మవేత్త । పరమును గాంచుఁ॥ ౧౫౯॥ తే-గీ॥ రవియుఁ బీల్చి కల్మష । రసము లెల్ల । నట్టి కల్మష మేమితా । నంటనట్లు । లఖిలమౌ కష్టసుఖములు । ననుభవించి । దగులఁడా దోషమొద్దియుఁ దత్వవేత్త॥ క॥ ఇలమాయలు సర్వంబును । సలలితముగఁ జూచు నింద్ర । జాలము భంగిఁ । కలిమినిఁ । లేమినిఁ బొందియుఁ । గల విధమున నాత్మవేత్త । గాంచుచునుండుఁ॥ ౧౬౦॥ ఆ-వె॥ తనువు దాను గాక । తాను దానై యున్న । స్థిరుఁ మాయ । లేమి । సేయలేవు । చలన రహితమైన । శైలంబుఁ గదలింపఁ । గలదె చలనమైన । గాడ్పు రయఁగ॥ ౧౬౧॥ ఉ॥ క్షీరముఁ బేరియా పెరుగుఁ । జిల్కఁగఁ దేలిన నిగ్గు చల్లలో । గారవమొప్పఁ గల్వనను । గట్టిగ వేఱుగ నిల్చునట్లుగన్ । ధీరత నాత్మతత్వమును - దేహమునందునఁ దేల్చినట్టియా । ధీరుఁడు విశ్వ మాయలను । దేలి మునింగిన మాయఁ జెందునే॥ ౧౬౨॥ ఆ-వె॥ ముత్తమైన నీరు । ముత్తెంబుగా నుండుఁ । గాని జలమునందుఁ । గలియనట్టు । లాత్మయైన యాతఁ । డాత్మగా నుండును । గాని తిరిగి మాయఁ । గలియఁడెప్పుడు॥ ౧౬౩॥ క॥ క్షీరముఁ గలియు నుదకము । క్షీరము తే గాని జలము । చిక్కనె మఱలఁ । దారక తత్వమునందునఁ । జేరినయా ఘనుఁడు మగుడిఁ । జెందునె మాయన్॥ ౧౬౪॥ ఆ-వె॥ పావకుండు సర్వ । భక్షకుండయ్యును । గలుషిగాని భంగిఁ । గలుషమైనఁ । జేసి కలుషపదముఁ । జెందరు బ్రహ్మజ్ఞు । లగుటవలన నార్యు । లంబుజాక్షి॥ ౧౬౫॥ క॥ తనువుండి జ్ఞాని యెట్లగు । నను యునినను దగ్ధపటము । న్యాయము గాగన్ । గనుపడు చూచెడువారికిఁ । దనువే లేకుండు వేత్త । దనుఁడా నగుచున్॥ ౧౬౬॥ తే-గీ॥ తోడరిగారుడ మంత్ర సిద్ధుండు ఫణుల । నంటి గఱపించుకొనవిష । మంటనట్లు । మొనసి గురుమంత్ర సిద్ధుండు । మోహపాశ । ములను బొందియుఁ బొండఁడు । మోహనాంగి॥ ౧౬౭॥ చ॥ అరయ సమస్తభూషణము । లంగన బంగరటంచుఁ జక్కఁగా । నెఱిఁగిన నామరూపములు । నెప్పటియట్లుగ వచ్చు వచ్చినన్ । మఱితన పూర్వదృష్టికిని । మాఱుపు సెందని యట్లు వేత్తకున్ । బరిపరి రీతులన్ మెలఁగి । భంగము రాదిఁక నాత్మదృష్టికిన్॥ ౧౬౮॥ క॥ అవవిని దారాసుతులతో । నను వొందుచు నిట్టి మార్గ । మందియుఁ కడతే । జీనవారిఁ జెప్పమనఁ గాం । తను గనుఁగొని యిట్టులనియె । దామోదరుఁడున్॥ ౧౬౯॥ సీ॥ పతి జనకుఁడు రాజ్య । భారకుండయ్యును - జ్ఞానులలోనఁ బ్ర । ఖ్యాతిఁ గాంచె । ధరవసిష్ఠుఁడు పుత్ర । దారాది యుతుఁడయ్యె - నాత్మజ్ఞులందు

గణ్యాతను గాంచె । వరతులాధారుండు వాణిజ్య వృత్తిచే - నుండి వేత్తలలోన పండ ఁబడె । గటికవృత్తిని సల్పి యటుల ధర్మవ్యాధుఁ - డంతటి జ్ఞానిలేఁ డనఁగఁ బరఁగె॥ తే-గీ॥ గాన వేత్తలు ప్రారబ్ధ కర్మవశతఁ । గడఁగి యెటువంటి వ్యవహార కములునెట్లు। సల్పినను నేమి కొదువ మోక్షంబునకును । మఱియు మాశంబునకు మాత్ర మైనలేదు॥ క। అనవృను జన్మకుఁ బూర్వము । చనిపోయిన వెనుక లేదుజన్మ మొకరికి । న్నవి కొందఱందు రదియె।ట్లన మాధవుఁ డనియెనిట్టు లజ్ఞానసకుక్. ౨౦౦॥ సీ॥ సరసిజేక్షణ విను జన్మకుఁ బూర్వంబు - చచ్చిన పిమ్మట జనులకెల్ల । జన్మమే లేకున్న జనియించు వారెల్ల-నొక్క చందంబున నుండవలదె । మహినేలు రాజునై మంత్రియై భృత్యులై - ప్రజలునై యుండంగఁ బడుట యెట్లు। ధనవంతుఁ డొక్కఁడై దారిద్ర్యత నొకండు రోగియొక్కండునై భోగి యొక్కఁ॥ ఆ-వె॥ డగుచునొకఁడు సుఖము ననుభవించుట యెట్టు । లొకఁడు దుఃఖి యగుచు నుండుటెట్లు । గాన సర్వజీవ గణములు కర్మచేఁ । గలిగి కర్మ ఫలము గాంచుచుండ॥ ౨౦౨॥ క॥ మును జేయు కర్మఫలమని । తన యాపత్కాలమందుఁదలఁచును నరుఁడ।ట్లనెనెంతు రెల్లవారలు । మును వెన్కను గర్మజన్మ ములుఁ గల్గుటచేక్॥ ౨౦౩॥ ఆ-వె॥ మున్ను జన్మలేక యున్నను నిజన్మ । గలుగుటకును లేదు కారణంబు।పూర్వ కర్మఫలముఁ బొంద నీ జన్మయ్యె।నిపుడు గర్మపిదప నిచ్చుజన్మ॥ ౨౦౪॥ సీ॥ ముందు వెన్కను జన్మ ములు లేక యున్నచో-ననుభవం బిఁక లేక యుల్లెగాన । జీవ హింసయు నేమి సేయరా దన నేల - దబ్బరలాడరా దనఁగ నేల । జారచోరత్వముల్ సల్పరాదన నేల మద్యపానము దోష మనఁగ నేల । మాయవాదుల పొందు మానఁగా మన నేల - నాద్యుల సేవించు మనఁగ నేల॥ ఆ-వె॥ శాంతి దొంద నేల జనులు సత్కార్యముల్ । సేయ నేల దైవ చింత యేల।ధర్మవృత్తి యేల దలఁపంగ నివియెల్ల । జన్మమంటఁ జేసి సలుపవలసె॥ ౨౦౫॥ ఆ-వె॥ మగుడి జన్మలేని మాటసత్యంబన । సుజన దుర్జనులను జూడనొకటె। మంచిచెడ్డ లొకటె మఱి సనాతన ధర్మ । మెత్తి పోవును గద యిట్లనంగ॥ ౨౦౬॥ క॥ ఇలజన్మభయము చేఁగద । సలలితముగ నారిజనులు చాలా కష్టంబులునొంది పరముఁ గన్గొని । తొలఁగుదు రాకర్మజన్మ దుఃఖవిపత్తుల్॥ ౨౦౭॥ క॥ భవము మును వెనుక లేదను।నవివేకులు నిపుడు పుట్టుకటది యేల పురా । భవ ఫలము లేక యున్నను। భువి నేలక యుంద

అన్ని పోలికలేలా॥ ౨౦౭॥ ఆ-వె॥ కర్మజన్మగతులు క్రమముగాఁ జెక్కల। వలనఁ దెలియుటకును దెలివి లేక। నోట వచ్చినట్లు మాట లాడెడువార। నేక మంద గలదు లోకమందు। ౨౦౮॥ క॥ జ్ఞానికిఁ బాయు నుదను వ। జ్ఞానగతిక్ బేధమేమి సమ మిద్దఱక్। జ్ఞానియు ముక్తుం డగు న। జ్ఞానియుఁ గర్మాంకురమున జన్మము లొందుక్॥ ౨౧౦॥ ఆ-వె॥ అదియు నెట్టులనిన సమర వేల్చిన విత్తు। లెలను నెందునైన మొలవ నట్లు। విమలజ్ఞానవహ్ని వేల్చిన కర్మయుక్ విత్తు చచ్చుజన్మ వేత్త కేడి॥ ౨౧౧॥ క॥ ఏవిధ బాధలనైనను। నేవేళనునైన నలను నెచ్చట నైనక్। జీవన్ముక్తుఁడు కాఁడుముఁ। బోవిడిచిన ముక్తుఁడగును బూర్ణేందుముఖీ॥ ౨౧౨॥ ఆ-వె॥ దేహమెవ్వడు నరుఁడు దెలియంగవలె నది। గోరి తెలియకున్నఁ గొఱఁతగల్గ। దైనసీకు నిపుడు నామరణాంకముల్। కొన్ని దెలియ పఱతుఁ గొమ్మవినుము॥ ౨౧౩॥ క॥ ఏవస్తువు

## మరణచిహ్నములు.

తాఁజూచిన। నావస్తువు ఛిద్రముగను నగుపడుచున్న। స్త్రీవిస్వము నొకవింతై। భావంబునఁ దోఁపఁగల్గఁ బంచత్వంబుల్॥ ౨౧౪॥ సీ॥ తన దృష్టికిని నరుంధతి గనుపడకున్నఁ-దోయంబుల శిరము దోఁచకున్న। వీనుల నాదంబు వినఁబడ కుండిన-నడుగుల జాడ చూపడక యున్నఁ। దరణి బింబము మధ్య తెరపిగాఁదోఁచినఁ - జుక్కలునల్లగాఁజూడఁబడిన। గరము నిటలముంచఁ గా మణి బంధంబు-కనులకు మందమై గానఁబడిన॥ ఆ-వె॥ నర్కుఁడైనఁ జంద్రుఁడైనను విడువక। ననిశమొక్కరీతి నడిచిరేనిఁ। బనఁగ మృత్యుభయము ప్రాపించు నరులకు। వాని వాని కొలఁది వనజనాక్షీ॥ ౨౧౫॥ క॥ ఈకరణిని సుజ్ఞానముఁ। జేకొని నటియించు పరమ సిద్ధునకును నే। లోకమున సములు నధికులు। ప్రాకటముగ లేరు వెదకి పట్టిన నెందుక్॥ ౨౧౬॥ ఆ-వె॥ తరుణిదెలియఁ గల్గు ధర్మమర్మంబులు। దెలిపి తిప్పుడెల్లఁ జేటపడఁగఁ। గొఱత యేల యింక గొప్ప రహస్యంబు। మఱియుఁ గలుగు నచల మార్గమొకటి॥ ౨౧౭॥ క॥ మిన్నయగు సర్వమునకును। బన్నుగనా కేవలాత్మ భావపురయకే। యెన్నెన్ని నీవు దెలిసిన। నన్నియు వ్యర్థంబులగును నబ్జదళాక్షీ॥ ౨౧౮॥ ఆ-వె॥ అరయసాంఖ్యతార కామనస్కములకుఁ। జేరుగడయు నగుటఁ జేసిబుధులు। నచల భావమీయ రతివ దానికిఁ గ్రింది। భావములను దెలియ పఱతురెందు॥ ౨౧౯॥ చ॥ ధరఁ బరిపూర్ణ భావమును దప్పకపొందుటె యుత్తమోత్తమం। బరుదుగ సాంఖ్య

తారకము లాయమనస్కముఁ బొందమధ్యమం బరుదుగ ముద్రయోగములు పట్టుటయు న్నధమంబ యెంతయున్ । సరఁగునఁ బుణ్యపాపములు సల్పుటయు న్నధ మాధమంబగున్॥ ౨౨౦॥ ఆ-వె॥ సుదతి మున్ను నెఱ్ఱజూపి చేఁ పనుబట్టు । పగిదిముందు నెఱుక భావమెల్లఁ । గఱపినాఁ డనునట్టి యెఱుకచేఁ బరిపూర్ణ । భావమరసి యెఱుకఁ బాయవలయు॥ ౨౨౧॥ చ॥ అనవుడు నత్తలోదరియు నా దనుజాంతకు నా దయాంబుధిన్ । గనుఁగొనిపల్కెఁ దారకము గాంచితిమీ కృపచేత నిప్పుడున్ । వినఁదగు ధర్మమర్మములు వింటిని సంశయమెల్లఁదీఱెనా । మనవి వహించి యీయచల మార్గము దెల్పుమి జీవితేశ్వరా॥ ౨౨౨॥ క॥ కర్మాంధకార భాస్కర । దుర్మా మర్మావిభేద మానితబోధా । ధర్మాధర్మ విహీనా । నిర్మల సగుణ ప్రదేప నిర్గుణరూపా॥ ౨౨౩॥ మాలిని॥ చలనరహితగాత్రా సర్వభూతాత్మ సూత్రా । విలయనిలయ నాశా విశ్వ దీపప్రకాశా కలుష విగత సంగా కర్మసంతాప భంగా । సలలిత గుణహర్తా సర్వలోకేశ భర్తా॥ ౨౨౪॥

గద్య॥ ఇది హోలకం - లక్ష్మీనృసింహార్యపుత్ర, సాధుజనమిత్ర

నారసింహ నామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీ

సంవాదంబను - సుజ్ఞాన శాస్త్రంబునందుఁ

జతుర్థాశ్వాసము - సమాప్తము.



శ్రీసద్గురు వేనమః.

# శ్రీ కృష్ణ రుక్మిణీ సంవాదంబను

# సుజ్ఞాన శాస్త్రము



## పంచమాశ్వాసము.

క॥ పరిపూర్ణ కేవలాత్మా । పరహంస సమేత భూత పంచాతీతా పరమపద నిత్యమంగళ । పరతత్త్వాధీసముక్త బంధవినాశా॥౧॥ వ॥ అవధరింపు మక్కాంనారి యా హంసయాన కిట్లనియె॥ ౨॥ చ॥ అలికుల వేణి లోకముల నన్ని చరింపఁగవచ్చుఁ గొండలు । న్నలువుగ నెత్తవచ్చు

నటులం బుధు లెల్లను దాఁటవచ్చు భూ। తలమున దూరవచ్చు దివిఁ దాల్మినిఁ ద్రొక్కఁగవచ్చుఁ గాని యీ। యిలఁ బరిపూర్ణ భావమును

## అచలభావము.

నేరికిఁ బట్టుట దుస్తరంబగున్॥ ౩॥ ఆ-వె॥ మొనసి వివిధయోగముద్రలు గనవచ్చు। దేహతత్త్వమెల్లఁ దెలియవచ్చు। నందవచ్చు తారకామనస్కంబుల। నందరాదు కేవలాత్మబోధ॥ ౪॥ క॥ భక్తికి వశ్యముగాదది। ముక్తికిఁ జూపడదు బంధమునఁ దగులదు పో। యుక్తికిఁ జిక్కదు మఱియే। శక్తికి సాధ్యంబుగాదు సతి యచలంబున్॥ ౫॥ ఆ-వె॥ భావమునకుఁ దగులు వడదు పూర్ణాచలంబు। చూపరాదు కనులఁ జూడరాదు। నోట నిట్టిదనుచు నుడువంగారాదు। రమణి మదికిఁ గోచరంబుగాదు॥ ౬॥ క॥ భామిని యేమని చెప్పుదు నామము రూపంబు లేక నంతయు బయలై। కామాది గుణ వికారము। లేమియు లేకున్న యదియు నేమనరాకన్॥ ౭॥ ఆ-వె॥ రూపముండెనేని రూపింపఁగావచ్చు। నామముండెనేని నరయవచ్చు। గుణములుండెనేని గుర్తెఱుఁగఁగ వచ్చు। నేమి లేనిదాని నెఱుఁగుటెట్లు॥ ౮॥ సీ॥ గాలిచేఁ గూలదు రాలచేఁ బగులదు శక్తికిఁ దెగదగ్నిఁ గాలిపోదు। అబ్ధిలో మునుఁగదు దీవియవనిలో నణఁగదు నింగిఁ ద్రొక్కదు లోకసంగిగాదు। ఎండకెండదు వానకెంతయుఁ దడువదు చలికి వణఁకదెందు జంకుపడదు। బాధల కందదు పాశాలిచేఁ గట్టుపడదు మృత్యువుచేత భంగపడదు। చేత కందదు స్వస్వతస్సిద్ధమగుచుఁ। బుట్టినది గాక నది యెప్పు గిట్టు లేక। బట్టబయలయ్యు నొకభంగిఁ బట్టువడదు। నలఘు పరిపూర్ణ బ్రహ్మంబు నరసి చూడ॥ ౯॥ క॥ పొందుగ సద్గురుసూచన। నొందిన వితరంబు లేక యుండును బయలై యెంచినఁ జూచినఁ గనుపడు। సందింతయు లేక సర్వసంపూర్ణంబై॥ ౧౦॥ క॥ ఇది యిదియిదియిదిగానిది। నదియిది యదియనుచు నెఱుఁగు। నదిగానిదియై సదనాతీతం బగుచును। గదలక గనుపించు నదియె గను మచలంబౌ. ఆ-వె॥ పంచభూతగోత్రభాను సుధాకిర। ణాబ్ధులమర మూర్తు లఖిలజీవ। భువనజాలమెల్లఁ బుట్టక పూర్వమే। గలదు కేవలాత్మ కమలగంధి॥ ౧౨॥ క॥ పుట్టిన వెనుకను జగములు। పుట్టక యున్నప్పుడొక్క పోలికనొందున్। బట్టబయలగుచు నుండిన। యట్టిదె యచలంబుగాని యాత్మయునగునే॥ ౧౩॥ మ॥ పరమాత్మ ఖండన మాయ బట్టబయలే బ్రహ్మంబు భావింపఁగాఁ। బరిపూర్ణంబగు దాని నిట్టిదనుచున్ బల్కంగ రాదెంతకే। స్మరయుంగానది నిర్వికార

మతులం ॽ బాధార శూన్యంబువో। నిరుపాధిక్యము నిర్గుణంబు నజముగ్ ॽ
నీరంధ్రమై భాసిలుగ్॥ ౧౪॥ ఆత్మదైవంబంచు ॽ నారయవలదింక-నాత్మ
దేవుండైన ॽ నచలుఁ డట్లు। నిలచి యుండవలదెॽనిమిషంబులోఁ బోవు-
నాత్మ దేవుండెట్టు ॽ లగుఁదలంపఁ। దనువు వచ్చినపుడె - తానును
వచ్చెను - దానుండువఱకునుॽదనువు నుండుఁ। దాను బోయినపుడె ॽ
తనువు దగ్ధంబగుॽ-దనువుఁబాసినపుడె ॽ తాను లేక॥ తే గీ। మాయమై
పోవు నాయాత్మ ॽ మాయగాక। దలఁచి చూడంగ నాయాత్మॽదైవ
మగునె ॽ యాత్మయని నను బరమాత్మ ॽ యనినఁబరమ। హంసచైతన్య
మనసాక్షి ॽ యనినమాయె॥ ౧౫॥ సీ॥ అన్న పానంబులా ॽ ద్యఖిల వర్త
నములు-నాత్మకు లేవు దేॽహంబునకన। దేహంబునందునాॽదేహియున్న
ప్పుడే-యన్న పానంబుల ॽ నారగించు। స్వప్నసుషుప్తులు ॽ జాగరంబును
నొందు-నఖిల కార్యంబుల ॽ నాచరించు। నాత్మయాకాయంబుॽనందు లే
నప్పుడు-కలయునిద్రయు మేల్కॽగాంచు లేది॥ తే-గీ॥ యన్న పానంబులు
ను జేయుॽటదియు నేది। నకలకార్యంబులను నింకॽసల్పు లేది। గాన సర్వంబు
దేహి దేॽగాని దేహ। మేమి సేయదు జడమదిॽమీన నేత్ర॥ ౧౬॥ సీ॥ ఆత్మయే
గల్పించె ॽ నరయఁ ద్రిమూర్తుల-నాత్మయే గల్పించెॽనసుర సురల। నాత్మ
యే గల్పించె ॽ నష్ట దిక్పాలుర-నాత్మయే గల్పించె ॽ నర్కవిధుల। నాత్మ
యే గల్పించె ॽ నక్షత్రవితతుల - నాత్మయే గల్పించె ॽ నగపయోధు।
లాత్మయే గల్పించె ॽ నా పంచభూతంబు - లాత్మయే గల్పించె ॽ నఖిల
జగము॥ తే-గీ॥ లాత్మగల్పించె పశుపక్షు ॽ లాదివివిధ। సస్య వర్గంబు
నరులాది ॽ సకలజీవ। జాల మొనరింప హరియింప ॽ మూలమాయ।
నాత్మయే గాన వేఱొక్క ॽ టరయ లేదు॥ ౧౭॥ క॥ పుట్టినదిగా దచల
ము। బుట్టింపదు దేని నదియుఁ ॽ బొలియదెపుడుఁ దా। నెట్టివికారము
లొందదు। పట్టదు మఱి యెట్టిజోలి ॽ బయలు నకెపుడున్॥ ౧౮॥ ఆ-వె॥
తెలివిజగములెల్లఁ ॽ దెగినను శేషించి। నిలిచియుండు బయలు ॽ నిక్క
ముగను। నట్టి బయలు దేవుఁ ॽ డగుఁగాని నాశమై। పోవు మాయ
యాత్మ ॽ దేవుఁడగునె॥ ౧౯॥ క॥ అనవుడు నాత్మయె నిజమని। మును జె
ప్పితి రిప్పుడదియు ॽ ముఖ్యముగా దలఁచని చెప్పనేమి కారణ। మని యడి
గినఁ గాంతకనియె ॽ మార గురుండున్॥ ౨౦॥ ఉ॥ మాయె దలంప
నాత్మయును ॽ మాయని మున్నుగ నీకుఁజెప్పినన్। మాయ విచార మీల
యని ॽ మానుదు పద్మదళాక్షి యందుకై। మాయగు నాత్మ నిక్కమనిॽ
మాటికిఁ జెప్పితి బీఱచిక్కగా। మాయ విడంగఁ బోదనియు ॽ మాయు

విచారముఁ జేయకుండిన౯॥ ౨౧॥ చ॥ తనువును జూడఁజూడమును తథ్య
ముగాఁగను దోఁచుఁ దోఁచిన౯ । దనుఁ గనుఁగొన్న నాతనువు తానును
గానని తోఁచునంతలో । నెనయఁగ గేవలాత్మమది నెంచియుఁ గాంచి
నతోడ తోడనే । తనువును దాను విశ్వమును దబ్బరగాఁగను దోఁచు
గావున౯॥ ౨౨॥ ఆ-వె॥ ముదిత యోనమాలు మొదటి మెట్టగు సుణి।
తంబు రెండవదియుఁ దలఁప లిపుల । నరసి కూర్చి పల్కు నది మూడ
వది గ్రంథ । మమరఁ జదువునదియు నవలిమెట్టు॥ ౨౩॥ తే-గీ॥ అట్లు
సాంఖ్యంబు మొదటి మెట్టగును దార । కంబు రెండవ మెట్టగుఁ
గాంచఁగ నమ । నస్కమును మూడవదియగు నచఃభావ । మరయ
నాలవ మెట్టగు నట్లుగాన॥ ౨౪॥ చ॥ స్థిరముగ నాత్మతత్వమును దెల్పక
మాయఁగ రోసియున్నఁగాఁ । బరమపదంబుఁ జెప్పినను బట్టుట దుర్లభ
మెంతవారికి । న్నిరవుగ నోనమాలు మఱి నేర్పక మున్నఁగఁ బెద్ద పుస్త
కం । బరుదుగఁ జేతికిచ్చినను నాతఁడునుం జదువంగ నేర్చునే॥ ౨౫॥
ఆ-వె॥ చెట్టు మొదలుఁబట్టి చివరనుబోయి కూ । ర్చుండు వాని భంగి
సూరిజనుఁడు । నాత్మ తత్వమనెడు నావృక్షమును మొదల్ । పట్టిపోవు
పరమ పదమునకును॥ ౨౬॥ ఉ॥ చుక్కలలోన నేదొయొక చుక్కను
జూపెడు వాఁడు వానిలోఁ । జుక్కను నొక్కటి న్నాలుతఁ జూపియు దానికి
నావలీవల౯ । జుక్కల గుర్తుఁజేసి యల చుక్కనుజూపిన యట్లు వేత్త
యు౯ । బెక్కులు గుర్తుల౯ గనిన పిమ్మటఁ జూపును గేవలాత్మ
ను౯॥ ౨౭॥ ఆ-వె॥ మొదలు పట్టకుండ మొనసి శాఖాగ్రాన । కెగసి
పోవఁగలరె యెవ్వరైన । నట్లు మొదలు నాత్మ నరయక పరిపూర్ణ।
భావమొందరాదు బ్రహ్మకైన॥ ౨౮॥ ఉ॥ ఏటిని దాఁటునంతకును
నేదొక సాధన యుండఁగావలె౯ । ఏటిని దాఁటి గట్టునకు నెక్కిన
పిమ్మట నేలసాధనల్ । ధాటిగ విశ్వమాయలను దాఁటియునా బయ
లందువానికి । న్నేటికి సాంఖ్యతారకము లేటికి నా యమనస్కము
ద్రలు౯॥ ౨౯॥ చ॥ కరమునఁదాల్చి దీపమును గామితవస్తువుఁగాంచి
యంత సు । స్థిరముగనుండు వానికిని దీపము నక్కఱలేని చందమా ।
యెఱుకను వెల్గుచేత బయ లెంతయుఁగాంచిన వానికావల । న్నెఱుకను
దివ్వె తోడనిఁక నెంతయుఁ గార్యము లేదు చూడఁగ౯॥ ౩౦॥ ఆ-వె॥
బొట్టుఁ బాయఁదంచి పొసఁగఁదండులములు । సంగ్రహించునట్టి చంద
మునను । మాయఁబాయ మాయ మది విచారించి య । మ్మాయఁ
దొఱఁగి యచల మందవలయు॥ ౩౧॥ క॥ సత్యము నచలము నొట న

సత్యము నిలయాటఁ జేసి ‡ శాస్త్రంబులకున్ । గృత్యమగు లోకమున
కును। ప్రత్యక్ష విరోధమచల ‡ భావంబింతీ॥ ౩౨॥ ఆ-వె॥ ఇలకు శాస్త్ర
ములకు ‡ నెంత విరుద్ధంబు । నైన నిజముకేమి ‡ హానియేను। శాస్త్రలో
కములకు జడియక బాహాట । ముగను దెలుపు వాఁడఁ ‡ పూర్ణబోధ॥
౩౩॥క॥ పరిపూర్ణము సేవించుటె। స్థిరముగ జాగ్రతయటంచుఁ ‡ దెలియుము
విశ్వం। బరయుటె స్వప్నము గావుసఁ। బరిపూర్ణము గాంచి కలను
బాయుమునీవున్। ౩౪॥ ఆ-వె॥ బయల నంత మనిసఁ ‡ బరిపూర్ణమనివను।
నచలమనినఁ గేవ ‡ లాత్మయనినఁ। బరమ గోప్య మనినఁ ‡ బరమ
పదంబన। బట్టబయలు కాఖ్య ‡ పరఁగుఁజూవె! ౩౫॥ చ॥ గరిమఁజరాచరం
బులును ‡ గానిది సర్వము నొక్కటైనదై। మఱుఁగును మాయమర్మ
ములు - మాటలు మోసము లేమిలేనిదై।హరిహర పద్మగర్భులకు ‡
నందఁగ రానిదియెందునున్నదై। యరయఁ బరా పరంబులకు ‡ నావల
యైనది కేవలాత్మయున్॥ ౩౬॥ సీ॥ అన్న పానంబుల ‡ నాచ రింపదు
జగా - లేలపెదుఋఁడన్ను ‡ నెఱుఁగ దెపుడు।పుట్టదు గిట్టదు ‡ భోగింప
నేరదు ‡ కదలదు మెదలదు ‡ కర్తగాదు। జాగ్రతనొందదు ‡ స్వప్నంబుఁ
జెందదు-నిద్రను బొందదు ‡ నిమిషమేది। సేయదు చూడదు ‡ చెప్పదు
వినదేమి ‡ గూడదు వీడదు ‡ గుఁర్తుపడదు। బాధలొందదు సుఖములకు ‡
పాలుపడదు। మహిమఁ జూపదుమాయల ‡ మాటు పడదు। అహముఁ
జెందదు సూకేవ ‡ లాత్మబయలు। నాది మధ్యాంతములు లేక ‡ యలరు
చుండు॥ఉ॥పూనదుమాన దెందుననుబొందదు చెందదులోకమాయలన్।
గానదుధ్యానమానములఁ ‡ గందదు డిందదు కర్మభంగుల। న్నానదుహాని
వృద్ధులను ‡ నందదు చెందదు సర్వకాలముల్। రానిది పోనిదే బయలు
రాకడ పోకడమాయె సర్వమున్॥ ౩౭॥ సీ॥ అండాండములు మాయ।
పిండాండములు మాయ - బ్రహ్మాండములు మాయ ‡ బ్రహ్మమాయ।
హరిహరాదులు మాయ - యమరేంద్రుఁడును మాయ-పంచభూతాది
దిక్పతులు మాయ। సూర్య చంద్రులు మాయ ‡ సురలు దైత్యులు
మాయ - తారకాంబుధిగిరి ‡ తరులు మాయజగము లెల్లను మాయ ‡
జగదీశులును మాయ-సకల జీవులు మాయ ‡ సాక్షి మాయ ।యరయ
నవతారములు మాయ ‡ నరులుమాయ।నరక స్వర్గంబులును మాయ ‡ నట
నమాయ। మాయయె యెంచ సర్వంబు ‡ మాయగాని। దచల పరిపూర్ణ
మొక్కటే ‡ యరసిచూడ॥ సీ॥ అచలమాహరిగాదు ‡ అజరుద్రులును
గాదు శబ్దాది భూత పం ‡ చకముగాదు। దిగ్గజంబులుగాదు ‡ దిక్పా

లకులుగాదు-నరసుర దైత్యవా ళి నరులు గాదు। తరణీందులునుగాదుకొ తారకంబును గాదు-తరులకొ౦డలు పర్వతములు గాదు। గరుడ యక్షు లుగాదు కొ గంధర్వులును గాదుకొసిద్ధ విద్యాధర కొ శ్రేణిగాదు। ఉరగకి న్నర పూరుష కొ యుతముగాదు। శారదా లక్ష్మిగిరిజాది కొ సతులుగాదు। ప్రమథులును గాదు నావిఘ్న కొ పతియుఁ గాదు। పూజలునుగాదు వందనం - బులునుగాదు॥ ౪౦॥ సీ॥ కల్పవృక్షముగాదు కొ కామధేనువు కాదు - హంసపక్షి గరుడఁ కొ డాదిగాదు। ఆది శేషుండుగా కొ దష్టవసు లుగాదు - నవరత్న లోహపం కొ చకముగాదు। సప్తదీవులుగాదు కొ సప్తాం బుధులుగాదు కొ సప్తఋషులును గాదు కొ శాంతిగాదు। వరసత్యలోకాది కొ వైకుంఠములుగాదు - కైలాస దేవలో కొ కములుగాదు। వెలయఁగానెల్ల యవతార కొ ములునుగాదు। జగచ్చతుర్దశశ క్తి పంకొ చకముగాదు। దేశి కులుగాదు శిష్యాది కొ తెగలుగాదు। అంతరముగాదు బాహ్యంబుకొనర యుఁగాదు॥ సీ॥ సకలవేదపురాణ కొ శాస్త్రంబులునుగాదు ఘన భాష్య సూత్రాది కొ కములుగాదు। స్మృతియును నితిహాస కొ శ్రుతి సూక్తము లుగాదు - దలఁపఁజౌషష్టి విద్యలును గాదు। తెలియనేఁబదియాఱుకొ దేశ భాషలుగాదు - నామరూపాఖ్య పు కొ ణ్యములు గాదు। నఱసాంఖ్య తారక కొ లమనస్క మునుగాదు-ముద్రయోగవి శేష కొ ములును గాదు। స్నాన సంధ్యాదులును గాదు కొ జపముగాదు। సప్తకోటి మహామంత్ర కొ చయము గాదు। తపము నుపవాసవిధి నిషే కొ ధములు గాదు। జ్ఞానకర్మం బులునుగాదు కొ సారసాక్షి॥ ౪౧॥ సీ॥ వెలియు వెల్గునుగాదు కొ చీఁకటి యునుగాదు - అరయ నూళ్లునుగాదు కొ అడవిగాదు। అంతరంగము గాదు। ఆశ్రమంబులుగాదు-అనువొందు కృష్ణాజి కొ నాదిగాదు। మహా నీయ దండక కొ మండలంబులు గాదు-కాషాయవస్త్ర సంకొ గతులుగాదు। ఆసనంబులు గాదు కొ అభ్యాసములు గాదు-రుద్రాక్షతులసి పేకొరులును గాదు। ఒనరఁజలలను జోడిసేకొయుటయుఁగాదు। సొరిదిగడ్డంబు జడలుఁ బెంచు కొ టయుఁగాదు। నామమును భూతియుఁదాల్చు కొ నటనగాదు। కట్టుటయుఁగాదు నగ్నయుఁ కొ గాదు బయలు॥ సీ॥ పరఁగజుల్కనగాదుకొ భారంబు గాదు శీ-తోష్ణ కఠినమృదు కొ లొనరఁగాదు। మృదసంబులు గాదు కొ సద్గంధములు గాదు - షడ్వర్ణ కలిత సం కొ చయముగాదు। పురు షుఁడు స్త్రీయు న కొ పుంసకంబును గాదు - జడముగాదదియు న కొ జడ ముగాదు। వర బాల్యయౌవన కొ వార్ధకంబులుగాదు - పరికింపదీర్ఘకుకొ బములుగాదు। ప్రాణమునుగాదు అచలంబు కొ బ్రతుకుగాదు। భంగము

నుగాను నిశిగాదు / పవలుగాదు । వార తిథి పక్ష మాస ఋతు / వయన
వత్స । రములు యుగ కల్పకల్పాంత / రములుగాదు॥ ౨౫॥ సీ॥ మొలఁత ధర్మా
ధర్మ / ములును వేద్యావేద్య-ములును జోద్యాచోద్య / ములునుగాదు।
తలఁప సత్యాసత్య / ములును నిత్యానిత్య - ములును ఖండాఖండ / ములు
నుగాదు । కలయ సాధ్యాసాధ్య / ములు చలాచల నిరా - కారసాకా
రాది / గతులుగాదు । ఎలమి లోకాలోక / ములును గాలాకాల-ములును
భావాభావ / ములునుగాదు॥ తే-గీ॥ గోపురములు గాదారయ గుళ్లు
గాదు । పరఁగ విగ్రహములు గాదు / భక్తిగాదు । దానములుగాదుతీర్థ
యా / త్రలును గాదు । యాగములు నాదిగాదు సా / యచలమెన్న॥
౨౬॥ తే-గీ॥ అఖిలమునుగాదు సర్వ శూ / న్యంబుగాదు । దలంపఁగన్ను
లకెదుటఁ బ్ర / త్యక్షముగను । జూడఁ గనుపించు నదియెట్లు / శూన్య
మగును । లేని దరయంగ మాయయే / లేదుగాక॥ ౨౭॥ శా॥ ఫాలాక్షా
మర విష్ణుపద్మజులకున్ / బ్రత్యక్ష దైవంబునై । కాలాకాలము లేవిలేక
బయలై / గన్పించు నా బ్రహ్మమున్ భావింపన్ బవనాంబుపర్ణ ఫల
ముల్ / భక్షించుచున్ యోగులై । చాలాకాలము కానలందుఁ దప
ముల్ । సాధించరేగానకన్॥ ౨౮॥ తే-గీ॥ ఎందొగలదు సూబయలంచు /
నెంచఁబోకు । పంచభూతాదిసర్వ ప్రపంచయుతము । నీవు నేనునుగా
కను / నిల్చినదియె । బయలు ప్రత్యక్షమగు బట్ట / బయలుచూవె॥ ౨౯॥
ఆ-వె॥ నీకుముందు వెనుక / నిరుపార్శ్వములయందుఁ। జాలుమూలలాది /
సర్వదిశల । దాపుదవ్వులందు / లోపల వెలుపలఁ। గ్రిందమీఁదఁ గలదు /
కేవలాత్మ॥ ౩౦॥ క॥ ఒరగదు పెరుగదు విఱుగదు । తఱగదు మర్మంబు
గాదు / దాఁగదదెందున్ । జరుగదెఱుఁగదు మొఱఁగదు।పరిపూర్ణం
బదిగొచూడు / ప్రత్యక్షముగన్॥ ౩౧॥ తే॥ పుట్టిగిట్టెడు మాయలఁ /
బట్టువడదు । అదియుంద దిందు నం / దనఁగరాదు । సర్వపరిపూర్ణమై
యెందు / సందులేక । నిండి యున్నది పరికింప / నేమిగాదు॥ ౩౨॥ క॥
ఖండాఖండములగుచును । నుండిన దేమాయమాయె / హుళ్ళిక్కియగున్
ఖండాఖండములొందక । యుండిన దే బయలటంచు / నూహింపంగన్॥
౩౩॥ ఆ-వె॥ తలఁపబేరులేని / దానికి బయలని । పేరుమాయపుట్టి /
పెట్టె నట్టిబట్టబయలు గన్న / భ్రమరూప మైనట్టిమాయ వాసిపోవు /
మధురవాణి॥ ౩౪॥ క॥ చూచితి మందురు కొందఱు । చూచిన దేమియు
నులేదు / శూన్యంబునఁ దాఁ।జూచిన తోఁచినదృష్టిక । గోచరమైపోవు
తానె / కానకును లేకన్॥ ౩౫॥ తే-గీ॥ తాను బ్రహ్మంబుగనఁబోవఁ /

దానె లేదు। బ్రహ్మమేఁ గంటి నంచు। బల్కు నెట్లు। సూర్యబింబముం
బొడఁగన్న ✽ శూన్యమైన। చీఁకటే దింక రవి జూడఁ ✽ జెప్పుటకును॥ ౫౬॥
క॥ ఉన్నదియున్నది బయలని। యున్నధిపలుమాటలెటులకై ✽ యూయుచ
లంబున్। గన్నది లేక యెపోయె। న్నన్న యచలమెఱుఁగ నేమి ✽ యున్నది
యింకన్ ౫౭॥ ఆ-వె॥ ఏమి లేని దాని ✽ నే నెట్టు లెఱిఁగింతు। నీవు నెఱుఁ
గు టెట్లు ✽ నిక్కముగను। నున్నదేమి గాక ✽ యున్నదే యున్నది। లేని మా
య లేనె ✽ లేదెవుడును॥ ౫౮॥ క॥ తోఁచినది గాదు సర్వముఁ। జూచిన
దియుఁ గాదు సర్వ ✽ శూన్యము గాఁదాఁ। దోఁచిన దెల్లను మాయే। చూచి
నదియు మాయె బయలుఁ ✽ జూడఁగ వశమే॥ తే-గీ॥ బట్టబయలందుఁ దోఁచు
ప్రపంచమెల్ల। లేక గనుపించుఁ బరికింప ✽ లేక పోవు। నెండమావులఁ దోఁ
చెడు ✽ నీళ్ళకరణి। వెదకి చూచిన లేకుండు ✽ విధముగాను॥ ౫౯॥ క॥
భ్రమచేతఁ దోఁచు సర్వము। భ్రమచేతనె లేక పోవు ✽ భ్రమయే గాంచున్।
భ్రమలేని వారి కెప్పుడు। భ్రమదోఁచద దెందు బట్ట ✽ బయలున
కంటెన్॥ ౬౦॥ ఆ-వె॥ భ్రమయనంగ భ్రాంతి ✽ భ్రాంతి యన్నను మాయ।
మాయ యనఁగ స్వప్న మగుఁదలంప। స్వప్నమందె నిద్ర ✽ జాగ్రత కల
లాదిఁ। బొందు చెందు లేక ✽ పోవు భ్రాంతి॥ ౬౧॥ క॥ మాయయె లోకము
లెల్లను। మాయె పుట్టించుఁ బెంచు మాయే ద్రుంచున్। మాయే భ్రమయుచు
నుండును। మాయే కొనకేమి లేక ✽ మటుమాయ మగున్॥ ౬౨॥ ఆ-వె॥
సర్వసాక్షి ద్రష్ట ✽ చైతన్యమనఁ బర। మాత్మ యెఱుక పరమ ✽ హంస యన్న ✽
నాత్మజ్యోతి మాయ ✽ యహంకార మన్నను। నొక్కటంచుఁ గనుమ ✽ యుత్త
లాత్మ॥ ౬౩॥ క॥ అంతర బాహ్యము కల్పిత। మంతయుఁ బరిపూర్ణ మనుచు।
నచలంబనుచున్। సంతతము నెఱుఁగఁ బడు ధీ। మంతుల కనులేదు లేని ✽
మాయ దలంపన్॥ ౬౪॥ ఆ-వె॥ ఆత్మకంటె మాయ ✽ యవనిలో నేదింక।
వెలుఁగు లుఁగ దాత్మ ✽ విశ్వమునకు। విశ్వమెల్ల మాయ ✽ వెదకి చూడఁగ
లేని। దాత్మ గాన మాయ ✽ యనఁగవలసె॥ ౬౫॥ చ॥ జననము నామ
రూపములు ✽ జాతియు నీతియుఁ బాపపుణ్యముల్। ఘనమునునీచముల్
లయము ✽ కష్టసుఖంబులు బంధమోక్షముల్। మనమును నింద్రియంబు
లును ✽ మానము న్యూనము మంచి చెడ్డలున్। గనుఁగొన గేవలాత్మ
కును ✽ గల్లవు సర్వము మాయ కేదగున్॥ ౬౬॥ సీ॥ ఈయుత్త బట్టబై ✽
వెప్పుడు నొక భంగి నున్నది గాని నే ✽ ఱొక్క విధము। గాదింతకును
ముందు ✽ గా నేర దిప్పుడు-గాఁ బోవదిఁక మీఁదఁ ✽ గా దెవుడును। సర్వ
కాలములందు ✽ సర్వదేశములందు-సర్వవస్తువులందు ✽ సందు లేక। సర్వ

సంపూర్ణమై ఽ చలన మించుక లేక - పరిపూర్ణమేకమై ఽ పరఁగునెందు॥
తే-గీ॥ జలచరానీకములవెన్ని ఽ జలధియందుఁ। బుట్టిగిట్టిన నెఱుఁగనిఽ
పోల్కిఁగాను। నెండమావుల రీతిని ఽ నుండు నగము। లెల్లనుండినఁ
బోయిన ఽ నెఱుఁగకుండు॥౧౭॥ క॥ పుట్టినమాయేమాయను। బుట్టించును
గాని మాయఽపుట్టును గిట్టుల్। ఎట్టివొ యెఱుఁగని యాబయి। లెట్టులఁ
బుట్టించు భ్రాంతి ఽ నెఱుక జగంబుల్॥ ౧౮॥ సీ॥ సత్యంబునందున ఽ
సత్యమే పుట్టు న-సత్యమే గతిఁబుట్టు ఽ సత్యమందు। నరులకు నరులునేఽ
కరులకుఁ గరులునే - ఘోటకాదులకును ఽ ఘోటకములె। సారమేయ
ములకు ఽ సారమేయంబులే - కీట కాదులకును ఽ గీటకములె। యేజాతి
పక్షుల ఽ కాజాతిపక్షులే - యొకజాతి యందు వే ఽ ఱొక్కజాతి॥ తే-గీ॥
పుట్టకేజాతికాజాతె ఽ పుట్టుచుండ। సత్యమగు బట్టబయట నఽసత్యమైన।
జగములేరీతిఁ బుట్టును ఽ సర్వజగము। కలయె మేల్కనిచూడ నొఽక్కటి
యులేదు॥ ౧౯॥ ఆ-వె॥ తోలునోట జనులు ఽ తాలుమాటలుఁదోచి।
పలుకు టింతెగాక ఽ భ్రాంతులగుచు। బ్రహ్మమెఱుఁగలేక ఽ బహురీతు
లెంతురు। గజము నంధకులునుఽగన్నయట్లు॥ ౨౦॥ వ॥ అది యెట్లంటేని
వినుము॥ సీ॥ నలువు రంధకులొక్క ఽ స్థలమునఁ గూర్చుండి-కరిఁజూడ
గోరినఁ గరుణ నొకఁడు। గజముఁ దెచ్చియునిల్పఁ ఽ గాలు తొండము
తోఁక - చెవులొక్కొక టొకండు ఽ చేతఁదడవి। వారణంబును రోటిఽ
వలెనున్న దనెనొకం-డొకఁడు రోకలిభాతి ఽ నున్నదనియు। నొకఁడు
చీఁపురు భంగిఽనున్నదని వచించె-నొకఁడు చేటను బోలిఽయున్నదనియె॥
ఆ-వె॥ మించియొకరి నొకరు ఽ మెచ్చక నల్వురు। నైరి నాల్గు దెఱవుఽ
బట్టి విధము। నిక్కమైన బ్రహ్మఽమొక్కరు నెఱుఁగక। పరిగణింత్రు
వేఱు ఽ పద్ధతులను॥ ౨౧॥ క॥ కమఠాకృతి నిలఁగొండఱు। తమ కప
టముఁ దెలియనీక ఽ తగనచలంబుల్। దమరెఱిఁగిన క్రియ సాధుల॥ క్రమ
మున లోకులకుఁ జూడఁగనిపింతురోగిన్॥ ౨౨॥ ఆ-వె॥ ఎఱుక పుట్టక
యును ఽ నెట్లన్నవినునారి। కేళమందుఁ జేరు ఽ నీళులట్టు। లెఱుక నాశ
మరయ ఽ నేనుఁగుమ్రింగిన। వెలఁగపండు గుజ్జు ఽ విధము దెలియు॥ ౨౩॥
క॥ బయలన్నది బయలగునా। బయలను భావంబునెపుడు ఽ బ్రహ్మంబ
గునా। బయలనియెడి పల్కగునా। బయలను గుర్తెపుడుగాదు ఽ పరమ
పదంబుల్॥ ౨౪॥ తే-గీ॥ ఏమియును లేని మాయయేఽయెఱుక జగము।
లెఱుకకె యెఱుక గనఁబించు ఽ నిహపరంబు। లెఱుకయే సర్వమును
గుర్తు ఽ నెఱుఁగు మఱచు। నెఱుకయే లేకపోవుఁదా ఽ నెన్నఁదుదకు॥

౭౫॥ క॥ పరిపూర్ణంబును నెఱుకను । నెఱుకే గుణ్యెఱుఁగు నెఱుక ౯ నెఱుఁ
గదు బయలు । న్నెఱుకే పరిపూర్ణముగని । యెఱుకే శూన్యమంచు నెఱుకఁ
కెఱుకే మాయర్ ॥ ౭౬॥ తే-గీ॥ ఎన్ని త్రిప్పుల నొందిన ౯ నెఱుకె గాని యచ
చలమే త్రిప్పుల నెఱుఁగ ౯ దరసిచూడ । భ్రాంతి మూలమై యెఱుక యే ౯
పరఁగునట్టి । యెఱుక యే భ్రాంతిశూన్యమై ౯ యొప్పుఁ దరుణి ॥ ౭౭॥ చ॥
గరిమను బూర్ణతత్వమును ౯ గాంచిన సట్టి మహాత్ము లెంతయు । న్నెఱు
కను లేనిదంచు వచి ౯ యించిరి గావునఁ గేవలాత్మునిన్ । బయనడిఁ గాంచి
సి వెఱుకఁ ౯ బాయుము లేనిదియంచు నెప్పుడున్ । మరలను భ్రాంతి పుట్టి
దను ౯ మానము లేదిఁక మానినీమణీ ॥ ౭౮॥ క॥ తున్నదియిదియున్నది
యిది । యున్నది యిదియనుచు నెఱిఁగి ౯ యు త్తదియెఱుకే । యున్నది
తాఁ గన్నది మది । నెన్నఁగనది లేమి లేని ౯ దెఱుక యొసుమిత్రా ॥ ౭౯॥ క॥
మాయ బయలందుఁ గలదని । తోయజదళనేత్ర సీకుఁ ౯ దోఁచుచు నున్నన్ ।
బాయక నీవిప్పుడు నా । మాయను చూపింపవలదె ౯ మఱి బయలందున్ ॥
౮౦॥ ఆ-వె॥ ఎండమావులందు ౯ నుండునే యుదకంబు । లేక తోఁచు
నట్లు ౯ లోకములును । మాయ కే స్వభావ ౯ మైగానుపించును । గాక
నిక్కముగను ౯ గలదె మాయ ॥ ౮౧॥ క॥ తున్నది మాయయని గనిన । నున్న
దికలగన్న వాని ౯ యొప్పఁగలమే । లున్నగతి బయలు గాంచిన ।
యున్నతునకు మాయ గల్గ ౯ దంబుజవదనా ॥ ౮౨॥ ఆ-వె॥ అనుభవంబుఁ
గంటి । మందు రిభువిఁ గొంద । అనుభవంబు గలదె । యచలమందు ।
ననుభవంబు శూన్య ౯ మైపోవు నిక్రమ । నలిపియుండవలదె ౯ నిక్కమైన ॥
౮౩॥ ఉ॥ తానుశరీరము నొక్క టెకతథ్యము నమ్మిన వచ్చు దేహముల్ ।
గాన నవశ్యమీ బయలు ౯ గాంచియు జాగ్రత నొందిస్వప్నముల్ । మానియుఁ
దాను దేహములు ౯ మాయ యటంచుఁ దలంచునట్టి యా । మానవుఁ డెన్ని
కల్పములు । మాజినఁబుట్టనె యీజగంబునన్ ॥ ౮౪॥ ఆ-వె॥ మాయదోఁ
చుచుండు మానవునకు భ్రాంతి । స్వప్నమగుచు గాని ౯ జాగ్రతగునె ।
బయలుగాంచి మాయఁ ౯ బాయఁ గట్రోఁచిన । ఘనుఁడె జాగ్రతయును ।
గన్నవాఁడు ॥ ౮౫॥ క॥ తెలివిని నమ్మియు నచలముఁ । దెలియక పాము
డులు మాయఁ ౯ దేలి మునుఁగుచున్ । దెలియరు సర్వము నెఱిఁగెడు । తెలివే
మాయయనుచిప్ప ౯ దెలియుము యువ్లే ॥ ౮౬॥ ఆ-వె॥ రమణి వినుము
తెలివి ౯ శాకశోకల చేత । దినము రాత్రికరణిఁ ౯ దిరుగుచుండు । నట్టి తె
లివిచే । నచలంబు నెఱ్యింప । యట్టి తెలివి పోఁడ ౯ నచలుఁడగును ॥ ౮౭॥
క॥ సరసీజాక్షుఁడు చీఁకటి । నెఱుఁగక భాసిల్లు నట్లు ౯ నిక్కంబుగనో ।

తరుణీమణి యెన్నఁటికినిఁ బరిపూర్ణం బెఱుఁగ దీ ¦ ప్రపంచము చూడన్॥ ౮౮॥
ఆ-వె॥ స్వప్నమందుఁ గన్న ¦ స్వానుభవంబెల్ల। మేల్కొంచి చూడ ¦
జాలనట్లు। జగము పుట్టి పెఱిగి ¦ సమయుటలెల్లను। నేమి లేదు వట్టి ¦ దెల్ల
భ్రాంతి॥ ౮౯॥ క॥ జీవుఁడె భ్రాంతికి బనుచును। భావించిన లేని మాయ ¦
బ్రహ్మంబగునే। జీవుఁడె భ్రాంతికి మూలము। భావింపఁగ బ్రహ్మము
నకు ¦ భ్రాంతియుఁగలదే॥ ౯౦॥ ఆ-వె॥ బయలుగానలేక ¦ బహుజన్మ
ములనెత్తిగట్టికుడుచు చుండు ¦ కర్మఫలము। తనదు జన్మకర్మ ¦ తాను
బాయఁగ లేని। జివుడెట్లు తమకు ¦ దేవుఁడయ్యె॥ ౯౧॥ క॥ శివుఁడే తన
వుకు మూలము। శివుఁ డేగినఁ దనువు కల్గె ¦ జీవుండెట్లే। శివుఁడెట్లు
బ్రహ్మమనఁదగు। భవనాశము లేని బయలె ¦ బ్రహ్మముగాకన్॥ ౯౨॥
ఆ-వె॥ బయలు గగనమంచుఁ ¦ బామరుల్ కొందఱు। పల్కుచుందు
రట్లు ¦ భ్రాంతిపడకు। చదలు బయలుగాదు ¦ శబ్దమే గుణము ని। శ్శబ్దమ
గును సార ¦ సాక్షి బయలు॥ ౯౩॥ క॥ బయలందె పుట్టు సర్వము। బయ
లందే యడఁగునంచుఁ ¦ బల్కుదు రజ్ఞుల్। బయలందుఁ బుట్టిగిట్టిన బయలే
పెను మాయ యనఁగఁ ¦ బడునటుగానన్॥ ౯౪॥ ఆ-వె॥ పుట్టుగిట్టు లేని ¦
బట్టబైలందునఁ। బుట్టుటెట్లు మాయ ¦ గిట్టుటెట్లు। మాయ వచ్చినట్లు ¦
మగుడిఁ బోయినయట్లు। దోఁచుటెల్ల భ్రాంతి ¦ తోయజాక్షి॥ ౯౫॥ క॥
అనవుడు జగములు నిజముగఁ గనుపడుచుండంగ నెట్లు ¦ కల్లని యెంతుర్।
వనజాక్షనాదుసందియ। మును దీర్చు మటన్న సతికి ¦ ము క్తిదుఁడనియెన్॥
౯౬॥ ఆ-వె॥ కలయు స్వప్నమందు ¦ గజములు గుఱ్ఱాలు। రథములొంటె
లధిక ¦ రథికవరులు। సేనలెన్ని గాని ¦ సేనాధిపతులును। నెట్లు దోఁ
చె మేల్కొ - నెట్లువోయె॥ ౯౭॥ చ॥ సరసిజనేత్ర యా శశివి ¦ షాణము
చొప్పున రజ్జు సర్పమా। కరణిఁ గొయ్య తస్కరుని ¦ కైవడి వంధ్యత
నూజు చాడ్పునన్। దిరముగ శు క్తి రౌప్యమగు ¦ తీరున నామృగతృష్ణ
నీరుగాఁ। బొరిఁబొరి యేమి లేని పరి ¦ పూర్ణమునందునఁ దోఁచు విశ్వమున్॥
౯౮॥ ఆ-వె॥ నెలఁత వినుము నభము ¦ నీలమైగాన్పించు। పోల్కి నరయ
గగన ¦ పుష్పమట్లు। స్వప్న సానుభవము ¦ చందంబు మఱియు నా।
యింద్ర జాలముగను ¦ నిలయుఁ దోఁచు॥ ౯౯॥ క॥ కనుపడు సర్వము
భ్రమయే। గనుఁగొన్నది భ్రమయెగాని ¦ గాదచలంబున్। గనుపడు
నది గనుఁగొన్నది। గనుఁగొనగా లేనిదంచుఁ। గాంచుము నీవున్ ౧౦౦॥
ఆ-వె॥ లేనిమాయఁ జూచి ¦ లేదనఁదగు గాని। యచలమెపుడు లేదనన
గఁడగదు। బయలు చూడ నెందుఁ ¦ బ్రత్యక్షమైయుండుఁ। గాని మాయ

చూడఁ॰ గానఁవడునె॥ ౧౦౧॥ క॥ ఇక్కడ నక్కడఁ దోఁచియు। నెక్కడఁ
గనరాదు మాయ॰ నిక్కంబైనన్। నిక్కడ నక్కడ నెక్కడ। నొక్క
టియై యచలమట్టు॰ లుండఁగవలదే॥ ౧౦౨॥ ఆ-వె॥ వట్టి రజ్జుఁ జూచి॰
బిట్టులిక్కుటేగాని। పరఁగఁ ద్రాటియందుఁ॰ బాముగలదె। భ్రమసిలేని
పోని॰ భ్రాంతి నొందుటెగాని। తలఁప నచలమందు॰ నిలయుఁగలదె॥
౧౦౩॥ క॥ దారునదాటునఁ జూచియుఁ। జోడుండని భ్రమసిలిరిగి॰ చూచిన
నదియున్। దారువగునట్టు లచలము। నారయఁగా లేనిమాయ॰ యగు
పడ దెందున్॥ ౧౦౪॥ ఆ-వె॥ మరుమరీచికలను॰ మంచి జలంబని॰ పోయి
చూడలేక॰ పోవ్రనట్లు। భ్రాంతిచేతఁ దోఁచఁ॰ బడువిశ్వమెల్లను। నరయు
లేకపోవు॰ నచలమందు॥ ౧౦౫॥ క॥ కమలాక్షి శుక్తిరజిత। భ్రమఁ
జెందినశుక్తియందు॰ రౌప్యంబేదా। క్రమమున లేకయ దోఁచిన। భ్రమ
జగములు లేవుబట్ట॰ బయలున నెప్రుడున్॥ ౧౦౬॥ ఆ-వె॥ నెమ్మిఁ శశకము
నకుఁ॰ గొమ్ములున్నవే। గొడ్డురాలునకును॰ బిడ్డగలదె। నాకసమునఁ
బుష్ప॰ మమరంగ నుండునే। వట్టిదేమిలేని॰ బట్టబయలు॥ ౧౦౭॥ చ॥
ఘనముగ స్వప్నమందునను॰ గాంచినవెల్లను నిక్కమట్లుగాఁ। గనుపడు
చుండు జాగ్రతను॰ గాంచినయొంతనె స్వప్నమందునన్। దనుఁగనుఁగొన్న
సర్వమును॰ దబ్బరయై జనునట్టులాబయల్। గనుగొని మేల్కనొంది
నను॰ గన్పడుటెట్లిఁక స్వప్నలోకముల్॥ ౧౦౮॥ ఆ-వె॥ జగములెల్ల
నిజమె॰ జాగ్రతయందున। స్వప్నమందుఁ గొంత॰ సత్యమయ్యె। నిద్ర
యందు మునిఁగె॰ గలయునుదానును। నింక నేమిగలదు॰ నీరజాక్షి॥
౧౦౯॥ క॥ మెలఁకువె జాగ్రత యవినను। గలయందున జాగ్రతయును॰
గలదెట్లనినన్। గలయందు నెఱుక లేకయె। కలవిధమును జెప్పగలదె॰
గాఢసుషుప్తిన్॥ ౧౧౦॥ ఆ-వె॥ జగమె సత్యమంచు॰ జాగ్రత దెల్పెను।
నిలయు స్వప్నమంచుఁ॰ గలయుఁ దెల్పె। మెలఁకువయును గలయు॰ మిథ్య
యంచును నిద్రఁ। దెల్పెనింక మాయ॰ దెలియనేది॥ ౧౧౧॥ క॥ మెలఁ
కువ నిక్కంబైనను। గలయును నిక్కంబెగాని॰ కల్లనఁదగునే। మెలఁకు
వఁగని కలమిథ్యన। మెలఁకువయును సుప్తియందు॰ మిథ్యయగాదే॥
౧౧౨॥ ఆ-వె॥ ఎన్నజాగరమున॰ నున్నంతవఱకును। సత్యముగను
దోఁచు॰ జాగరంబె। కలనుగాంచుతఱినిఁ॰ గలనిక్కమై తోఁచుఁ।
గానజాగ్రతయును॰ గలయు నొకటె॥ ౧౧౩॥ క॥ మెలఁకువనుండును జ్ఞ
ప్తియుఁ। గలయందున జ్ఞప్తిగలదు॰ గావున మేల్కన్। గలయొక్కటి
గాకున్నను। గలయును జాగ్రతయునునేది॰ గాఢసుషుప్తిన్॥ ౧౧౪॥

ఆ-వె॥ నీవు నన్నుఁ గనుట ॥ నేనిన్నుఁ గాంచుట । నేను జెప్పుటయును ॥ నీవు
వినుట । నీవు నేను జగము ॥ నిఖిలంబు కలయని । దెలియు బట్టబయలు ॥
కలయుఁగాదు॥ ౧౧౫॥ సీ॥ ఇలలోనఁ దిరిపంబు ॥ నెత్తి జీవించెడు-నెడ
పేదయొకచోట ॥ నిద్రించియుఁగడ కోటి రవిమాది భూషాంబర-తతు
లెల్లఁ దనమేనఁ ॥ దాల్చినట్లు । గొమరైన నాకకొల్వు ॥ కూటంబులో
రత్న-సింహాసనమున వసించినట్లు । హితులు మంత్రులు పురోహితులు
సేనాధిప-వందిమాగధభటు ॥ వర్గములు । రాజు లెలను సేవింపఁ రాజ్య
మెల్ల । నేలినట్లుగఁ గలఁగాంచి ॥ మేలుకొనినఁ । గల్లయయ్యెను రాజ్యంబు ॥
కొల్లవోయె । రక్ష లేదాయె నెప్పటి ॥ బిక్షగాఁడె॥ ౧౧౬॥ క॥ కలలో
దోఁచినసర్వము । మెలఁకువ యందు నను చూడ ॥ మిథ్యయగునట్లెల్
మెలఁకువను బయలుఁ గాంచినఁ । గలజగములు లేక పోవుఁ ॥ గనుఁగొను
చుండెన్॥ ౧౧౭॥ ఆ-వె॥ పోదు బట్టబయలు ॥ పోఁగొట్ట వలెనన్న । రాద
దిందునందు ॥ రాఁ దలంప । బహుళయత్నమునను । బ్రహ్మాదులును బట్టి ।
నిల్పవలెనటన్న ॥ నిండుమాయ॥ ౧౧౮॥ క॥ సర్వము గుర్తెఱుఁగుదునని ।
గర్వంబునఁ గేవలాత్మఁ ॥ గాన కలయునా । సర్వజ్ఞుకంటె మేలగు । సర్వము
గుర్తెఱుఁగనట్టి ॥ శాంబరయె॥ ౧౧౯॥ తే-గీ॥ ఉన్నదీ బట్టబయలు
సు-మ్మెన్నఁటికిని । నున్న దనరాదు మాయయు ॥ సున్నగాన । జగము
లెల్లను దోఁచుట ॥ స్వప్నభాతి । నెన్నివిధములఁ జూచిన ॥ నేమిలేదు॥
౧౨౦॥ వ॥ తడయక దారు గుర్తెఱుఁగఁ ॥ దస్కర భ్రాంతియు లేనిచొ
ప్పునన్ । విడువక శుక్తిఁ గన్గొనిన-వెంటనె రౌప్యము లేని పోలికన్ ।
దొడరిన రజ్జునారసినఁ ॥ దోడనె సర్పము లేని చాడ్పునన్ । గడువడిఁ
బూర్ణ తత్త్వమును ॥ గాంచినయంతనె లేదు విశ్వమున్॥ ౧౨౧॥ తే॥ బట్ట
బయలందు జగమును ॥ పుట్టు గిట్టు ననుటకంటెను లేదంట ॥ ఘనము
వంధ్య । సతికి సుతుఁడును నుదయించి ॥ చచ్చిపోయె । ననుటకంటెను
బుట్టలే ॥ దనుటె మేలు॥ ౧౨౨॥ క॥ జలజాక్షి లేని మాయను । గలదని
పిమ్మటను లేదు ॥ కల్లనుటెల్ల । బలువుగ మేనసమేధ్యము । నలఁదియు
నది గడిగికొన్న ॥ యట్టివిధంబగున్॥ ౧౨౩॥ ఆ-వె॥ కానలేని మాయ ॥
కలయని దలపోయఁ । గలదటంచున్న మాయ ॥ దొలఁగిపోయె । మాయ
శూన్యమైన ॥ మఱి వేఱేమి లేదాయె । నేమిలేని బయలె ॥ యేకమాయె॥
౧౨౪॥ క॥ మెలఁకువ నొందిన వెంటనే । కలనిలువక పోయినట్లు ॥ గను
పడు మాయల్ । నిలుచునె యచలముఁ గాంచిన । మెలఁకువయును
నిద్రభంగి ॥ మిథ్యయాయిచనున్॥ ౧౨౫॥ ఆ-వె॥ ఎన్న లేనిమాయ ॥ యెఱు

కంబాసిన మీాదనున్న బట్టబయలు / నెన్నుటకును । నెఱుక లేకపోయెన్
నేమున్న దామీాదం । దోఁచుచుండుటకును / జూజుటకును॥ ౧౨౫॥ ఉ॥
ఆరయ విశ్వమీా బయలు / నందునఁ దోఁచుచు నుండ లేని దే యూరక
లేని భ్రాంతియును / నుండినకై వడి నుంతు రే మనన్ । దారువునందుఁ డ
స్కరుఁడు / ద్రాటిసఁబన్నగ న్నెండమావులన్ । వారివిధంబు గన్పడుట /
వానికి నెన్న స్వభావ జన్యమా॥ ౧౨౬॥ క॥ పరిపూర్ణంబే శాశ్వత । మర
యంగా లేనిమాయె / యఖిలజగంబుల్ । పరిపూర్ణ మందుఁ దోఁచినఁ
బరికింపఁగ వలయు లెని / భ్రమయది యనుచున్ ॥ ౧౨౭॥ సీ॥ పంచముద్రలు
పట్టి / బాధలుపడ నేల యష్టాంగయోగంబు / లవియు నేల । సాంఖ్యతార
కములు / సాధింపఁగా నేల / యమనస్క భావంబు / నంద నేల । పరఁగ నెమ్మన
మును / బట్టి నిల్పఁగ నేల - యింద్రియాదుల గుది / యింప నేల । శాంత
సూనృతములఁ / జరియింపఁగా నేల—చదువులెల్లను మించి / చదువ నేల॥
తే—గీ॥ చీఁకుఁబడి కానఁ దపములఁ / జేయ నేల । సంతతంబును జపములు /
సల్ప నేల । కనులు మూసినఁ దెఱచినఁ / గానఁబడుచు । నచలమే సాధనము
లేక / యలరుచుండ॥ ౧౨౮॥ సీ॥ బూటక వేషముల్ / పొట్టకూటికిగాని—
పొందుగా ముక్తికిఁ బ్రోవునుగావు । ముద్రలన్నియు దేహ / మున కవస్థకె
గాని—మొనయ జన్మవినాశ / మునకు గావు । అఖిలయోగంబులు / నల
జడికేగాని - గర్మరాహిత్య సంగతికిఁ గావు । బహు మహాత్త్యంబులు ।
ప్రజల మెప్పుకెగాని - యాదయజన్మ జూ / న్యతకుఁ గావు॥ సాంఖ్యము
ను దారకామన / స్కంబులాది । త్రిప్పలకుఁగాని జన్మ సి / ద్ధికినిఁ గావు॥
మొదలు కర్మలు భవనాశ / ములకెగాని । కోరితమ్ముఁను దరియించు / కొఱ
కుఁగావు॥ ౧౩౦॥ తే—గీ॥ అవని బూరుగు ఫలముల / కాశఁజేసి । పక్షు
లునుగాచి నిష్ఫలం / బందినట్లు । నిజముఁగానక బహుమాయ / నిష్ఠ
లందు । బరఁగు చుండుట నిష్ఫలం / బగును గాదె॥ ౧౩౧॥ క॥ అనలంబె
గాని నిఖిలంబును నెద్దిదహింప లేని / పోలికమాయన్ । జనఁజేయు నచల
భావంబునుగాక యు యన్యమొకటి / పుడమిం గలదే॥ ౧౩౨॥ క॥ నేనను
నహము వహించిన । మానవులకు నెల్ల నిక్క / మై తోఁచు నిలన్ । నేనను
నహమే మాయగఁ । గానెడు వాఁడెల్ల మిథ్య / గా భావించున్॥ ౧౩౩॥
క॥ నీవును నేనే లోకము । నీవును నే లేకయున్న / నిర్లోకమగున్ । గా
వున లేకయు దోఁచిన । యీావున నే లేదు సుమ్మి / యీా బయలందున్॥
౧౩౪॥ ఆ—వె॥ నీవు నేనని మొదు / నీ విశ్వమాయను । లేనిదంచు భ్రాంతి /
మానినపుడె । ప్రతియు లేనిబట్ట / బయలన్న నేకమై । యుండు దాని నెఱుఁ

గకనొందు లేక॥ ౧౩౫॥ క॥ సర్వము తానని చూచిన । సర్వంబును దన
నుండా నె సత్యంబగు నా । సర్వంబు తాను మిథ్యయె । సర్వంబును
గానిబయలు జూడనుగనినన్॥ ౧౩౬॥ ఎ॥ ఆ-వె॥ ఎప్పుడైనఁ జూచి
యెఱుఁగకయుండిన । హరినిఁగలనుగాంచి హస్తిమిడియు । కరణి నెఱుక
యనెడు కలలోన నచలంబుఁ । గన్నయపుడె మాయగతముఁ బొందు॥
౧౩౬॥ బి క॥ తోయజ మిత్రునిఁ బొడఁగని । యే యెడలన్ లేక తిమిర
మేగినయటుల న్నాయచలము సేవించిన । మాయే తా నిల్వకేగు
మటుమాయముగన్॥ ౧౩౬ సి॥ తే-గీ॥ అన్నమునుదిన్న నాకఁలియడఁగి
నట్లు । తృష్ణ యుదకంబుఁ గ్రోలినఁ దీఱు భంగి । బయలుఁ జూపించి
శిష్యుని భ్రాంతి మాన్పు । గురుఁడె దైవంబు పరుఁడు నా గురుడె
గురుఁడు॥ ౧౩౬॥ డి॥ క॥ పరిపరి మాయలచేతను । బరిపూర్ణం బెఱుఁగ లేక
భ్రమగొని తామే । చరియింపలేని గురువులు । పరులను గడ తేర్చఁగలరె
భ్రాంతియగాకన్॥ ౧౩౬॥ ఇ॥ ఆ-వె॥ గురుఁడు శిష్యునకును గుర్తుగాఁ
గనుపించి । బయలు బ్రహ్మమంచుఁ బరఁగఁజూపి । మాయ శూన్యమైన
మార్గంబుఁ దెల్పక । భ్రాంతివీడ గలదె బ్రహ్మకైన॥ ౧౩౭॥ క॥ బట్టబయ
లనుచు బ్రహ్మము । గుట్టెఱిఁగిన వాఁడె గురుఁడు గురువులకెల్లన్ । నట్టి
ఘన మర్మ మెఱుఁగక । పొట్టకునై దిరుగువాఁడు భువి గురుఁడగునే॥
౧౩౮॥ ఆ-వె॥ కేవలాత్మ గుర్తు భావింపవేత్తకు । నిలయుఁటన్న గుర్తు
నేమిలేదు । మాయ జనులకెల్ల మాయ విశ్వమె గుర్తు । కోరి చూడ
బయలు గుర్తులేదు॥ ౧౩౯॥ క॥ గురుఁడని శిష్యుఁడని యీ । యెఱు
కను గలదోఁచి యచల మెఱిఁగించి తుద । న్నెఱుకను దెరఁ దొలఁగించిన
గురుఁడేడి శిష్యుడేడి గుర్తేదింకన్॥ ౧౪౦॥ తే-గీ॥ బట్టబయలందు గురు
శిష్యభావములును । నేకమైనను గురుశిష్యు లెవరులేరు । కర్పూరా
గ్నులుః వేర్వేఱఁగానుపించి । యేకమై రెండులేక లయించినట్లు॥ ౧౪౧॥
క॥ అనలంబు పొడమి దారునఁ । దనరంగా దానిఁగాల్చి తాఁ జెడిన
గతిన్ । దనువందు జ్ఞానవహ్నియుఁ । దనువును దగ్ధంబుఁ జేసి తానును
సమయున్॥ ౧౪౨॥ తే-గీ॥ జ్ఞాన మజ్ఞానములు నాది లేనిబయలు । దెలి
యకే జ్ఞాని నేనంచు దిరుగనేల । యచలభావంబు నొందిన యట్టి
వాఁడు । జ్ఞానియునుగాఁడు నరయ నజ్ఞానిగాఁడు॥ ౧౪౩॥ చ॥ పరమ
పదంబుగానకను భ్రాంతిని వీడకయున్న మానవుల్ । సరవి సుషుప్తి
నుండియును జాగ్రత యేగతివచ్చు నాగతిన్ బొరిఁబొరి చావు పుట్టు
వులఁ బొందుచు నుండుదురట్టి గోప్యమున్ । మరణము రాక మున్నెఱుఁ

గుణిమాన్యులె ధన్యులు జన్మశూన్యులున్॥ తే-గీ॥ దేవుఁడే లేఁడటంచును।
దెలివిలేని । పామరులు కొందఱందురు పాటిదప్పి । పరఁగ సర్వంబు మిథ్య
యై బ్రహ్మమెందు । నిండి నిబిడీకృతంబునై నెగడుచుండ॥ ౧౮౫॥ ఆ-వె॥
బ్రహ్మమేడి మాకుఁ బట్టి చూపుఁడియంచుఁ । బరఁగఁ గొందఱండ్రు
పట్టిచూపు నదియు నెల్లమాయ యగుఁ గేవలాత్మను । బట్టిచూప
వశమె బ్రహ్మకైన॥ ౧౮౬॥ ఉ॥ కాయముతోడ స్వప్నమునఁ గన్పడు
దేవుఁడటండ్రు కొందఱున్ । గాయము రాకపోకలును గల్గినమాయయు
దేవుఁడెట్లగున్ । మాయ నెఱుంగ శక్యమౌక । మాడ్కిని నాబయలుండఁ
గానకా । మాయను నమ్మువారలకు మాటికి సమ్మతి మాయ మాట
లున్॥ ౧౮౭॥ ఆ-వె॥ తనువుఁగల దటంచు దైవంబునకు మేను । గల
దటంచు నెట్లు దలంపవచ్చు । దనువులెల్లఁ గర్మ తంత్రంబుచే నయ్యె।
దైవమునకుఁ గర్మ తనువుగలదె॥ ౧౮౮॥ చ॥ కనుఁగొన బ్రహ్మకైన
మఱి గానఁగ రాకయ యుండ దేవుఁడున్ । గనుపడు టెట్లు మర్త్యులకుఁ
గన్పడెనేసియు లోకమేటి కం । చని యిటు కొందఱందు రిలక నజ్ఞులెఱుం
గని కారణంబునన్ । ఘనముగ బూర్వ తత్త్వమును గాంచినవారికి
లోకమున్న దే॥ ౧౮౯॥ క॥ తనువలచినదే రంభగ । ఘనముగఁ దామ
నిఁగినదియె గంగగలోకం । బున ఘనము నెంచరల్పులు । గనుఁగొని
నీచస్వభావ క్రౌంచములట్టుల్॥ ౧౯౦॥ వ॥ అదియెట్లనిన॥ సీ॥ ఒక్కెడ
నంచల నొక కొన్నిఁటిఁగని బకంబు లిట్లని వానిఁ గడసిపల్కె ।
నెవరో కాళ్లు మొగంబు వెల్లనమీనివా సంబెద్దియట విశేషంబు
లెవ్వి । నఁగను నంచలము మా వస సరోవరమున్కి కమనీయరత్న
ముల్ గలవని నను । నత్తలో నావుడు నవి యెఱుంగమఁటన్న-నత్త
లుశూన్యమైనట్టికొలను॥ తే-గీ॥ పర్ణవర్జితమైనట్టి- పాదపంబు । కరణిఁ
దలపోసి చూడంగ గాదె యహహా । యంచు నవ్వంగ సాగెను గొంచ
లెల్ల । నట్లు నిజమును దూషించు నరులు వారి। వారి మతము లెహెచ్చని
వాదుకొంద్రు॥ ౧౯౧॥ ఆ-వె॥ అజునకైన హరునకైన హరికైనను। సురలకైన ధరణి
నరులకైన। గురుఁడులేక దెలియఁగూడునే బ్రహ్మంబు । దెల్ప నెవరికైనఁ
దెలియఁగాక। ౧౯౨॥ క॥ పరిపూర్ణ మెఱిఁగి యెఱుకను । సరిపుచ్చిన
వేత్తె వేత్త జాడ నెఱుంగున్ । గురుతేమి యితర జనులకు । నరయంగా
నాతఁడుండు నండఱివలెనే॥ ౧౯౩॥ ఉ॥ పుట్టును గిట్టు కర్మమున-బొం
దఁడు చెందఁడు నామరూపముల్। గట్టిగ దేవుఁ డెవ్వరికిఁ గానఁగ రాఁ
డనులోకసామ్యమున్ । వట్టిదిగాదు సర్వమును వర్జితమైనదె కేవలాత్మ

యీ । గుట్టునెఱుంగరాదు గురుశ గోప్యముగావున నెంతవారికిన్ ॥౧౫౪॥
క॥ ఎన్నెన్ని చిత్రములకును । నున్నది నేననుచు మాయ శ యుత్తదిబయ
లే । యున్నదని జూడఁ దెలిసిన । నన్నిఁటికిని మూలమైన శ యదిశూన్య
మగున్ ॥౧౫౫॥ చ॥ కరిని తిరూపమారయఁగఁ గన్పడుచున్నను భ్రాంతి
జన్యమై । కరియును గల్పితంబనుచుఁ గాంచినదారువు సత్యమైన యా ।
కరణిని విశ్వరూపమును శ గల్పిత మంచుఁ దలంచి సర్వమున్ । నితరము
పూర్ణ తత్వమిదిశనిక్కమటంచును గాంచఁ గాదగున్ ॥౧౫౬॥ క॥ ఎఱుక
జగంబులు విష్ఫ్యగఁ । బరిపూర్ణం బెసఁగి యెఱుకఁ శ బాపినమీఁద ।
న్నెఱుకేది యెఱుకజాలం । బెఱుకతో సరిపోయె మాయ శ యేమున్న
దిఁకన్ ॥౧౫౭॥ ఆ-వె॥ రూపు నామక్రియలు శ రూఢిగాలేనిది కేవలాత్మ
యంచుఁ శ గీలెఱింగి । నామరూపక్రియలు శ నఖిలంబు మాయగ । నెఱిఁగి
నపుడె భ్రాంతి శ నిరసనంబు ॥౧౫౮॥ చ॥ తిరముగ నామరూపములు శ
దేవునకెన్నఁడు లేవటంచు నే । నెఱింగియు రూపనామములు శ నెల్లనశించు
నటంచు నెంచుచు । న్నరుదుగ నామరూపముల శ యందున భ్రాంతినిఁ
జెందు పామరుల్ । ధరఁ బరిపూర్ణమున్నదని శ తాము నెఱుంగరు మాయ
దక్కఁగన్ ॥౧౫౯॥ తే-గీ॥ తా నెఱుంగని దోసాన శ దైవమిలను । నెవ్వ
రికిఁ గానరాఁడని శ నెంతురెల్ల । గురుఁడు సూచింప బ్రహ్మంబుశ మఱుఁగు
లేక । గానంబడుచుండు నఖిలంబు శ కల్లయగుచు ॥౧౬౦॥ క॥ విని యొ
రులు సెప్ప బయలని । గనియును గనలేరు మాయ శ గప్పియుజనముల్ ।
విని వినియును జెవుడయ్యెను । గనుకనియును గ్రుడ్డియయ్యెఁ శ గానరు
దీనిన్ ॥౧౬౧॥ ఆ-వె॥ సత్యమైన బయలు శ జాడనుగానక । దబ్బరైన
మాయఁబడగులుకొనియు । మాయతోడఁజచ్చి శ మాయతోఁబుట్టుచు ।
మాయఁ గానలేరు శ మాయపరులు ॥౧౬౨॥ క॥ సత్యంబు ముష్టిపండు
న । సత్యం బసత్యకి రుచియుఁ శ జక్కెర భంగిన్ । సత్యంబు జనవిరోధ
ము । సత్యము జనరంజకంబు శ సత్యంబిదియున్ ॥౧౬౩॥ ఆ-వె॥ ఇంతి
నీవు నింక శ నేమాయ లేదని ప్రతియు లేవి బట్ట శ బయలుఁగాంచి । భ్రమ
ను దొట్రుఁజేయ శ భవనాశముల దిద్ద । నావ మునిఁగిపోవు శ నచలవార్ధి ॥
౧౬౪॥ క॥ ఎన్నివిధంబులఁ జెప్పిన । నున్నది యీబట్టబయలు శ నొక్కటి
యెందున్ శ నున్నని దెలియుము విశ్వం । బెన్నఁటికిని భ్రాంతి పుట్ట శ
నేరదు నీకున్ ॥౧౬౫॥ తే-గీ॥ స్వప్నమందునఁ దోఁచిన శ చందముననుశ
లేనిదే జగంబున్నట్లు శ గానంబడును । గాన నఖిలంబు భ్రమయని శ
గాంచి మాయ । భ్రాంతిపిడిన సర్వంబు శ బట్టబయలు ॥౧౬౬॥ చ॥ నెల

వృగ నెండమావులను ౼ నీళ్లనుతేక యెఱుంగఁ బిమ్మటన్ । జలముల
పోల్కిఁ దోఁచినను సత్యముగాదని చూచుకై వడిన్ । వెలయఁగఁ బూర్ణ
తత్వమున ౼ విశ్వము లేదని నిశ్చయించియున్ । గలవలె లోకజాలములు
గన్పడుచున్నను నమ్మరాద్యులున్ ॥౧౭॥ ఆ—వె॥ భ్రమసి లేక తోఁచు ౼
భ్రాంతి యున్నదియచుఁ । బల్కరాదు బట్టబయలునందు । నేమి పుట్టు
చున్న ౼ దేమి పెంపగుచున్న । దేమి పోవుచున్న ౼ దేమి లేదు॥ ౧౮॥
ఆ—వె॥ లేనిమాయయెందు ౼ లేదని చూచిన । నున్న దేమిలేని ౼ యుత్త
బయలె । బయలు నున్నదన్న ౼ భ్రాంతియు లేదాయె । భ్రాంతి లేని
బయలె । బ్రహ్మమాయె॥ ౧౯॥ సీ॥ పరమ రహస్యమే ౼ బట్టబయ
లనియు — సాక్ష్యంబులోనసే ౼ మోక్షమనియు । వచియించు పెద్దల ౼
వాక్యమే సత్యంబు — గానియే నాఫసల్ ౼ గాదు తలఁప । సాగరంబులు
దాఁటి ౼ చనుదెంచుటయుఁగాదు — కొండలు తలకెత్తి ౼ కొనుటగాదు।
భూమిలోనికిఁజొచ్చి ౼ పోవుటయునుగాదు ౼ అంబరంబున కెక్కి ౼ టది
యుఁగాదు । ఇంక నేకష్టములనుగా ౼ దెవ్వరైనఁ । బరమ గురుమూర్తి
కరుణను ౼ బడసిరేని । పరమ సుఖ్యమైనట్టి యూ బట్టబయలు। సాక్ష్మ
మున నుండునది మోక్ష ౼ మాచనంబు॥ ౨౦॥ క॥ లయమైన సర్వ
జగములు । బయలుంచు నటంచుఁ దెలిసి ౼ బ్రహ్మాదిసురల్ । బయలు
నకు మ్రొక్కుచుందురు । బయలే ప్రత్యక్షమైన ౼ బ్రహ్మంబనుచున్॥
౨౧॥ తే—గీ॥ ఎఱుకజేటసుగల్గు నీ ౼ రేసు జగము । లకును కర్తయా
నదియు నె ౼ ఱుకయెగాని । అచల మన నాదు కర్తయు ౼ నచలమునకు।
మొదలె కర్తృత్వ భోక్తృత్వములును లేవు॥ ౨౨॥ క॥ లక్షిత లక్ష్యా
లక్ష్యవి । లక్షణములు బట్టబయల ౼ లమగు గురుకృపచే । లక్షలుగని
శాస్త్రంబులు । లక్షింతురు కర్మవిదులు ౼ లయమగు మాయన్ ॥౨౩॥
క॥ మనమును నిలిపిన వారును । ననువుగ మోక్షంబు లేదఁ ౼ టందురు
యోగుల్ । మనమెట్లు తామునిల్పిరో। మనమును నిల్పంగవశమె ౼ మహి
నెవ్వరికిన్॥ ౨౪॥ తే—గీ॥ గగనభాగంబు గాలిన గలసి మనము। నాదె
వానికిఁ జలనంబు గనఁగు నెట్లు। బయలునందున నిల్పు నెబ్బంగి మనము
నిసుని చెంగటం దెమిరంబు నిలువఁగలదె॥ ౨౫॥ సీ॥ ఈయుత్తబట్టబై ౼
లేమియులేక— ద్వాదశాక్షరినాత్మఁ ౼ దలఁపవలయుఁ। గోప్యమౌ మూలము
లేని గురైశ్రేంగెదు కాయమేమిలేనిపగాలు ౼ నెన్నవలయుఁ । గలలోనఁ
దోఁచిన ౼ కాయమేలాగో యా—లాగె పంచదశాక్ష ౼ రనఁగవలయు ।
మఱువక యీమూడు ౼ మంత్రముల్ నిరతంబు ౼ పఠియించివానితా ౼

త్పర్యములను। దెలిసి మూలంబు లేని దీ ॰ దేహమనుచు। భ్రాంతివీడియు సర్వంబు ॰ బయలటంచు। నెఱిఁగియెంతయు నెఱిఁగిన ॰ యెఱుకవిడుచు। నట్టివారలె యశరీరు ॰ లనఁగవలయు॥ ౧౭౬॥ ఆ-వె॥ నెలఁత వినుము యింక ॰ నీ స్వస్వరూపంబు। బట్టబయలుగాని ॰ భ్రాంతిచేత। వెలయఁ దోఁచుచుండు ॰ విశ్వరూపంబైన। మాయ నీవుగావు ॰ మధురవాణి॥ ౧౭౭॥ క॥ పరిపూర్ణంబే నేనని। యెఱిఁగియు నీ దేహమాత్రయేఁ గానుచుఁ। బరికింపుము నీకన్యము। మఱియేమియు లేదఖిలము ॰ మాయ తలంపన్॥ ఆ-వె॥ భ్రాంతిలేని బట్ట ॰ బయలైన నీకును। బ్రాణ మరయ లేదు ॰ బ్రతుకు లేదు। బ్రతుకు లేని నీకుఁ ॰ బరఁగఁ జావును లేదు। చావు లేని నీకు ॰ జన్మ లేదు॥ ౧౭౯॥ క॥ జననంబు లేని నీకును। మనమాత్మయుఁ గల్గదెటుఁక ॰ మఱపులు దేహం। బును లేదు కష్టసుఖముల। యనుభవమును గల్గదెటుఁగ ॰ వఖిలము నీవున్ ౧౮౦॥ ఆ-వె॥ దేహియుండెనేని ॰ దేహంబునుండును। దేహముండెనేని ॰ తెల్వియుండు। దెల్వియుండెనేని ॰ తిరిగిచావునునుండుఁ। జావుగలిగెనేని ॰ జన్మముండు॥ ౧౮౧॥ ఏమియుఁగాకయు బయలును। నేమియు ననరాకయుండు ॰ నీయందెవుడు। న్నేమిమిపుట్టుచున్నదో। యేమేమియునాశమానో ॰ యెఱుఁగవు నీవున్॥ ౧౮౨॥ ఆ-వె॥ ఎఱుక నేనటంచు ॰ నెన్నకు మఱుకచే। నెఱిఁగి కేవలాత్మ ॰ యేయటంచు। నెఱుఁగు నెఱుక నాకు ॰ గురుదక్షిణగనిప్పు। డిమ్ము తడవు లేక ॰ యిందువదన॥ ౧౮౩ క॥ గురునకు నొసఁగిన యెఱుకను। మఱల నుగైకొనఁగఁ బోకు ॰ మదియేదలఁపన్। గురుదోషమంచుఁ దెలియుము। యెఱుకనుసరిపుచ్చి పిదప। నెఱుకైయున్నన్॥ ౧౮౪॥ ఆ-వె॥ కలనువట్టిదంచుఁ ॰ గాంచినఁమీఁదట। ననుభవములుదబ్బ ॰ రైనయట్టు। లెఱుక లేనిదంచు ॰ నెఱిఁగినపిమ్మట। నెఱుకచేష్టలెల్ల ॰ నిక్కమగునె॥ ౧౮౫॥ క॥ ఎఱుకను జాలము మృషయని। యెఱుఁగక నిక్కంబుగాఁగ ॰ నెంచెదరజ్ఞుల్। ఎఱుకనఁగ మాయగావున। నెఱుకెప్పుడు లేనిదంచు ॰ నెంచుము నీవున్॥ ౧౮౬॥ తే-గీ॥ పరగఁగొండఱుపరిపూర్ణభావమెఱిఁగి। యెఱుక విడువక యేముండు ॰ రెప్పటట్టు। లెఱుక విడువక పరిపూర్ణ ॰ మెఱిఁగియున్న। నేమి కార్యంబు వారలు ॰ నెఱుకవారె॥ ౧౮౭॥ క॥ ఎఱుకనఁగ స్వప్నమంచును। నెఱిఁగి ప్రవర్తించునదియె ॰ యెఱుక విడుచుటౌ। నెఱుక పనులెల్ల విడమని ॰ గురు తెలుఁగుటె యెఱుక విడువ ॰ కుండుట యరయన్॥ ౧౮౮॥ సీ॥ కలలోనఁదోఁచిన ॰ కాయంబులకు నీ తనువులకును నెచ్చు ॰ తగ్గుగలదె। వాని నెవ్వరుగాంచు ॰ వచ్చిరి మఱలను –

నెవ్వరుగొనిపోయి రేమిలేదు । తనకుఁదా మేవచ్చి తనకుఁదామే
దోఁచి - తనకుఁదా మేలేదు దలఁచిచూడ । నిజముగా నాలేదు నిజము
గాఁబోలేదు - సర్వంబుభ్రాంతిచే సంభవించెఁ । గాన నీకును దేహంబు
గానిమెఱుక । గాని యింద్రియములు గాని గలవఁటంచు । నెన్నుదై
నను భ్రమఁజెంది యెంచవలవ । దట్టులెంచుటె స్వప్నంబు నగుఁదలంప॥
౧౮౯॥ ఉ॥ కొండలమండనేల యిఁకఁ గోమలిచించిన పెన్కపత్రము ।
న్నెందుననున్న బాధ్యునకు నేమిభయంబును లేనిపోలికన్ । ముందు
గురూక్తిచే నెఱుక మూలము ద్రుంచినవాఁడుజన్మముల్ । బొందెడ
నంచు సందియముఁ బొందునె యెందున నైన నెన్నఁడున్ ॥ ౧౯౦॥ ఆ-వె॥
తానునుండుటయును దానులేకుండుట । నవనిఁదనదువర్తనంబులాది।
లేనికలయటంచుఁ గానకకలనుండు । మనుజుఁడొందు జనన మరణ
ములను॥ ౧౯౧॥ క॥ కలయందెపుట్టిపెరుగును। గలయందే యనుభవించుఁ
గష్టసుఖంబుల్ । కలయందెనాశమొందును । గలఁబాసిన జన్మమేది
కలయేదింకన్॥ ౧౯౨॥ సీ॥ కలలోనఁదాఁబుణ్యకథలెల్లవిన్నట్లు-వివిధ
తీర్థములుసేవించినట్లు । యజ్ఞాదివ్రతములనాచరించిన యట్లు -
చెలఁగిదానములెల్ల జేసినట్లు । సకలసత్పుణ్యముల్ సల్పియుస్వర్గాది-
భోగంబులనుదాను బొందినట్లు । తిరిగిపుట్టిపాపు నేకనదలఁ జంపినయట్లు-
మించియన్యులతోర ।మించినట్లు॥ తే-గీ॥ కోరి పరవిత్తములు చాలఁగొన్న
మాడ్కి । నఖిలపాపంబు లొనరించి నరకలోక । మనుభవించిన
యట్లుండి మగుడిమేల్కఁ । వడసి చూడంగ సర్వంబు వట్టిదయ్యె॥
౧౯౩॥ క॥ కలయే సత్కర్మంబును । కలయే దుష్కర్మమగును గావున
నెఱుకే।కలయని మేల్కానువారికిఁ । గలయనుభవమెట్లుదోఁచ గలదా
మీఁదన్॥ ౧౯౪॥ ఆ-వె॥ ఎఱుక యున్నవఱకు మఱపును । నుండును
మఱవు గలుగువఱకు నెఱుకయుండు । నెఱుకయనెడుజ్ఞప్తి యెప్పుడు
దోఁచిన । నదియు లేనిదంచు నరయుమీవు॥ ౧౯౫॥ క॥ కలలేనిది
జాగ్రతయును । గలదని భావించువాఁడె కలమనుజుండున్ । గలవంటిదె
జాగ్రతయని । దలపోసినయతఁడె కలను దాఁటినఘనుఁడౌ॥ ౧౯౬॥ క॥
కలదనిచూడకుమెఱుకను గలదనిచేయకుమ యెట్టి కార్యములింకన్।
గలదని దలఁచకు సర్వము । కలయని భావింపజన్మ గలుగదు నీకున్॥
౧౯౭॥ సీ॥ ఎఱుకయేస్వప్నమూ యెఱుకయేజాగ్రత - యెఱుకలే
కున్నను నేమిలేదు । స్వప్నంబుచిన్నది బద్ధంబుసర్వప్రపంచంబు
పెద్దయు బద్ధమయ్యె । జాగరంబును లేదు స్వప్నమేమియు లేదు-నిద్రఁ

బోవుటలేదు నిర్ణయములు। సేయుటయును లేదు చిత్తవృత్తియెగాని-
యంటువింటయుఁగంట కింటలేదు॥ తే-గీ॥ బంధమోక్షములును లేదు
భవము లేదు నాశములు లేదు సంసార నటన గల్గ। దరయ నెఱుక
యుఁగా గలలోన జీవుల నెరు। జాగ్రతనుగన్న యశరీర జన్మలనను॥
౧౯౯॥ క॥ వేదాంతమునఁగ నేమని। వాదింతురు కొందఱెపుడు వసుదనల
చతు। ర్వేదాతీతంబగుటను। వేదాంతంబనుచు బుధులు వీక్షింతు
రొగిన్॥ ౨౦౦॥ క॥ వీక్షించి కాంచనందని। విక్షేపమునై నరోయ నేత్ర
దుమాఘుల్। ద్రాక్షఫలంబులుదినుటక। పేక్షించిన జంబుకందువిధము
దలంపన్॥ ౨౦౧॥ వ॥ అదియెట్టిదనిన॥ సీ॥ నక్కయొక్కటి మూడు నాళ్ల
నాహారంబు - చిక్కకనాఁకట సొక్కిచనుచు। నటగో స్తనీలతలల్లి
బిల్లిగనల్లి - పండ్కైవ్రాలిన ఫలములరసి। యాఫలంబులుదింపనని
హస్తమునవాని - నందుకోఁబో నవియందకున్న। నపుడు తానెన్ని
యు త్నములు గాంచిన - నవి లభింపమిఁజేసి యాత్మవిసిగి॥ తే-గీ॥
పరఁగనీపండ్లు దిన్న నా పండ్లుపులియు। నంచునొక సొడ్డుపెఁబెట్టి
యరిగెనట్లు। లచల భావంబు లోకులు నందలేని। కతనఁజుల్కగఁ
జూతురు గాదెజగతి॥ ౨౦౧॥ చ॥ జనన వినాశశూన్యమును సర్వము
మీఱినపూర్ణభావమున్। ఘనములులాత్మమెచ్చెదరు గాకను నల్పులు
మెచ్చనేర్తురే। వనజవిరోధి రాకకును వారిధులే చెలరేగుఁగూపముల్।
దొనలుకొలంకు లేఱులును దుచ్ఛపుఁగాల్వలుఁ బొంగనేర్చునే॥ ౨౦౨॥
చ॥ హరి కరికుంభముల్ చిదుప నాటవి రాలిన దంతమౌక్తికా।
లెఱుకలుగూర్చి పేదలుగ నెంతయుఁదాల్తురుశుక్తిముత్యము। ల్లెఱుఁ
గరువాని వీనికిని। నింతకుఁగల్గిన తారతమ్యముల్। సారిది నిజస్వభా
వమును సుస్మృత భావముగాన లేరొగిన్॥ ౨౦౩॥ తే-గీ॥ అరయనే
భ్రాంతిలేనిదీ యచలమార్గ। మునకుమించిన దేలోక మునను లేదు।
నిదురవచ్చెడివఱకును నీవుచచ్చు। వఱకు దీనిని నీమది మఱవకుండు॥
౨౦౪॥ క॥ ఏవంక మనముపాఱిన। నావంకకునింద్రియంబు లన్నియు
నేగున్। గావున సద్గోష్ఠినిమన। సేవిధమునన్నైనఁజొరఁగఁ జేయఁగవల
యున్॥ ౨౦౫॥ క॥ ఇది యో పరమ రహస్యం। బిదిసత్యము నమ్మినంశ
యింపకుమిఁక నా। హృదయమున నింతకంటెను। గుదురగు మార్గంబు
లేదు గురుసాక్షి సతీ॥ ౨౦౬॥ ఆ-వె॥ ఇదియు బ్రహ్మవలన నెఱిఁగె
వసిష్ఠుండు అతనివలన జనకుఁ డతనివలన। శుకుఁడు శుకునివలన సారది
సాందీపులు। గనియెనతనివలనఁ గంటినేను॥ ౨౦౭॥ క॥ పరిపూర్ణ మెఱుఁగ

మునులకు । సురలకుదుర్లభము నీకు సూటిపఱిచితిఁ । వర నృగు
దూర్వాసులకును । దిరముగ నుద్ధవునకేను దెల్పితినిదియుఁ॥ ౨౦౮॥
ఆ-వె॥ పరమపదమునందు భ్రమయందరికిఁగల । దంచుఁజేరవశమె
యందఱికినిఁ । గలయ నచలగురుని కరుణకెన్యంబగు । వాంఛలేక
యుండు వారుదక్క॥ ౨౦౯॥ శా॥ ఏమార్గంబులు దొంగత్రోవల
రయుఁ హేయంబులౌవానిచే । సామాన్యంబగుఁదప్పిపోపుభవముల్
సంకెళ్లుగా నేర్పడుఁ । రామాదీనిని నమ్మిన జన్మమునకుఁ రారెవ్వ
రుఁగావున । న్నేమార్గంబులుసాటిగావుధరలోకనిరాజమార్గంబుతోఁ॥
౨౧౦॥ ఆ-వె॥ అనుచుఁదెల్పుశౌరి యదుగుదమ్ములకును । మ్రొక్కి
హస్తములను మొగిచి నిలిచి । కాంత రుక్మిణియును ఘనమైన
భక్తితో । దేవదేవుసన్నుతించెనట్లు॥ ౨౧౧॥ దండకము॥ శ్రీవాసుదేవాయ
చింతస్వభావాపర బ్రహ్మనిష్ఠామ సర్వేంద్రియాతీత సంసార తాపత్ర
యాభంగనిస్సంగనిర్మోహనిష్కర్మనిత్యాత్మ భక్తాంబుజవ్రాత మార్తాం
డసర్వప్రభూతాంతరాత్మా చిదాత్మాపరాత్మా పరంజ్యోతి రూపపరే
శాపరంధామసద్రూపచిద్రూప లక్షావిలక్షాక్ష రాండాండ పిండాండ బ్ర
హ్మాండ భాండోదరా సర్వసంపూర్ణ సర్వజ్ఞ సర్వేశసర్వోత్తమా సత్య
సంకల్ప సద్వేదవేదాంత సిద్ధాంత శ్రీశౌనకాగస్త్య కౌండిన్యమైత్రేయ
వాసిష్ఠ వాల్మీకకణ్వాత్రి గార్గేయ శ్రీనారద వ్యాస శ్రీవత్స మార్కండ
మాండవ్య శాండిల్య నానా మునిస్తోమ హృత్పద్మ సంధానరూపా నిరా
కారనిర్వేద్య నీరంధ్రనిర్బంధ నిర్ముక్తనిష్కార్య మానావమానావిహీ
నాత్మతద్భూతపంచ ప్రపంచాది శూన్యా భవన్నాశ హీనాపరః కేవ
లాత్మా భవద్దివ్యరూపంబవాచ్యం బవేద్యం బసాధ్యం బచోద్యంబభేద్యం
బబాధ్యం బశోధ్యంబవిశ్వం బరూపం బనంతం బచింత్యం బవర్ణంబనాశా
రమాద్యంత రాహిత్యమైయొప్పు నీరూపుబ్రహ్మాది దేవేంద్రబృందారకుల్
గూడ,గీర్తింపలేరయ్య నీమూర్తిగీర్తింప నేనెంతదానన్భవద్దివ్యమాసత్
కృపా వీక్షముంజేసి నీ స్వస్వరూపంబు నా స్వస్వరూపంబు గాఁగంటి
మేల్కంటి స్వప్నాభవిశ్వాది భ్రాంతుల్ సమస్తంబున న్బాసిపోనయ్యె
నే వేళనుఁ నొక్కరీతిఁగనుఁ నిర్గుణంబెందు నేకంబుగానుండు నీబట్టబై
లందు నేభ్రాంతియుఁ లేదు నా స్వస్వరూపంబు పూర్ణాచలం బౌటనేఁ
గంటి నాకల్మషాల్ పాఱెనాశంకయుఁ దీఱెనా భ్రాంతిపోకారెనాయిష్ట
మొప్పారె నానోము ప్రాప్తించె నాజన్మ మీడేరె ధన్యత్వముఁ గంటి
నుంతైననాకుఁ గొఱంతేమియుఁ లేదు శ్రీకృష్ణదేవా నమస్తేనమస్తేనమ

స్తేనమః॥ ౨౧౨॥ క॥ అని యిట్లు వేడుసతిఁగని । వనజోదరుఁడప్పుడధిక వాత్సల్యమునన్ । వనజాక్షిని దీవించెను । ఘనముగ వరములను జన్మరహిత మగునీ కనుచున్॥ ౨౧౩॥ తే-గీ॥ దీవనయుఁగాంచి రుక్మిణీ దేవిచక్రి। పాదసేవ యొనర్చి భక్తిపరముఁ। దెలియ గురుశిష్య ధర్మంబుఁ దెల్పు మనిన । నింతిఁ గనుఁగొని కంసారియిట్టులనియె॥ ౨౧౪॥ చ॥ గురుఁడరుదేర మ్రొక్కకయె కూరుచుండఁగరాదు శిష్యుఁడున్ । గురుఁడను దానునేకముగఁ గూడిపరుండఁగరాదు శయ్యపై । గురునకు మున్ను తానుగను కూర్కఁగరాదు భుజింపరాదు మో । గుఱియును దప్పరాదితర గర్వ్యలజేరఁగరాదు భక్తుఁడున్॥ ౨౧౫॥ చ॥ పరమునుజూపు నా గురుఁడు బంధుగుఁడైన హితుండునైనఁదా। నరయఁగ దమ్ముఁడైనఁ దనజనకుఁడైన మితంగుఁడైనఁ బో। నర సఖిసోదరాత్మజులు నాకనునీచుఁడు నాఁగ నలక్ష్యముంచకన్ । గురుడె పరాత్పరుండనుచుఁ గొల్వక ముక్తుఁడుగాఁడు భక్తుఁడున్॥ ౨౧౬॥ ఆ-వె॥ జననియు జనకుండు సకల ఋణంబులు । పరముఁగన్నయపుడె పాసిపోవు నట్టి పరముఁదెల్పు నట్టి యాగురుసేవఁ । జేయకున్న ఋణముఁ బాయరాదు॥ ౨౧౭॥ క॥ గురుకరుణావడసి నిరతము । మఱిమఱి యాపరమునందె మదినిల్ప నగున్ । గురుభక్తిలేకయుండిన । నరునకు దూరంబు ముక్తి నళినదళాక్షి॥ ౨౧౮॥ ఆ-వె॥ గురుఁడు దెలిసినంత యెఱిఁగితి గురుఁడు నా । కెక్కు వేమియంచునిక్కరాదు। యిసుగుకీటువిడచి యామీఁదగోడను బెట్టి నిల్పఁగలరె దిట్టలైన॥ ౨౧౯॥ క॥ పరమునకంటెను దెల్పినఁ గురుఁడే యధికుండుగాన గురుభక్తుండున్। గురుఁడే బ్రహ్మయువిష్ణువు। గురుఁడే శివుఁ డింద్రుఁడంచుఁ గొల్వంగవలయున్॥ ౨౨౦॥ ఆ-వె॥ వెలఁదిపరులుదూఱ వినరాదు గురునిఁ దా । దూఱరాదు ఆజ్ఞ మీఱరాదు । గురుఁడు మదినినొప్ప కుండునదెద్దియుఁ । జేయరాదు మంచి శిష్యుఁడైన॥ ౨౨౧॥ చ॥ గురుఁడు ననుగ్రహం బొసఁగఁ గోరినకాలముఁ బుచ్చరాదు స।త్వరగతినీయకుండిననుదత్తర బెట్టఁగరాదు సూగురుం। డిరవుగ బోధఁ జేయునెడ నెంతటి కార్యములున్నఁబోవరా।దరయఁగఁ దెల్పకుండిననునాతని నొక్కఁగరాదు శిష్యుఁడున్॥ ౨౨౨॥ ఆ-వె॥ వెలయనితరమైన వేడుకలెవ్వియుఁ।గోరిచేయరాదు గురునియింట । మంచ మెక్కరాదు మద్యపానంబాది । కృత్యములను జేయఁ గూడదెపుడు॥ ౨౨౩॥ క॥ గురుఁడుండు నాశ్రమమునకుఁ । గరితురముగ లెక్కపోకఁ గారాదెపుడున్।వరభక్తిపాదచారిగ । నరుగంగావలయు శిష్యుఁడతివిన

యమునఁ॥ ౨౨౪॥ ఆ-వె॥ పరఁగ ధరణికెల్లఁ బ్రభువు తానైనను। దన
బ్రభుత్వ మేమి తనదు గురుని। యెదుటఁ జూపఁగదగ దెంతవాఁడై
నను। గురుని భృత్యు పగిదిఁ గొల్వవలయు॥ ౨౨౫॥ క॥ గురుమూర్తికిఁ
గనుపించక। మఱుఁగంగా దుద్రాంగ మార్గములందుఁ। మఱికపట
వినయభక్తులు। గురునకు నొనరింపరాదు గురుభక్తుండుఁ॥ ౨౨౬॥
ఆ-వె॥ ఒనరఁ గురుఁడు తనకు నొసఁగు ప్రసాదంబు। నెవ్వరికిని దాను
నీయఁదగదు। తాను గుడువవలయుఁ దనకు మహాప్రసా। దంబుగాఁగ
శిష్యుఁ డాదరమున॥ ౨౨౭॥ క॥ గురుఁ డొసఁగిన తృణమైనను। బరమధ
నంబది యటంచు భావింపఁదగుఁ। గురుఁ డీయకున్న నెద్దియుఁ। బర
గంగా ముట్టరాదు భక్తుం డెపుడుఁ॥ ౨౨౮॥ ఆ-వె॥ గురునిఁ బాసి యొంటిఁ
గూర్చుండఁగా రాదు। అజ్ఞ చేయఁగఁదగ దరయ గురుని। మోసపుచ్చ
రాదు గాసి పెట్టఁగరాదు। ప్రజ్ఞ దెల్ప రాదు భక్తుఁడు బల॥ ౨౨౯॥ క॥
గురువును నేరము లెన్నడు। నరపశువును భక్తుఁడనఁగ న్యాయంబగునే।
గురుఁడే దైవంబనుచును। స్థిరముగ సేవించువాఁడె శిష్యుఁడుగాకన్॥
౨౩౦॥ ఆ-వె॥ కల్లలాడరాదు గర్వించి గురునితో। నెదిరిపల్కుట
దగ దెన్నఁటికిని। బగను బూనరాదు భక్తుని దండించి। గురుఁడు గీ
ము వెడలఁగొట్టెనేని॥ ౨౩౧॥ క॥ గురునకు సరియగు దైవము। ధరణి
నిఁ గనుఁగన్న తల్లిదండ్రులు మనుజుల్। వరబంధు జనములాప్తులు। పరమా
త్ముఁడు గాదు కాదు। పరమపదంబుఁ॥ ౨౩౨॥ తే-గీ॥ కులమునభిమాన
మును లజ్జ గలిగి గురుని। చెంతవర్తింపఁగఁదగదు శిష్యునకును। కులము
నభిమానమును సిగ్గుఁ గూలఁబెట్టి। సల్పదగు సేవకింకరు చందము
నను ౨౩౩ క॥ ఇల సర్వతీర్థయాత్రలు। పలుమఱు సేవించి నంత ఫలము
వరుసకుఁ। గలుగును సద్గురుమూర్తినిఁ। దలఁపగా నొక్కమాఱు
దర్శించుటచేఁ॥ ౨౩౪॥ తే-గీ॥ ఘనతరంబుగ భయభక్తిఁ గల్గి గురుని।
పాదుకాసన శయ్యల భక్తుఁడేమి। వందనంబులుఁ గావింప వలయుఁ
గాని। పాదములఁ వానిఁ దగుల్ప రాదెపుడును॥ ౨౩౫॥ క॥ గురుఁడును
బోవుచునుండఁగ। గురు వెనుకనె పోవవలయు గురుభక్తుఁడుఁ। గురు
నీడఁ ద్రొక్కుచున్నట। నరుఁగఁదగదు భక్తుండెంతయు ధన్యుండైనఁ॥ ౨౩౬॥
ఆ-వె॥ ఆసనములు శయ్య లంబరభూషణ। వాహనంబు లాదివస్తు
వులను। భక్తి నొసఁగవలయు భక్తుండు గురునకుఁ। జిత్తము సంతో
షించునట్లు॥ ౨౩౭॥ క॥ మఱి దేహమున్న వఱకును। స్మరియింపుచు
నుండవలయు సద్గురుమూర్తిన్। దురితపు వర్తనుఁడైనను। గురునకు

లోభంబుఁ జేయఁ గూడ దెదియునన్॥ ౨౩౭॥ ఆ-వె॥ పరమగురుని
స్వామి ప్రభువు దేవ యంచును । జేరిపిల్వవలయు శిష్యుఁ డెపుడు। నరుఁ
డటంచు నెంచి వదలనందఁ జీవ లెఁ। పేరుపెట్టి తాను బిల్వఁదగదు॥ ౨౩౮॥
క॥ గురువును గురుమంత్రంబును । మఱచియు గురునిందఁ జేయు మంద
జనుండున్ । తరణిసుధాకరులుండెడుఁ । వఱకును యమలోకమందు వాస
ముఁ జేయున్॥ ౨౩౯॥ ఆ-వె॥ గురునివలనఁ బరము గుర్తుగాఁ దెలిసిన।
గురుఁడు శిష్యునందుఁ గూర్మి లేక । గాంచరాదు ముక్తి గావున భ
క్తుండు । గురుని ప్రేమరాగఁ గొల్వవలయు॥ ౨౪౦॥ క॥ గురునాజ్ఞఁ
బొందని దెశా । గురువైభవి శిష్యజనులఁ గూర్చియు బహుగా। గురు
బోధఁ దెల్పువాఁడె । గురువంచకుఁ డనఁగ బరఁగుఁ గుంభినిలోనన్॥
౨౪౧॥ తే-గీ॥ చెలఁగి సద్గురుసేవయుఁ జేయుటెట్టు । లనిన స్థానాంగ
భావాత్మ లనగఁ నాల్గు । విధములైన శుశ్రూషల వేసరకను। జేయ
వలయును భక్తుండు చెలువుమీఱ॥ ౨౪౨॥ క॥ హరిగిరిజర దిక్పాలక। సరసి
జగర్భాదులిచ్చు శాపములైనన్ । గురుమూర్తి దీర్ప । జాలును। గురు
శాపము మాన్ప లేరు కుంభిని నెవరున్॥ ౨౪౩॥ ఆ-వె॥ గురుఁడు తన్ను
మిగులఁ । గొట్టి తిట్టుటెల్ల । తన్ను రక్షఁ జేయఁ దలఁచిగాని। శిష్యుల
వలన దాను సిద్ధిఁ బొందుటకునై। గాకతనిని జెఱుపఁ గాదు చూవె॥
౨౪౪॥ క॥ శిక్షింపఁ దలఁచువాఁడే। శిక్షించు భయంబుఁ జెప్పి చేయిం
చుఁ బనుల్ । రక్షింపఁ దలఁపకుండిన । శిక్షింపఁడు పేరుఁ జేసి చెప్పండె
దియున్॥ ౨౪౫॥ ఆ-వె॥ మధువు వలయు నతఁడు మధుమక్షికములకు।
జెడిసి పాఱ మధువుఁ బడయుఁ డట్లు । గురుఁడు శిష్యవరునిఁ గొట్టిన ది
ట్టిన నోర్చి బోధఁ గొనుట యొప్పు ధాత్రి॥ ౨౪౬॥ సీ॥ అలకాశియాదిగా
నఖిలతీర్థములకు - గురుపాదతీర్థమే గొప్పగాఁగ । పరస్వర్గకైలాస
వైకుంఠముల కంటె- గురుపాలయమె మహా గొప్పగాఁగ । హరిహర
బ్రహ్మాది సురసంఘముల కంటె- గురుమూర్తియే మహా గొప్పగాఁగ।
ధర సమస్త ప్రసాదంబుల కంటెను- గురు సుప్రసాదమే గొప్పగాఁగ ।
పరమ గురుమూర్తి సేవించు భక్తునకును । బదవు లేటికి మూర్తుల
భ్రాంతియేల । సకల తీర్థంబు లేటికి జన్మఁ దెచ్చు । జన్మ రహితంబు
గురుపద సంభవంబు॥ ౨౪౭॥ క॥ గురుపాద తీర్థమునకును। సరి వేయవ
పాలుగాదు జగతి సకలసా।గర పర్యంతము గల్గిన। వర తీర్థము లందుఁ
గ్రుంకు వలని ఫలంబున్॥ ౨౪౮॥ చ॥ విడువగవచ్చు రాజ్యమును విత్త
ము గేహము బంధువర్గమున్ । విడువఁగవచ్చు సోదరుల వేగ మొయా

ప్రులఁ దల్లిదండ్రులన్ । విడువఁగవచ్చు సౌఖ్యమును ¶ వేడ్కఁ జెలంగఁగ
నాలుబిడ్డలన్ । విడువఁగవచ్చుఁ బ్రాణమును ¶ వీడఁగరాదిల భక్తిమార్గ
మున్॥ ౨౫౦॥ చ॥ సతిగుఱి గల్గు దూరమునఁ ¶ జందన వృక్షములున్న
వానిపై క్షితినవె వంటకట్టియలు ¶ సేతురు చేరువనున్న యటుగన్।సత
తము నింట నుండినను ¶ చౌకదనంబు బుధాళి కెంతయున్ । హితవుగ
గొప్పపూజ్యత వ ¶ హింతురు దూరమునందునుండినన్॥ ౨౫౧॥ఆ-వె॥
అనుడు సద్గురూత్తమునియందు భక్తియు।నార యెంతయొప్పనను చు
నాత్మ । నెన్నికొనుచు మిగుల ¶ నీగ్రంథ ఫలమును ¶ జెప్పుమనినఁజక్రి
చెలియఁజూచి॥ ౨౫౨॥ క॥ ఎఱిఁగితివి యెఱుఁగ గలిగిన ¶ పరమార్థంబైన
నూత్మ ¶ భావములెల్లన్ । గొఱఁతయ్యేనేమొవినుమిఁక । నెఱిఁగించెద
గ్రంథ ఫలము ¶ నిందునిభాస్యా॥ ౨౫౩॥ ఆ-వె॥ భక్తిఁదెల్పుచోట ముక్తి
మార్గమునుందు ; ముక్తి దెల్పుచోట ¶ భక్తియుండు । భక్తిముక్తిదె
లియఁ ¶ బడనిగ్రంథంబులు చదువనేల పెక్కు ¶ చదువులెల్ల॥ ౨౫౪॥
సీ॥ సతిమనయిరువుర ¶ సంవాదరూపమా - నీమోక్షగ్రంథంబు ¶ నింపు
మీఱఁ । జదివి వ్రాసినవిన్న ¶ జనులకు సుగుణంబు - లాయు రారో
గ్యంబు ¶ లతిశయిల్లు । నిష్టంబులీడేరు ¶ నిఖిలాఘ చయములు-పాయు
సంకటములు ¶ వాసిపోవు । పుత్ర పౌత్రాద్యష్టభోగముల్ చేకూఱు-
దారిద్ర్యరుగ్నతల్ ¶ దొలఁగుఁదుదకుఁ॥ తే-గీ॥ బుణ్యలోకంబులొందు
దుర్ ¶ పొలుపుమీఱ । దేశికుని కృత మర్మంబుఁ ¶ దెలిసిదీని । యను
భవంబును దెలిసిన ¶ యట్టివారు । ముక్తులగుదు రెవ్వారైన ¶ మోహ
నాంగి॥ ౨౫౫॥ క॥ ఎందాఁకఁ బంచభూతము । లెందాఁక నగాబ్ధితారక
లినశశిజగముల్ । ఎందాఁకనుండు నీకథ । యందాఁకిలఁ జెలుగుఁగాత
మార్యస్తుతమై॥ ౨౫౬॥ చ॥ అనవుడు భక్తముక్తులనునానందఁగఁజేయుట
మీకటాక్షమా । ననిమది నెంతునీవరయ ¶ నాకువిభుండవు సద్గురుం
డవై । ననుగురుబోధ దేర్చుటకు ¶ నాదగు భాగ్యము గాదె దేవకి।తనయ
విముక్తిఁ జేయ నను ¶ ధారుణి మీరలు పుట్టుటెంతయున్॥ ౨౫౭॥ క॥
పరహితము సేయునదులును । బరహిత మొనరించునభ్ర ¶ పాదపతతు
లా । కరణిని నీలోకంబుల । బరహితమే యాచరించు ప్రాజ్ఞులుమీరల్॥
ఎ॥ క॥ అని వినుతించుచు రుక్మిణి । తననాథునిఁగొల్చి భక్తిఁ ¶ దప్పక
పూజల్ । ఒనరించుచు సేవించుచు ; ననుపమ మోదాబ్ధి వాలిలాడెడి
వేళన్॥ ౨౫౯॥ సీ॥ తరుణివిడిదికేగు ¶ తఱిఁజెప్పవచ్చిన - చొప్పున వే
కువఁజక్కఁబాడిచె । బడఁతికి దేహాది ¶ భ్రమలూడెననుభంగిఁ-గలువ

లంతంతఁ జొక్కముగ ముడిచె । ముదిత కజ్ఞానాంధ మును విచ్చి చనె
నను భాతినంతంతకుఁ బాసెఁ దమము । రమణికి గుణవికారము లెల్ల
డిందిన - సరణి చుక్కల విలాసంబు మాసె॥ తే-గీ॥ జ్ఞాననేత్రంబు విక
సించె చానకనిన । గతినిఁ దామర లెల్ల వికాసమొందె । నాతిజన్మంబు
తెలవాఱెనని పోల్కి । దినకరుండును బొడిచెఁ బ్రాగ్దిక్కునందు॥ క॥
అంతటఁ బతియాజ్ఞను దన । యంతఃపురమునకు నేగి యనయము సతిబల్
వింతగ సముచితకృత్యము । లెంతయు సల్పుచును భక్తి నేమఱకుండెన్॥
౨౬౦॥ క॥ వేదాంతవేద్యనామా । వాదభేదాంతధీమ వర్జితకామా।
ఖేదామోదాంతసీమా । నాదద్రూపాంతసీమ నామవిరామా॥ ౨౬౧॥
మాలిని॥ భ్రమచయలయయుక్తా భావ విశ్వాతిరిక్తా । యమరనికర
మాన్యా యాదిమధ్యాంతశూన్యా । నిమిషవిజితపాపా నిర్గుణానంత
రూపా । సమహితకులదూరా సర్వహీనావికారా॥ ౨౬౨॥ క॥ మంగ
ళము పరమగురునకు । మంగళము చిదాత్మునకును మంగళము భవా।
భంగవిగతునకు స్థిరునకు । మంగళమజరుద్రవినుత మగుబయలునకున్॥

గద్య॥ ఇది పోలకం - లక్ష్మీనృసింహార్యపుత్ర, సాధుజనమిత్ర
నారసింహ నామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీ
సంవాదంబను - సుజ్ఞాన శాస్త్రంబునందు
సర్వంబును బంచమాశ్వాసము.

స్వస్తి.



# పంచపాదిసీసము.

మంగళగిరితూర్పు । మఱియిప్పటములోని -
దైనమల్లెంపూడి । యనెడువీట
ఘనుఁడు బొమ్మారెడ్డి । కన్నయవరగర్భ -
జనితుఁడై సత్పుణ్య । చరితుఁడగుచు
నలపెదకోటయ్య । యనునామమున గ్రామ -
మునసబు నధికార । మును వహించి
జనులెల్లసద్ధర్ముఁ । డనఁగ న్యాయాన్యాయ -
ములనగణించి తీ । ర్పులు నొనర్ప
సజ్జనోత్తముఁడంచు । సర్కారు జనములు -
ప్రస్తుతింప మెలఁగు । భవ్యమూర్తి

తే-గీ॥ రుక్మిణీ కృష్ణ సంవాద । రూపమగుచుఁ
బరఁగు నీమోక్ష గ్రంథంబుఁ । బ్రౌఢిమెఱయ
ధనసహాయంబు వలనను । ధర్మరీతి
నచ్చువేయించె బుధజనుల్ । మెచ్చ మొదట,

సీ॥ అస్మద్గురుఁడగుచు । నలరు శ్రీపోకల - శేషాచలార్యులు ।
జ్యేష్ఠపుత్త్రుఁ । డగు వేంకట నృసింహారావునాయుండు-
భవ్యచరిత్రుఁడా । పండితునకు । క్షితి నేరచించిన । శ్రీ
కృష్ణరుక్మిణీ । సంవాదమనెడు సుజ్ఞానశాస్త్ర । మనెడు
నీ సద్గ్రంథ । మును సరిచూడంగ - నవల రిజిష్టరు ।
నాదిగాఁగ॥

తే-గీ॥ సర్వకర్తృత్వమొసఁగితి । సత్యముగను । గందుకూరను
సీమలోఁ । గలుగు పమిడి । పాటి పుర వాసుఁడను నేను ।
భాసురముగఁ । బోలకం నారసింహా నా । ముండనొగిని॥

# శ్రీ భగవద్గీత

(నోరి గురులింగ శాస్త్రి టీకాతాత్పర్యముతో)

ఇది పదునెనిమిది అధ్యాయములుగల మహాగ్రంథము. గీతాశాస్త్ర మున్నచోట శ్రీహరియు సమస్తదేవతలను, మహర్షులను సమస్త పుణ్యతీర్థములును నుండును. ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పఠించువానికి సమస్తకష్టములు తొలగిపోవును. అతిరహస్యమగు యీ గీతాశాస్త్రమును శ్రీకృష్ణుడు మహాభారత యుద్ధభూమిలో అర్జునకు ఉపదేశించెను. ఈ గ్రంథము మహాపవిత్రమైనది. విశేష ఆశ్చర్యకరమైనది. మానవులు అవలంభింపవలసిన ధర్మమార్గముల నన్నిటిని లోకోపకారార్థమై శ్రీ కృష్ణ పరమాత్మ యీ గ్రంథములో విపులముగ వివరించి యుంచెను ఈ గ్రంథము శ్లోకం టీకా తాత్పర్యముతో చేరినది ప్యాలికోబైండు. 4 00

## వేదాంతరహస్య దర్పణము. అను

(జ్ఞానసుందరి వివేకసుందరికి చెప్పిన నూతనవిచిత్ర పతివ్రతల కథలు)

ఇందు జ్ఞానసుందరి వివేకసుందరికి చెప్పిన నూతన విచిత్ర పతివ్రతల కథలనేకముగలవు. ప్రతివిషయందును అనేక వేదాంత రహస్యములు గల శ్రుతి ప్రమాణ్యములతో తేట తెలుగులో వ్రాయబడియున్నది. ఈ గ్రంథమును అక్షరజ్ఞానముగల ప్రతి స్త్రీ పురుషులును ముఖ్యముగా పఠింపవలయు ననుటకు సందేహము లేదు. వెల 1-00

## శుక బ్రహ్మ కైవల్యము (అను) శ్రీ శుకమహాఋషి చరిత్రము,

శుకులు తనతండ్రివద్ద సమస్తమునేర్చి జనకచక్రవర్తి వలన సందేహనివర్తిం బొందిన అనంతరము, ఊర్వశియు రంభకును సంవాదరూపముగ అనేక దృష్టాంత శ్లోకములతో వ్రాయబడియున్నది. తుదిలేని సంసారసాగరమునబడి మునుగుచు దరిగానక తల్లడిల్లుచున్న పామరులు పైతము ఈ గ్రంథమును నొక్కసారి పఠించినయెడల వారు బ్రహ్మనిష్టులని తెలిసికొని సంసారసాగరమును తరింపగలరనుట నిశ్చయము. వెల 1-25

---

వలయువారు:— వెస్టువార్డు అండు కంపెని,

నెం. 12, ఇన్స్పెక్టరు [illegible] నాయుడు వీధి, మదరాసు-21.